# సౌగంధికప్రసవాపహరణము

## ద్విపద కావ్యము

శ్రీ రత్నాకరము గోపాలరాజుగారిచే

విరచితము



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే ప్రకటితము.



1949

# ఉపోద్ఘాతము

ఈ ద్విపదకావ్యము క్రీ. శ॥ 1868 సంవత్సరమున చెన్నపట్టణములో నేలటూరి సుబ్రహ్మణ్యముగారి విద్యావిలాస ముద్రాక్షరశాలయందు పిళ్లారిసెట్టి రంగయ్యనాయనివారిచే ముద్రింపఁబడి ప్రకటింపఁబడియెను. ఆప్రతి నామిత్రులగు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు నా కిచ్చి యందలి చరిత్రాంశములఁగూర్చి వ్యాసమును వ్రాయఁగోరిరి. తర్వాత గ్రంథపీఠికభాగమును జదివి, ఆంధ్రపరిషత్పుస్తక భాండాగారములోని తాళపత్రగ్రంథములను పరిశోధించి, లేఖకప్రమాదములను గొన్నిఁటి సంస్కరించి పరిషత్పత్రికసంచికలో (ఫిబ్రవరి-మార్చి-1937) నొకవ్యాసమును వ్రాసితిని.

రత్నాకరాన్వయుఁడైన ఈకవి భట్టుకులజుఁడు. తండ్రి పేరు కృష్ణమరాజు. తనకులగోత్రములను గ్రంథమునందు చెప్పకపోయినను, ఈ రత్నాకరవంశజులు భట్టుకులమువా రని రత్నా

కరము సుబ్బరాజు రచించిన తిమ్మభూపాలకాభ్యు దయములోని యీక్రింది సీసపద్యమువల్ల గ్రహింపనగును.

సీ. పృథుయజ్ఞవాటి నావిర్భవించిన వంది
వరవృత్తి యెవ్వారి వర్తనంబు,
బహువిధాభయదాన భాసమానపువిష్ణు
భుజశాఖ యెవ్వారి పుట్టినిల్లు,
శ్రీకాళహస్తిధాత్రీవల్లభ కటాక్ష
పంక్తి యెవ్వారికిఁ బ్రాణరక్ష
నవరసరసికులౌ కవిపుంగవులను
గ్రహపాత్ర మెవ్వారి కవనశైలి

గీ. యట్టి రత్నాకరము వారి యన్వయమునఁ
బ్రభవమునుబొంది దామరప్రభులవలన,
నగ్రహారాదిబహుమతు లందియున్న
యార్యచరితుల మావారి నభినుతింతు.

ఈకవి ద్విపదభాగవతమును, సకలలక్షణసార సంగ్రహ మను వ్యాకరణగ్రంథమును రచించెను. సకలలక్షణసారసంగ్రహముయొక్క వ్రాతప్రతి పరి షత్పుస్తకభాండాగారమునలో నున్నది. కాని ప్రతి

శిథిలము. మొదలును తుదయు గ్రంథమునందు లేవు. ఈగ్రంథములోని గద్య యిట్లు గలదు.

"శ్రీమద్వేంకటాచలాధ్యక్ష కరుణాసంలబ్ధాసాధారణ ప్రజ్ఞావిచక్షణాక్షణ ప్రబంధాంకాంధ్ర శబ్దజాలలక్షణబహుచిత్రకవిత్వరచనా చమత్కార రత్నాకర కృష్ణమరాజ గర్భరత్నాకరసుధాకర గోపాలసత్కవిరాజ ప్రణీతంబైన సకలలక్షణ సారసంగ్రహం బను ఛందంబునందు" (పరిషత్పుస్తక భాండాగార గ్రంథసంఖ్య 3471 ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రిక ఆరవసంపుటము పుట 353)

## భాగవతము దశమస్కంధము

పూర్వభాగము ప్రతి ప్రాచ్యలిఖితపుస్తక భాండారమున నున్నది (సంఖ్య 784) ఈగ్రంథములోని అవతారిక భాగము నిం దుదాహరించుచున్నాను.

" శ్రీకరమూర్తి దేశికచక్రవర్తి
భట్టమ శ్రీ చెన్నభట్టామి బోగడి

గట్టిగా నాదిమకవులు గీర్తించి
దిట్టఁడై మాకవులు దీమసం బెంచి
రత్నాకరాన్వయరాజితక్షీర
రత్నాకర సుధాకరత్వభాసితుఁడు
రాజిల్లు కృష్ణమరాజనందనుఁడు
రాజిత సకలకళా విచక్షణుఁడు
గోపాలసత్కవికుంజరుఁ డనఁగ
నేప్రొద్దు మహిలోన నింపొందువాఁడు."

ఇందలి శైలినిమిత్తము కొన్నిపద్యముల నిచ్చుచున్నాను.

"కలధౌత నవహేమ కవితవిశాల
నలినారిమండలోన్నతసౌధచయము
తారాపథోన్నత తపనీయతార
సార భాసురరత్నసౌధజాలములు
కమలానివాస సత్కల్యాణవిభవ
రమణీయమందిరారామభూములును
అరుదైన వేదశాస్త్రాదివిద్యలను
పరమేష్ఠి మెచ్చని బ్రాహ్మణోత్తములు
మంత్రతంత్రోపాయ మహిమలదేవ.
మంత్రిని మెచ్చని మంత్రిపుంగవులు"

పై రెండు గ్రంథములు నముద్రితములు. భాషో ద్ధారకులు ముద్రింతురుగాక.

## గ్రంథ ప్రాశస్త్యము

కృతికర్త యగు రావిళ్ల లింగభూపాలుఁడు కమ్మకులతిలకుఁడు. వెల్లుట్లగోత్రసంజాతుఁడు. ఈ లింగభూపాలుఁడును, ఇతని తండ్రి తాతలును, విజయనగరసామ్రాజ్య మేలిన సాళువ, తుళువ, ఆర్వీటి వంశనరపతుల సామంతులుగ నుండి, గజపతులతోడను, అశ్వపతులతోడను, వారొనర్చిన సంగ్రామములయందు సహాయులై, విజయములఁ జేకూర్చుచుండిరి. బాహుబలదర్ప శౌర్యసంపన్నులగు ఈకమ్మసామంతనాయకుల యుదంతము తత్కులమువారే గాక అఖిలాంధ్రలోకమును బ్రశంసింపఁదగినది.

కుమారధూర్జటి కృష్ణరాయవిజయమునం దీరావెలవారినిఁగూర్చి ప్రశంసించెను. రాయలు కళింగదిగ్విజయయాత్ర వెడలినప్పుడు తోడ్పడిన వీరనికాయములో రావెలవంశీయులు గలరు. వీరు

రాయలపక్షమునుండి సమరరంగమున గజపతి బలములతోఁ బోరాడినవిధము ఈక్రిందివిధమునఁ గవి వర్ణించెను.

ఉ. తీరుగ నా కువారుడు గడించిదిరప్పిన్ వెలుగోటివారలున్
రావెలవారుఁ గూడుకొని రాత్రి పగల్ చతురంగసేనతోఁ
జేవగఁ జూచినన్ తెలియనెంతయుఁ శక్యము గాని దుర్గమా
భూవరమౌళి గాంచి యొకపూలునె గినెద నంచు ను

[గు॰ద్వై. (3-59)]

విశ్వనాథనాయనిస్థానాధిపతి వ్రాసిన రాయవాచకములోఁ గమ్మనాయకుల ప్రస్తావన గలదు (పుటలు 65;84)

సౌగంధికప్రసవాపహరణమునందు కవివర్ణించినవిషయములు కొన్ని విజయనగరసామ్రాజ్యమేలిన సాళువ తుళువ ఆర్వీటువంశనృపాలుర కృతులందిన ఆంధ్రకావ్యములందును వర్ణితములయ్యెను. లింగభూపాలునిమూలపురుషుఁడగు మల్లభూపతి గుడిపాటి సమీపమున కుతుబుషాహిబలముల నెదుర్కొని యోడించి రాయలచే

బిరుదు లందె నని కవి వ్రాసియున్నాడు. ఈగుడిపాడు పూర్వము కొచ్చెర్లకోటసీమలోని యొక గ్రామము. (ఈగ్రామ మిప్పుడు నెల్లూరిజిల్లాలో ఆత్మకూరుతాలూకాలో నున్నది) పూర్వ మీకోటసీమ విజయనగరాధీశులచే రావెళవారు మన్నెరికముగా గ్రహించి, గుడిపాడులో నగళ్లకోటను గట్టించుకొని యచ్చటనుండియే యాసీమను పాలించుచుండి రని దువ్వపాడు కైఫీయతులో నున్నది.* సాళువ నరసింహరాయలు లోకవంక గజపతులతోడను, మఱియొకప్రక్క అశ్వపతుల తోడను యుద్ధము లొనర్చినసంగతి చరిత్రప్రసి

* ఈతాలూకాలు విజయనగరం వారు రావిళ్లవారు అనే కమ్మవారికి మన్నెరికానకు యిచ్చి, యింకా కొన్ని తాలూకాలు వారిస్వాధీనం చేసిరి గనుక వారు యీదువ్వపాటి పూర్వాన్న నాలుగు క్రోసులమీద కోటసీమలో గుడిపాడు అనే గ్రామంలో కోటపెట్టించుకొని, నగళ్లు కట్టించుకొని యీదువ్వపాడు తాలూకా ప్రభుత్వం చేసినారు (మేకంజీ వ్రాతప్రతులు 15-6-19)

ద్ధము. అతనికాలములోఁ దెలింగానా బహామనీ సుల్తాను సామంతుఁడుగ. కూలీకుతుబుల్ముల్కు అనునాతఁడు పాలించుచుండెను. ఇతఁడు క్రీ. శ. 1495 సంవత్సరము మొదలు క్రీ. శ. 1512 సంవత్సరమునకు సామంతుఁడుగనుండి,తర్వాత సుల్తానుని ద్రోసిరాజని ఆకడపటిసంవత్సరముననె కుతుబుశాహా యనునామమును దాల్చి స్వతంత్రుఁడై గోలకొండనుండి పరిపాలన మారంభించెను. ఆ కాలమున బీజపూరు, బీదరు, తెలింగానాలను బాలించెడు నవాబులందఱును విజయనగరరాజులతోఁ దఱచుగాఁ బోరాడుచుండిరి. మల్లభూపాలుడు పోరాడినది యీకుతుబుశాహాతోనై యుండును. కుమారుఁడగు తిప్పభూపతియు సాళ్వనరసింహరాయలపక్షమున గజపతులతోఁ బోరాడి యుండును.

ఈమల్లభూపాలుని పరాక్రమము వర్ణించు చాటువులు గొన్ని కలవు.

ఉ. అల్లవె కమ్మమూఁకలఁట నావల రావెలవంశచంద్రుఁడో
. మల్లయభూపదుర్ధర సమగ్ర బలంబులు మండలాగ్రముల్

ఝల్లపుటీ వెలుఖుసువ శంకరుటెక్కెము భువిదీర భూ
వల్లభ మల్లిఖార్జునుఁడుపంతము గెల్చెను ధాత్రిలోపలన్.

చ. గెలుపులరాజ ! రాజహితఖేలన ! దాతల సార్వభౌమ ! ని
శ్చలగుణశాల యాదవనిశాత్రవదుర్గవిఘాల మన్నె మూఁ
కలకలగుండుగండ! హతకల్మషకాండ ! సరెవ్వ రుర్వి నీ
కలఘుపరాక్రమక్రమజి తార్జున ! రావెల మల్లిఖార్జునా!

సీ. దురమందు నగివరకరిఘటలను గన్న
బూని డొక్కలు చిన్నపొడిచి మితరి
సమరశాత్రవ వీరసైంధవములఁ గన్న
కొమ్ములహుమ్మంచు గ్రుచ్చియెత్తి
మారొక్కన్న పగర్వరామన్నెగిబ్బలకనుల్
ఖురపుటాహతిరజస్స్ఫురణ నడఁచి
మాకు గులాములై మాఱొడ్డు నరిరాజ
వృషభంబులను నెక్కుటెడ్లఁ జేసి

గీ. పందులగు మన్నెగిబ్బలవాసి యుడిపి
రంకె లిడుచుండు నీవృషశంకరుండు
సమరరఘురామ ! రావెళ్ల సార్వభౌమ
వైరిహృద్భల్ల ! యుద్దండ వీరమల్ల !

సీ. గగ్గోలురాయనిగహ్వరంబే చాలు
నహితభూపతిగర్వ మపహరింప
ప్రతిపక్షసాళ్వభూపతిమాత్రమే చాలు
గడిదుర్గములకెల్ల దుడుకుఁ జూప
జగతి గోపాల నీసాహసంబే చాలు
వైరుల పురములఁ జూఱలాడ
గండరగండడన్గిండికాఁడే చాలు
విరచించు మన్నెల వెన్నుఁదన్న

గీ. అనుచు నృపతులు మూఁడుసింహాసనముల
బ్రస్తుతింతురు దేవ నీపౌరుషంబు
సమర రఘురామ! రావెల్ల సార్వభౌమ!
వైరి హృద్భల్ల! యుద్దండవీరమల్ల!

అయ్యపభూపాలునికుమారుఁడగు తిప్పనృపతి కందనవోలు ఆనవదికోటలను ముట్టడించి గెలు పొందె నని కవి వర్ణించియున్నాఁడు. అళియరామ రాయలతాతయైన రామరాజు సాళ్వనరసింహ రాలసామంతుఁడుగ నుండియాతని దండనాయ కుఁడై యాతని యాజ్ఞానుసారముగ కర్నూలు కోటను ముట్టడివేసినట్లు చరిత్రవల్లఁ దెలియు

చున్నది.* పై విషయమె రామరాజీయవసుచరిత్ర కావ్యములందును, ద్విపద, పద్యబాలభాగవతము లందును వర్ణితము. రామరాజీయములో,

సీ. మదకరి కోకటి కిర్వదిగుఱ్ఱములు గుఱ్ఱ
మునకును విలుకాండ్రు ముగురు విచ్చు
కత్తులవారిటెకాండ్రట్ల వర్తిల్ల
నిట్టి యేనుఁగులను జుట్టి మూఁడు
వేలయేనూఱు నుద్వృత్తితో నడపంగఁ
గందనోల్సాధింపఁగాఁ దలంచి
మొనద్రుంచి గట్టిగా ముట్టడి విరిన నా
బిబ్బిని మిక్కిలి యుబ్బణంచి

గీ. ప్రకటసప్తాంగములఁ గొని రామవిభుఁడు
కందనోల్రాజధానియుఁ గాఁగ వసుమ
తియంను నేలి మహామహావనీశుఁ బూనె
బలిమి కలిమి నాశావనీపకులఁ బెనుప.

వసుచరిత్రములో,

గీ. అతఁడు మతిమంతుఁ ధృతిశాంతుఁ దరిక్రాంతుఁ
డనుపమస్వాంతుఁ డాశ్రితవనవసంతుఁ

---

* Kurnool District Manual. P. 24

డనఘుతరకందనోలి మహాపురీని
శాంతుఁ డగురామమేదినీకాంతుఁ డలరు.

ద్విపద బాలభాగవతములో,

రామనృపాలుండు రాజేంద్రుఁ డౌదవె
.............................
సెందు నెన్నఁగఁ జాల నిద్ధశౌర్యమునఁ
గందనవోలి దుర్గంబులోనుండి
బుక్కరాయరామభూభుజుఁ డెల్లనృపులు
నెక్కువ యిది యని యెన్నంగఁజాలి
మీరులు డెబ్బది వేవురాశ్వికులు
చేరి కొల్వంగవచ్చిన సమ• నెరిరి
కలనంది పంచశరాంగాళంబునేసి
గెలిచెఁ దచ్చరితంబుఁ గీర్తింపఁదరమె.!

పద్యబాలభాగవతములో,

శా. గబ్బుల్ డెబ్బదివేవురాశ్వికులు
వేడ్కన్ గొల్వఁగాఁ గినృపే
న్మబ్బుల్ గప్పఁగఁ గందనోలు కొను
వేడ్కన్ జుట్టుముట్టన్ సహా

బిబ్బీ నుబ్బణగించితోలె నరి
రాడ్బీమ్ముండు..............
...............బుక్క
భూవిభుని రామాధీశుఁ డాహా యనన్.*

లింగభూపాలునికుమారు లగు కొండన్నృపతియు, అయ్యపనాయకుఁడును, తిమ్మరాజు అతనికుమారుఁడు అళియరామరాయలకాలములో సామంతదండనాయకులై మహమ్మదీయవైరినికాయములఁ జెండాడుచుండి రని తెలియుచున్నది. కొండన్నృపతి మానవపురిచెంత నేదులఖానుని జయించినట్లును, అయ్యపనాయకేంద్రుఁడు రామరాజదత్తకిరీటరమ్యభూషణుఁడై నట్లును కవి వర్ణిం

*రామరాజీయము పుట. 38, 39; పద్యము 209.
వసుచరిత్ర ఆశ్వాసము. 1. పద్యములు 29, 30.
ద్విపదబాలభాగవతము. ప్రథమస్కంధము. ప. 191-195.
శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారు పద్యబాలభాగవతమునుండి వ్రాసినపద్యములు భారతిపత్రిక. సంపుటము 6. సంచిక 6.

చినాఁడు. ఇట్లె అళియరామరాయలతండ్రియైన తిమ్మరాజు మానవపురికడ నేదులఖానుని జయించి నట్లును, ఆదవేనిదుర్గమును సాధించినట్లును ద్విపద, పద్య, బాలభాగవతములందును వర్ణింపఁబడెను.

ద్విపదబాలభాగవతములో,

“ రాజచంద్రుండు రామరాజు తిమ్మయ్య

.............................

కడిమిమైఁ మానువకడరణక్షోణి,

గడుపరి నేదులఖాను జయించె

విక్రమంబున నాదవేనిదుర్గంబు

విక్రాంతు లెన్నంగ వేవేగ సాధించి”

పద్యబాలభాగవతములో

సీ. మానువకడ సవాబూనిపో రముబరా

జయము నొందించెనే శౌర్యశాలి*

.........................

*ద్విపదబాలభాగవతము చెన్నపట్టణములో వేదము ఆండుకంపెనీవారు వారి విజ్ఞానగ్రంథమాలికలో ముద్రింపఁ

పై విషయిమే ముక్కుతిమ్మనార్యకృతపారిజాతాపహరణమునందును జెప్పఁబడినది. కృష్ణదేవరాయలతండ్రియైన ఈశ్వరనరసింహరాయలు మానవేంద్రు నోడించినవిషయము ఈక్రిందిసీస పద్యముపాదమున మనోహరముగా, కవి వర్ణించి యున్నాఁడు.

"పారశీకునకు దుర్భరమానవత్వంబుఁ
దొలఁగించె మానవదుర్గసీమ."

## కృతిభర్త - లింగభూపాలుఁడు

ఈలింగభూపతిని భాస్వద్భుజావీర్యనిర్దళితారాతునిగాఁ గవివర్ణించెను. ఇతఁడు సుల్తానిఅబ్దుల్ పాదుశాహానుజయించి యతనిని పెనుగొండ వఱకును దఱిమివేసె ననియు, డాబాలు పైబడి

---

బడినది కాని అసమగ్రము. ఇది పూర్తిగ ముద్రింపవలసిన భారము భాషోద్ధారకులగు శ్రీ వేంకటేశ్వరశాస్త్రి గారిపై నున్నది. పద్యబాలభాగవతమునుండి కొన్నిపద్యములు శ్రీ వేంకటరమణయ్యగారు రచించిన బాలభాగవతపీఠికనుండి గ్రహింపఁబడినవి. (భారతిసంపుటము. 6. సంచిక. 6.)

క్రీ. శ. 1640 తర్వాత నీప్రాంతమంతయు గోలకొండ నవాబు వశమయ్యెను. (నెల్లూరు జిల్లా) ఇప్పటి అనంతపురము, చెంగల్పట్టు, కడప, తిన్నవిల్లి, మైసూరు ప్రాంతములు వేంకటపతిరాయలపరిపాలన క్రిందనే యుండెను.

లింగభూపతి "డాబాలుపై బడి డాగులుచేసెనని" కవి వర్ణించెను. ఈడాబాలు అనునది పశ్చిమతీరముననున్న డాబుల్ (Dabul)పట్టణ మేమో యని సందేహము గలుగుచున్నది. ఆకాలమున ఆపట్టణము పోర్చుగీసువారివశమున నుండెను. ఆ పట్టణముపై దండువెడలుటకును, పోర్చుగీసువారికిని, విజయనగరసామ్రాజ్యాధీశులకును పోరాట మేల సంభవించెనో తెలియదు. ఈవిషయము పరిశీలింపఁదగినది.

---

కొమటఁ నుండు సహాయుఁడై వచ్చియుండునని శ్రీవెంకటరమణయ్యగారు తలంచుచున్నారు.

(Sources of Vijayanagar. Vol I. P. 369)

## శాసనములందలి రావెళ్లవారిచరిత్ర

నెల్లూరిజిల్లా శాసనసంపుటములనుండి రావెల వంశీయులగు ముటికొందఱు సమ్మనాయకులచరిత్ర తెలియవచ్చుచున్నది. రాజరాజదేవుని పండ్రెండవ పరిపాలనసంవత్సరమునందాక రావిళ్లనాయకుని ప్రస్తావన గలదు. ఇదియు రావిళ్లవారినిగూర్చి చెప్పెడి యత్యంతమైన ప్రాచీనశాసనమును, ప్రథమశాసనమునై యున్నది.*వీరిలోఁ గొందఱు నెల్లూరు జిల్లాలో నుదయగిరి, పొదిలి, కొచ్చెర్ల కోట సీమలఁ బాలించుచుండిన సామంతనాయకులు గలరు. వీరును వెల్లుట్లగోత్రులే. పొదిలి సీమను బరిపాలించిన రావెల తిప్పానాయకుఁడును, ఉదయగిరిసీమను బాలించిన రావెల కోనేటి చిన తిమ్మానాయకుఁడును ముఖ్యులు. సౌగంధికప్రసవాపహరణములోని రావెలవంశీయులకును, పై శాసనములందలి రావెలవారికిని బరస్పరసంబంధము వీరివంశావళినిబట్టి నిర్ణయించుట దుష్కట

* B. V. Nellore Inscriptions. S (6)

ముగా నున్నది. భావిపరిశోధనమునఁగాని బయలు పడదు.*

కర్నూలు జిల్లాలో శ్రీగిరిమండలమేలిన మఱి యొక రావెళవంశీయులు గలరు. వీనివంశ మీ దిగువ నీయఁబడినది.




ఈకడపటి మల్లభూపతి కర్నూలుజిల్లా వెంక టాద్రిపాలెమునందు క్రీ. శ|| 1612 లో వ్రాయిం చిన శాసనమునుబట్టి, యితఁడు శ్రీశైలప్రాంత మును బరిపాలించుచుండె నని తెలియుచున్నది. ఈశాసనములో నితఁడు తనపూర్వులు మన్నెరిక ముగా సంపాదించిన కొచ్చెర్లకోటసీమలోని సిం

* నెల్లూరిజిల్లా శాసనసంపుటములలో నీక్రిందిశాసన ములఁ బరిశీలింప నగును. D. 35; G. 52; G. 84; N. 33; N. 124; G. 112; P. 19.

గారికొండ, బొట్టెపాడు అను రెండుప్రాంతములును, వెంకటాద్రిపాలెములోని (ఇప్పటి మార్కాపుర ముతాలూకా) చెన్నరాయస్వామివారి యుత్సవముల నిమిత్తము దానముచేసె నని తెలుపఁబడినది.* సౌగంధిక ప్రసవాపహరణములోని మల్లభూపాలునివంశమునకును, ఈమల్లనాయకునివంశమునకును సంబంధ మున్నట్లు గనఁబడదు.

## చెన్నభట్టరు - దేశికశిఖామణి

ఈకవి రంగనాయకపాదరాజీవయుగ్మసేవకుఁడగు శ్రీచెన్నభట్టరాచార్య గురువరేణ్యం బొకనిని స్తుతించెను. ఈ చెన్నభట్టరాచార్యుఁడు లింగమగుంట తిమ్మకవియు, నతనిసమకాలికుఁ డగు తెనాలిరామకృష్ణుఁడును వారివారిగురువుగావర్ణించిన చిక్కభట్టరాచార్యుడే మోయని తలఁచెదను.

క. గురురాయపట్టభద్రుని
నరహరు శ్రీరంగనాయకాంశభవుక్ భ

---

*Para 55 of to Epigrapical report 1923-1924. *Vide* No. 423 of 1923.

ట్టరుచిక్కాచార్యులు మ
ద్గురుఁ దలంచుచు నడుగులకు నతుల్గావింతున్.

*తిమ్మకవి—చతుర్వాటికామాహాత్మ్యము*

క. వాక్కాంతాశ్రయభట్టరు
చిక్కాచార్యులు మహాత్ము శ్రీగురుమూర్తిన్
నిక్కపుభక్తి భజించెద
నిక్కవ్యకళాకలాప మీడేఱుటకున్.

రామకృష్ణకవి—పాండురంగమాహాత్మ్యము.

పాండురంగమాహాత్మ్యము క్రీ. శ॥ 1565ప్రాంతమున రచింపఁబడెనని శ్రీరామకృష్ణకవిగారు నిర్ణయించినారు. క్రీ. శ॥ 1584 సంవత్సరమున రచింపఁబడిన కామందకకృతిలో దత్కృతికర్తలగు వేంకటరామకృష్ణకవులు పై చిక్కాచార్యుని గృతిపతి సంబోధనమునఁ బేర్కొనిరి.

క. శ్రీచంచద్భట్టరు, చి
క్కాచార్య-వర్యశిష్యయతులితశౌర్య
ప్రాచుర్యవీర్య, గుణర
త్నాచలజయలలితధైర్య నయతత్త్వనిధీ.

గోపాలకవియు దేశికచక్రవర్తి యగు గురువు నీక్రింది విధముగ స్తుతించెను.

"చిరతరకీర్తిదేశికచక్రవర్తి
రంగనాయక పాదరాజీవయుగ
సంగతషట్పదాంచితచంచరీక
భట్టరు శ్రీచిన్నభట్టరాచార్య"

ఈ దేశికచక్రవర్తి పదునాఱవ శతాబ్దాంతము వఱకు నివసించి యుండవచ్చును. రత్నాకరము గోపాలకవియు బదునాఱవశతాబ్దాంత్యమునుండి (1575) పదునేడవశతాబ్దమధ్యమువఱకు (1650) నివసించియుండెను గనుక, పైచిక్కభట్టరునకు శిష్యుఁడై యుండనోపు. ఇది యూహ. భావిపరిశోధనలవల్లఁగాని తెలియదు. కడపటి యార్వీటి యుర్వీపతులు వారిసామంతులు వైష్ణవగురువరేణ్యుల బోషింపుచుండిరి. ఇట్టి దేశికశిఖామణుల మతాభినివేశమే, ఉద్భటారాధ్యచరిత్ర కారుఁడగు రామలింగకవిని, రామకృష్ణకవిగాను, పాండురంగమాహాత్మ్య కృతికర్తనుగా నొనరించుట సంభవించినది. ఆ కాలములో నీవైష్ణవదేశికశిఖామణుల ప్రతిభయుఁ బలుకుఁబడియు ప్రబలముగా నుండెను.

# రావిళ్ల వారివంశవృక్షము

మల్లభూపతి

|

తిప్పభూపాలుడు = పెద్దమాంబ

|

- అయ్యప్పనాయుడు = లక్కమాంబ
  - |
  - తిప్పభూరమణుండు = వెంగమాంబ
  - |
  - లింగనృపతి = సిద్ధాంబిక
    - |
    - (one child's name not printed)
    - అయ్యపనాయకుండు
- వెంకటాద్రి


కొండభూపాలుడు = వెంగమాంబ
కొండనృపతి
వేంకటనృపాలుడు
లింగభూపాలుడు=భాస్కరాంబ
ముద్దులనాయడు=
తిరుమలాంబ
రామభద్రుడు
వెంగనృపతి.

## కథ - శైలి.

సౌగంధికప్రసవాపహరణమును గూర్చిన విషయము మహాభారతములోని అరణ్యపర్వమునందు గలదు. (ఆంధ్రమహాభారతమున, అరణ్యపర్వము, తృతీయచతుర్థాశ్వాసములు) మూలములోని కథను బెంచి, కవి మూఁడాశ్వాసములలో నీయితివృత్తమును రచించెను. హనుమద్దర్శనమును, యక్షులతోడి యుద్ధమును మణిమద్వధయు మొదలైన వృత్తాంతములు నందును నిందును గలవు. భారతములోని కథచొప్పున ధనంజయుఁడీసమయమున సురావాసియందుండెను. ఈకథలో నర్జునుఁడు దేవలోకమునుండి వచ్చుటయు, యక్షనాగునితో యుద్ధ మొనర్చుటయుఁ, గౌరవులు పాండవులకుఁ దోడ్పడుటయు, నారదాగమనమును, హరిహరాదుల పోరాటము, చతురాస్యుఁడు సత్యలోకమునుండివచ్చి కేశవుల శాంతంబు నొందించి, హతులైనవారిని బ్రదికించి, యుద్ధము విరమింపఁ జేయుటయూ, మొదలగు నూతన విష

యములను గవి కల్పించి, మనోహరముగ వర్ణించి నాఁడు. కవి రసజ్ఞుఁడు. కవిత నిర్దుష్టము. ఈకావ్యము కవితాకల్పనమున గోపప్రధాని ప్రణీత ద్విపద కృష్ణార్జున సంవాదమునకన్న మిన్నయైనది. కావ్యశైలిని దోనేరు కోనేరు కవికృత బాలభాగవతమున కించుకేనియుఁ దీసిపోవదు. లింగభూపాలుని కీర్తికాంతావర్ణనము (పుట 43) సూర్యాస్తమయవర్ణనము (పుట 141) రసవత్తరములు.

ద్విపద సౌగంధిక ప్రసవాపహరణకావ్యమును గోపాలకవివంశమువాఁడైన రత్నాకరము అప్పప్పకవి పద్యకావ్యముగ రచించెను. కాని కవిత్వము పేలవముగా నున్నది. ఈగ్రంథము చెన్నపట్టణములోని వెస్టువార్డు కంపెనీవారిచే క్రీ. శ. 1937 సంవత్సరములో ప్రచురింపఁబడినది. పీఠికలోని సీసపద్యభాగము నిందిచ్చుచున్నాను.

సీ. రత్నాకరాన్వయరాజశేఖరుఁడైన
మద్వెంకకర్తృసన్మాన్యధనుఁడు

గోపాలరాజుచే రూపింపఁబడినట్టి ॥
దివ్యసౌగంధికద్విపదకావ్య
మప్పుడుపద్యకావ్యంబుగా రచియింపఁ
దలఁచి భూసురులకు పండిత మొసఁగి

... ... ... ...

## కృతజ్ఞత.

రత్నాకరగోపాలకవినిగూర్చి మొట్టమొదట శ్రీనిడుదవోలు వేంకటరావుగారు విజయనగర కళాశాలవారిమాసపత్రిక (1929) సంపుటము 7. 2-వ సంచికలో నొకవ్యాసము వ్రాసిరి. తర్వాత తద్గ్రంథములోని చారిత్రకవిషయముల1937 సంవత్సరములో నాంధ్రపరిషత్పత్రికయందు బ్రకటించితిని. వావిళ్ల భాషోద్ధారకులగు శ్రీవేంకటేశ్వర శాస్త్రిగారు నాకోర్కెపై గ్రంథమును బ్రకటింతుమని 1939 సంవత్సరము జనవరినెలలో నాకొకలేఖ వ్రాసియుండిరి. ఇంతలో యుద్ధమారంభమగుటయు, కాకితములకు గఱు వేర్పడుటయు, సంభవించెను. శ్రీవేంకటరావుగారు ఉద్యోగదేశ

మునఁ జెన్నపట్టణము వచ్చుటయు, గ్రంథప్రకటనమున కుద్యుక్తులైన శ్రీ శాస్త్రిగారికి గ్రంథముద్రణము కూర్చి ప్రోద్బలము గలిగించుటయు సంభవించినది. వెంటనే గ్రంథముముద్రణము ప్రారంభించి, వారు నాకెరుకపఱచిరి. భాషోద్ధారక నామమును వారి కనర్థనామ మగుట కట్టికార్యములే గదా కారణములు! ఈపీఠిక వ్రాయుటకు నాకు సాయమొనర్చినవారు శ్రీ వేంకటరావుగారును, శ్రీ సోమశేఖరశర్మగారును; శ్రీ నేలటూరి వేంకటరమణయ్యగారి వ్యాసములును నా కుపయోగపడినవి. కవిచరిత్రకారులగు శ్రీ క్రొత్తభావయ్యచౌదరి గారు వారు రచించినచరిత్రలో నా మొదటివ్యాసములోని విషయములు గ్రహించి, యావిషయము గ్రంథములలో నుల్లేఖించిరి. ఈపీఠికరచన యెడల వారిగ్రంథమును బరిశీలించితిని. పై వారి యందఱకు నానమోవాకములు. పరిషత్పుస్తక భాండాగారములోని తాళపత్రప్రతులనొసఁగి, అడిగినతత్క్షణము నాకు కావలసినవిషయసామగ్రి

కార్యాంతరవ్యగ్రుఁడయ్యును బంపించుచుండిన, పరిషత్కార్యదర్శియు, నామిత్రుఁడు నగు రాఘవాచారి (ఎం. ఏ, బి. యల్.) గారికి నమస్కారములు.

లేఖకదోషములు, ముద్రణస్ఖాలిత్యములు సవరించుటకు అవకాశము నాకు లభింపలేదు. ఈ ప్రమాదము మానవప్రకృతి పాఠకులు మన్నింతురుగాక! దోషములు రెండవముద్రణకాలమున సంస్కరించెదము.

5-2-1949. కుందూరి ఈశ్వరదత్తు.

# విషయసూచిక


| విషయము. | | పుట. |
|---|---|---|
| పీఠిక | ... | 1 |
| కృతిపతివర్ణనము | ... | 10 |
| కృతిపతివంశానువర్ణనము | ... | 19 |
| సమ్మనులము | ... | 20 |
| మల్లభూరమణుఁడు | ... | 21 |
| తిప్పభూపతి | ... | 22 |
| తిప్పభూపతిభార్య పెద్దమాంబ | ... | 23 |
| అయ్యపనాయనిభార్య లక్కమాంబ కుమారుఁడు తిప్పభూపతి | ... | 24 |
| తిప్పభూపతిభార్య వెంగమాంబ : కుమారుఁడు లింగభూపాలుఁడు | ... | 26 |
| లింగభూపాలునిభార్య సిద్ధమాంబ, కుమారులు కొండభూపతి అయ్యపనాయఁడు | ... | 27 |
| కొండభూపాలునిసంతానము | ... | 28 |
| వెంకభూపతి | ... | 28 |

| విషయము. | | పుట. |
|---|---|---|
| లింగభూపతి | ... | 29 |
| ముద్దులనాయఁడు | ... | 29 |
| కొండభూపాలునిసోదరుఁడు అయ్యపనాయకుని ప్రభావము | ... | 30 |
| ఆతనికుటుంబము | ... | 30 |
| కొండభూపాలునిపరాక్రమము | ... | 32 |
| కొండభూపాలునిసంతానము | ... | 34 |
| లింగభూపతి : కృతికర్త | ... | 35 |
| లింగభూపతిభార్య భాస్కరాంబ. | ... | 36 |
| లింగభూపతికుమారుఁడు రామభద్రుఁడు | ... | 37 |
| లింగభూపతిపరాక్రమము | ... | 37 |
| ముద్దులనాయనిభార్య తిమ్మలాంబ : కుమారుఁడు వెంగభూపతి | ... | 41 |
| భాస్కరాంబవర్ణనము | ... | 42 |
| లింగభూపాలునికీర్తి కాంతావర్ణనము | ... | 43 |


## ప్రథమాశ్వాసము


| | | |
|---|---|---|
| కథాప్రారంభము | ... | 49 |
| ఉదగిరిపావన వర్ణనము | ... | 50 |

| విషయము. | | పుట. |
|---|---|---|
| పాండవులు బదరికావనమున నివసించుట | ... | 54 |
| వసంతకాలవర్ణనము | ... | 54 |
| భీముఁడు కందమూలములఁ దేఁబూనుట | ... | 57 |
| ద్రౌపది భీమునితోఁ గూడ వనవిహారము సేయఁ గోరుట | | 58 |
| ధర్మరాజు వల దనుట | ... | 59 |
| ద్రౌపది నిష్ఠురోక్తులాడుట | ... | 60 |
| భీముఁడు ద్రౌపది నంపు మనుట | ... | 63 |
| ధర్మరాజు సంశయించుట | ... | 64 |
| భీముని సమాధానము | ... | 65 |
| నకులుఁడు ద్రౌపదిని పంపు మనుట | ... | 66 |
| సహదేవుఁడు ద్రౌపది నంపు మనుట | ... | 81 |
| ధర్మజుని సంశయము | ... | 83 |
| ధర్మరాజు ధౌమ్యాచార్యు నడుగుట | ... | 84 |
| ధౌమ్యుఁడు ద్రౌపది నంపు మనుట | ... | 84 |
| ధర్మరాజొడంబడుట | ... | 85 |
| భీముఁడు ద్రౌపదితో వనమున కరుగుట | ... | 86 |
| ధర్మరాజువిచారము : నకులుని భీముని వెంటఁ బొమ్మనుట | | 87 |
| నకులుని ప్రత్యుత్తరము | ... | 89 |

| విషయము. | | పుట. |
|---|---|---|
| ద్రౌపదీదేవివనవిహారము | ... | 90 |
| గంధమాదన పర్వతవర్ణనము | ... | 104 |
| సూర్యాస్తమయసమయము | ... | 111 |
| భీముఁడు ద్రౌపదితో ధర్మజునకడకుఁ బోదమని చెప్పుట | | 112 |
| ద్రౌపది అంగుల కిష్టపడుట | ... | 114 |
| సౌగంధికము వచ్చి వారలకడఁ బడుట | ... | 114 |
| ద్రౌపది సౌగంధికములఁగొన్నింటిఁ దెమ్మని భీమునడుగుట | | 115 |
| ద్రౌపదీ భీముల సంవాదము | ... | 116 |
| నారదాగమనము | ... | 121 |
| నారదభీములసంభాషణము | ... | 122 |
| నారదుఁడు ఘటోత్కచుని నంపునిచి కవలఁ ములఁ దెచ్చుటకుఁ బొమ్మనుట | ... | 124 |
| నారదుఁడు భీమునితో నతనికిఁ గార్యమునం దొక మహాత్ముఁడు సాయపడు నని తెల్పుట | | 124 |
| ఘటోత్కచుఁడు భీమునికడకు వచ్చుట. | ... | 125 |
| ద్రౌపదియొద్ద భీముఁడు ఘటోత్కచు నునిచి సౌగంధికముల కరుగుట | ... | 128 |
| ద్రౌపది సంతాపము | ... | 130 |

విషయము. | పుట.


ఘటోత్కచుని సాంత్వనము ... 139
సూర్యాస్తమయవర్ణనము ... 141
చంద్రోదయవర్ణనము ... 144
మలయమారుతవర్ణనము ... 147
కళానదీవర్ణనము ... 148
భీముని ప్రయాణము; ఆతఁడు శంఖమును బూరించుట 151
ఆంజనేయుఁడా శంఖారావమును విని లేచుట 152
భీముఁడు హనుమంతునిఁ జూచుట ... 154
భీమహనుమంతుల సంవాదము ... 154
ఆంజనేయుఁడు నిజరూపమును దాల్చుట ... 181


## ద్వితీయాశ్వాసము


భీముఁడు హనుమంతుని విశ్వరూపమును జూడఁగోరుట 187
హనుమంతుఁడు చెప్పిన యుగధర్మములు ... 190
హనుమంతుఁడు విశ్వరూపమును చూపుట ... 192
హనుమంతుఁడు సౌగంధికములున్న తెలవు చెప్పుట 195
భీముఁడు సౌగంధిక జలజాకరము సమీపించుట 201
భీమ, యక్షరాక్షస సంవాదము ... 201
భీముఁడు యక్షరాక్షసులతోఁ బోరుట ... 205

విషయము. ... పుట.

వాతశేషులు కుబేరునికి భీమునివృత్తాంతమును దెలుపుట 213
నలకూబరుఁడు యుద్ధమునకు వెడలుట ... 215
తూర్పుతెల్లవాఱుట ... 218
సూర్యోదయము ... 219
ఘటోత్కచుఁడు ద్రౌపదీసహితుఁడై ధర్మరాజు
కడ కేఁగుట ... 221
ధర్మరాజు భీమసేనుఁడేడ యని యడుగుట... 221
ద్రౌపది భీమునివృత్తాంతము ధర్మరాజుతోఁ జెప్పుట 222
ధర్మజనయు ఘటోత్కచుల సంభాషణలు ... 223
నారదాగమనము ... 225
నారదుఁడు ధర్మజునకు భీమనలకూబర యుద్ధము
సంగతిని తెల్పి సహాయముసేయఁ బొమ్మని చెప్పుట 226
ఘటోత్కచుఁడు తండ్రిసహాయార్థ మరుగుట 228
నారదుఁడు కరిపురమునకుఁ బోవుట ... 229
నారదుఁడు భీమునివృత్తాంతము, ధర్మరాజాదులు
సాయము వెడలుటయు, నాటి కగలసంగతు
లు దెల్పుట ... 229
దుర్యోధనాదుల దుర్మంత్రము ... 231
దుర్యోధనుఁడు సైన్యములతో బయలుదేరి కావనమున
కరుగుట ... 235

| విషయము. | | పుట. |
| --- | --- | --- |
| పాండవులందు లేకుండుట | ... | 235 |
| భీష్ముఁడు దుర్యోధనునకు హితము చెప్పుట... | | 237 |
| కర్ణగాంగేయ సంవాదము | ... | 238 |
| కురురాజగురుసూనుల సంభాషణము | ... | 240 |
| కర్ణగురుసూనుల సంవాదము | ... | 241 |
| ద్రోణుఁడును, దుర్యోధనుఁడు న[illegible] నిం[illegible]ంచుట | | 242 |
| ద్రోణుఁడు దుర్యోధనునితోఁ బ్రసంగించుట, అతఁడు చెప్పిన హితము | ... | 242 |
| కర్ణుఁడు, ద్రోణుని దూషించుట | ... | 244 |
| కర్ణ, కృపాచార్య సంవాదము | ... | 246 |
| కర్ణుఁడు, కృపునిపై [illegible] | ... | 247 |
| అశ్వత్థామ, కర్ణుని శిరము మోదుట | ... | 248 |
| కర్ణ, అశ్వత్థామల యుద్ధము | ... | 248 |
| దుర్యోధనుఁడు వారిని నివారించుట | ... | 249 |
| ఘటోత్కచుఁడు ధర్మజునితోఁ గౌరవులరాక [illegible]ంగించుట | ... | 250 |
| ధర్మజుని భయసంతాపము | ... | 252 |
| ఘటోత్కచుఁడు ధర్మరాజునకు ధైర్యము చెప్పుట | | 253 |

| విషయము. | | పుట. |
|---|---|---|
| కురు, పాండవుల యుద్ధము | ... | 256 |
| దుర్యోధనుఁడు,, ఘటోత్కచునితో సంధియొనర్చి పాండవులకు సహాయుఁడై పోవుట | ... | 269 |
| నలకూబరుఁడు యుద్ధమునకు సన్నద్ధుఁడగుట | | 272 |
| ధర్మరాజు భీమునొద్దకు వచ్చుట | ... | 273 |
| అమరావతిలో అర్జునునకు నారదుఁడు, భీమునకును కుబేరునకును యుద్ధము సంభవించిన సంగతి తెల్పుట | ... | 274 |
| అర్జునుఁడు ధర్మరాజాదులకడ కేతెంచుట | ... | 275 |
| జాంగళుఁడొనర్చిన యుద్ధము | ... | 290 |
| నలకూబరునియుద్ధము | ... | 294 |
| ఘటోత్కచుఁడు కూలుట | ... | 296 |
| భీమునియుద్ధము | ... | 297 |
| నలకూబర, భీమసేనుల సంవాదము | ... | 303 |
| భీముఁడు మూర్ఛిల్లుట | ... | 309 |
| అర్జునునియుద్ధము | ... | 310 |
| ద్రౌపదీశోకము | ... | 312 |
| ద్రౌపదికి అర్జునుఁడు ఊరార్చుట | .. | 314 |

| విషయము. | | పుట. |
|---|---|---|
| నలకూబరార్జునులసమరము | ... | 314 |
| కుబేరుఁడు యక్షవీరులఁ బొగడుట | ... | 330 |


## తృతీయాశ్వాసము


| | | |
|---|---|---|
| ధర్మరాజు సంధిసేయఁ బూనుట | ... | 337 |
| గాండీవి దాని కొఁదఁబడకుండుట | ... | 338 |
| కుబేరుఁడు పాండవులతో యుద్ధమున కిష్టపడకుండుట | | 339 |
| మణిమంతుఁ డొప్పుకుండుట | ... | 340 |
| ఉభయపక్షములకును సంకులసమర మగుట | ... | 341 |
| కుబేరార్జునులసంవాదము | ... | 345 |
| కుబేరార్జునులయుద్ధము | ... | 349 |
| ఉభయపక్షముల పోరాడుట | ... | 350 |
| కర్ణుని బలపరాక్రమములు | ... | 358 |
| కర్ణమణిగ్రీవులయుద్ధము | ... | 360 |
| కర్ణునిపలాయనము | ... | 363 |
| అశ్వత్థామ కర్ణునికి సాయపడుట | ... | 364 |
| కుబేరార్జునుల యుద్ధము, అర్జునుని మూర్ఛ | ... | 367 |
| ఘటోత్కచునియుద్ధము, అతఁడు మూర్ఛిల్లుట | | 368 |

| విషయము. | పుట. |
|---|---|
| హనుమంతుఁడు ఈశ్వరునితో యుద్ధముసేయుట ఉభయపక్షములవారికిని జరిగిన చిత్రయుద్ధము | 370 |
| నారదుఁడు ద్వారకాపురమునకు వచ్చుట... | 375 |
| కృష్ణదర్శనము ... | 377 |
| నారదకృష్ణ సంవాదము ... | 377 |
| కృష్ణుఁడు పాండవులకు సహాయము సేయఁబూనుట | 379 |
| నారదుఁడు కైలాసమున కరుగుట ... | 380 |
| శివుని సందర్శనము ... | 382 |
| నారద శివుల సంభాషణలు ... | 383 |
| శివుఁడు దుర్యోధనునకు సాయపడ సిద్ధమగుట ... | 384 |
| పరమేశ్వరుఁడు దుర్యోధనుని పగ్గఱకు వచ్చుట... | 386 |
| ధర్మరాజు చింతించుట .... | 387 |
| భీష్ముఁడు ధైర్యము సెప్పుట ... | [illegible] |
| గాంగేయ కర్ణసంవాదము ... | 390 |
| ఘటోత్కచ కర్ణ సంవాదము ... | 392 |
| సురనరకిన్నరయుఁడు వారిని వారించుట ... | 393 |
| హరి పాండవులకు సహాయము వచ్చుట ... | 395 |
| కర్ణ కృష్ణ సంవాదము ... | 399 |

| విషయము. | | పుట. |
|---|---|---|
| అర్జునుఁడు కర్ణుని దూషించుట | ... | 401 |
| కృష్ణుఁడు కర్ణునిఁ బొగడుట | ... | 402 |
| కర్ణుఁడు భీష్మ ద్రోణాదుల దూషించుట | ... | 403 |
| భీష్ముని వచనము | ... | 405 |
| కృష్ణుఁడు యుద్ధమునకు సన్నద్ధుఁడగుట | ... | 407 |
| శంకరకుబేర సంభాషణము | ... | 408 |
| ఘటోత్కచుఁడు శివునితో యుద్ధంబుసేయుట | | 423 |
| అభిమన్యుఁడు యుద్ధమునందు మూర్ఛిల్లుట | ... | 424 |
| ఘటోత్కచుఁడు మూర్ఛిల్లుట | ... | 430 |
| కృష్ణుఁడొనర్చిన యుద్ధము | ... | 431 |
| హరిహర సంవాదము | ... | 435 |
| హరిహరుల సమరము | ... | 437 |
| బ్రహ్మదేవుఁడు హరిహరుల కడ కేతెంచుట, వారల స్తుతించుట | ... | 439 |
| యుద్ధముమానుట | ... | 442 |
| హరిహరులు ధర్మయక్షనాథులకు సఖ్యమును జేయించుట | ... | 443 |
| ధర్మజువరము | ... | 445 |

| విషయము. | పుట. |
|---|---|
| యుద్ధమునఁజచ్చినవారు మఱల బ్రదుకుట... | 447 |
| శివుఁడు కుబేరునితో సౌగంధికములను బాండ వుల కిమ్మని చెప్పుట ... | 448 |
| కుబేరుఁడు సౌగంధికములఁ దెచ్చియిచ్చుట... | 449 |
| హరిహరుల సంతోషము ... | 450 |
| బ్రహ్మ సత్యలోకమునకుఁ బోవుట ... | 451 |
| కుబేరుఁ డలకాపురమునకుఁ బోవుట ... | 451 |
| శివుఁడు కైలాసమునకుఁ బోవుట ... | 452 |
| దుర్యోధనుఁడు కరిపురంబునకుఁ బోవుట ... | 452 |
| కృష్ణుఁడు ద్వారక కేఁగుట ... | 452 |
| ఘటోత్కచుఁడు వెడలుట ... | 453 |
| తర్వాతి భారతకథ ... | 453 |



శ్రీరస్తు.

# సౌగంధికప్రసవాపహరణము

## పీఠిక

---

శ్రీరామచంద్రుఁ డాశ్రితవత్సలుండు
తారకబ్రహ్మావతారుఁ డచ్యుతుఁడు
సుమశరాసనుగన్న సుందరాంగుండు
నముచిసూదనముఖ్య నానాదిగీశ
రాజకాంతివిలాసరాజితపాద
రాజీవుఁ డంభోజరాజవంశజుఁడు
నీలాతసీసూన నీరదశ్రీక
నీలవర్ణుఁడు దయానిర్మలాత్మకుఁడు
జానకీచిత్తాంబుజాతమిత్రుండు
భూనుతమాణిక్యభూషణాన్వితుఁడు

పరిపంథి దైతేయబలభేదనుండు
హరివర్ణితుఁడు శరణార్తరక్షకుఁడు
దశరథధారుణీతలనాథగర్భ
విశదాబ్ధిచంద్రుఁడు విశ్వంభరుండు
విలసితసామ్రాజ్యవిభవసంపదలు
నలఘుసద్వస్తువాహననికాయములు
నతులితోదగ్రజయప్రతాపములును
వితతసౌఖ్యంబులు వేడ్కతో నొసఁగి
కావిర్లలింగ భూసురశేఖరుని
భూవరసుతునిఁగాఁ బోషించుఁగాత.

తలఁబ్రాలవేళ నెంతయు సిగ్గుదోఁపఁ
దలవంప గళరత్నతారహారాగ్ర[1]
మానితమాణిక్యమధ్యభాగమున
నానామరస్తుత్యు నవ్యచారిత్రు
మకరకేతనకోటి మహితలావణ్యు
సకలలోకాధారు జగదేకవీరు

---

1 తలవంచిగళరత్నతారహారాగ్ర. (క)

భూమండలాధ్యక్షుఁ బుండరీకాక్షు
రాముని సుగుణాభిరాముని మదిని
భావించి చూచి సంభ్రమమునఁ బొదలు
పావనగుణధామ భామాలలామ
సీతామహాదేవి చెలువంపుఁదీవి
ఖ్యాతిగా సకలసౌఖ్యములు సంపదలు
రాజిల్లు సిరు లిచ్చి రావిళ్లలింగ
భూజాని సనయంబు బోషింతుఁగాత.
చక్కెఱకవణంబు చవిగొని మెక్కు
జక్కి నెక్కనజోదు సమయించు వేల్పు
వలిగట్టుపట్టికి వలపులు గులుక
నెలమి దేహం బర్ధ మిచ్చినదాత
పాపబువ్వకు బుట్టు బలియు సోదరుని
చేపట్టి కోర్కె లిచ్చినదయాజలధి
సొలపుచీఁకటిగుంపు సొంపుల బెంపు
చలివేఁడి వెలుఁగుల జరుగుచక్రములు
దుక్కైదువబూను దొరబిడ్డతమ్ముఁ
డక్కునసేర్చిన యబల పెద్దన్నఁ

జెలఁగుచు రాజుగాఁ జేసిన యతని
కలకంఠకంఠినిఁ గన్నరథంబు
సిరియిరటఁ బుట్టిన చిన్నబాలకుని
కొరకు వెన్నుని ముద్దుకొడుకు టెక్కెంబు
దురసురూపము దాల్చి తొలివేల్పు దునిమి
యుర్వృగాఁ గొనివచ్చు నుత్తమాశ్వములు
నలరు లోకములు చరాచరంబులును
మెలఁకువతోడ నిర్మించుసారథియు
సుదతియు జేజేలకు నునికైన వెలఁదియు
పదియాఱువన్నెలబంగారువిల్లు
తొగవైరినందను ద్రుంచువా మున్ను
తగగన్నమిన్న మేతలుగొన్ననారి
యొచ్చోటఁ దలఁచిన నెందుఁ జూచినను
నచ్చట వెలుగొందునట్టిసాయకము
గలిగి చెన్నొందినగంగాధరుండు
విలసితబహుభాగ్యవితతు లొసంగి
గాయగోవాళుని కలితకేళాది
రాయని నలతిరాజసన్నిభుని

శ్రీలచే జగతి రాజిలు లింగధరణి
పాలుని దుర్గాధిపతిఁ జేయుఁగాత.
ప్రాణనాథుని జటాబంధంబు మాన్చి
మానిత నవరత్న మకుటంబు దాల్చి
నేరైన పులుకలపేరులు దిగిచి
భూరి మౌక్తికహారములు పొసంగించి
కన్నుల వినుసొమ్ము కడలకు వైచి
సన్నుత దివ్యభూషణము లమర్చి
పూవిల్తుభస్మంబు పూత బోఁదుడిచి
తావులు గులుకుగంధంబు మై నలఁది
గజచర్మపటము చక్కఁగఁ దొలంగించి
రజితాంబరంబు తీరంబుగాఁ గప్పి
గ్రక్కున పులితోలు క్రాశ సప్లించి
తక్కక కెంబట్టుదట్టి పొంకించి[1]
జోగివేషము బాపి సొగసైనపుట్టు
భోగిరూపంబు సొంపుగఁ బొసంగించి

1 తక్కక కెంబట్టు దట్టి పొందించి (చ)

హరుమేన నలకొన్న యచలేంద్రకన్య
గరిమతో బసువశంకరబిరుదాంకు
గురుతరపెల్లుట్లగోత్రపావనుని
గండరగండని ఘనశౌర్యధనుని
గౌరడధాత్రినాథు కూర్మినందనుని
ఘనుని రావిళ్ల లింగమహీతలేంద్రుఁ
గనికరం బొదవ వేట్కలఁ బ్రోచుఁగాత.
కళలు గుల్కెడు తమ్మిగద్దియమీఁదఁ
బలుకు తొయ్యలిఁ గూడి పరమహర్షమునఁ
గొలువుండ బ్రహ్మాండకోట్ల నిర్మించి
యలరుచు నున్నయాయాయండంబులందు
స్థావరతిర్యక్ప్రచారజంతువుల
దేవదైత్యగ్రహాదిక్పాలవర్య
తారకాద్రిపయోనిధానకాంతార
భూరిచతుర్దశభువనభూతముల
నొనరఁ గల్పించి యాయుఃప్రమాణములు
ననువొంద లిఖయించి యాహారవిధులు
నద్భుతక్రీడావిహారసంగమము

లుద్భవప్రాభవోద్యోగములు పెక్కు
మరియాదలును ధర్మమర్మకర్మములు
శౌర్యధైర్యోదారచాతుర్యమహిమ
లలరుచు రచియించి యబ్జజాండముల
వెలుపల లోపల వెలయుచు సంచ
రింపుచు మెలఁగు విరించి నెయ్యమున
సంపూర్ణకరుణారసంబు లుప్పతిల
నాయురారోగ్యంబు లతులితమతియు
శ్రీయును సుపాయంబు చెలువొంద నొసఁగి
రావిళ్లకొండ భూరమణుని లింగ
భూవల్లభుని దయఁ బోషించుఁగాత.
సకలవిద్యలకెల్ల సాక్షి వై నగుచు,
సకలంకమహిమ రాయంచపై నెక్కి,
మతిలేనివారికి మతులు గల్పించి,
కృతిలేనివారికిఁ గృతులు గల్పించి,
యిలమతికృతులచే నెల్లభాగ్యములు,
కలితసత్కీర్తులు గలుగంగఁజేసి,
వరుజిహ్వా నటియించు వాణి మృగాక్షి

యిరువంద నాదిగర్భేశ్వరభవ్య
బిరుదాంకునకు లింగపృథివీశ్వరునకు
సరసచమత్కారచాతుర్యనీతి
విమలతత్త్వజ్ఞానవిభవంబు లొసఁగి
కొమరొందు కృతినాయకునిఁ జేయుఁగాత.
అని పయోరుహాకైరవాప్తలోచనుని
వనజాసనాది గీర్వాణమాళిక్య
మకుటకోటిప్రభామండితమృదుల
వికసితపాదారవిందు ముకుందు
వర్ణించి సేవించి వరహిమశైల
వర్ణుని గజరాజవదనుని నేక
దంతుని శంభునందనుని కీర్తించి
సంతతకరుణారసస్వచ్ఛహృదయ
సకలవేదపురాణశాస్త్రాధికారు
వికటమహోద్దండవేదండసింహు
నరుదైన బ్రహ్మకథారోహణాఢ్యు
చిరతరకీర్తి దేశికచక్రవర్తి
రంగనాయకపాదరాజీవయుగ్మ

సంగతపటుహృదంచితచంచరీక
భట్టరుశ్రీచన్నభట్టరాచార్య[1]
పట్టభద్రులపాదపద్మములు దలఁచి
వరయశోధనులు గీర్వాణాంధ్రకవులు
నిరతంబు గుణుతించి నేర్పు వహించి
చాటు వాక్ప్రౌఢిమలక్షణలక్ష్యశబ్ద
నాటకాలంకార సత్ప్రబంధ
సారార్థసంగ్రహా సర్వజ్ఞమూర్తి
కారుణ్యసుకవి ముంగరశాసనసుకవి[2]
చంద్రు చారిత్రము ల్జననాథ సభల
సాంద్రమతిస్ఫూర్తి సన్నుతిఁ జేసి
బహువిధాలంకారపదగుంభనములు
మహితశయ్యాపాకమార్గవైఖరుల
నవరసనాయకనాయకభావ
వివిధలక్షణముల విలసిల్లు నొక్క

1 సంగరహృదయాబ్జ సచ్చంచరీక భట్టరు శ్రీచెన్న భట్టరాచార్య (క) 2 కారుణ్యసుకవి ముంగరశాసనసుకవి (క)

రమణీయకావ్యము రచియింపఁ దలఁచి
విమలచిత్తమున భావించుచుండఁగను

### కృతిపతివర్ణనము

తనకీర్తిసకలబాంధవమిత్రసుకవి
జనచకోరములకు చంద్రికగాఁగ
తనప్రతాపస్ఫూర్తి దర్పితారాతి
వనసంతతికి దవవహ్నియుఁ గాఁగ
తనదయ శరణాగతవిరోధితతికి
ఘనతరం బగువజ్రకవచంబు గాఁగ
తననిశాతకరాసిధారవిరోధి
మనుజేంద్ర దేవతామత్తకాసినులఁ
దొలఁగక బొందించు దూతికగాఁగ
కలిత శృంగారవైఖరులఁ జెన్నొందు
తన మహోన్నతనవ్యధామంబు భాగ్య
వనజమందిరకు నివాసంబు గాఁగ
జననాథు లెన్న విశ్వంభర వెలసె
ఘనుఁడు రావిళ్ల లింగమహీశ్వరుండు
రసికాగ్రగణ్యుండు రావిళ్లలింగ

వసుధాధిపతి సాంద్రవైభవభాగ్య
వినుతసంపదలచే వెలయుచునుండి
యనువొందఁ నొక్కనాఁ డరుణోదయమున
మెలఁకువచే నిద్ర మేల్కాంచి లేచి
వలనొప్ప దంతధావనము గావించి
మున్నుగా పన్నీట ముఖమజ్జనంబుఁ
జెన్నొంద నాడి లక్ష్మీనాథుఁ దలఁచి
భాగవతోత్తము ల్బహుతాళగతుల
భోగిశయనుని పుణ్యకీర్తనలు
వినుపింప వీనులవిందుగా వినుచు
తనరంగ నామతీర్థంబు గావించి
గరిమ మీరఁగ శుద్ధగంగోదకముల
సురుచిరంబుగ భూమి శుద్ధిచేయించి
విహితంబుగా నందు వివిధవిచిత్ర
మహనీయరత్నకంబళము వేయించి
యమనియమప్రముఖాష్టాంగపూర్తు
లమరంగ పద్మాసనాసీనుఁ డగుచుఁ
బరఁగ హస్తికపాలభాతిధారులను

ధరణి నీతియు రిపుత్రాటకం బనఁగ
నలరు షట్కంబు లాచరింపుచును
సలలితోడ్డియాణ జాలంధరములు [1]
మొదలైన దశవిధంబులముద్ర లెలమి
గదియించి యిడయు పింగళ సుషుమ్న
మణిపూరకాదిధామములు పదునాల్గు
లోపల నున్న నాడులు వివేకించి
శీతలాభ్రమరిభస్త్రికమూర్ఛ కేవ
లాతతరవిభేదనాదినామముల
గలయష్టవిధకుంభకము లేర్పరించి
కలకేవలపుగుంభకముల గుంభించి [2]
లీలతో నాసనలింగహృన్నాభి
తాలుమూలలలాటతటములయందు
నాధారమణిపూరకాదినామముల
సాధారణంబులై సరస వర్ణింప
పరువడి నాల్గారు పది పది రెండు

1 సలలితోడ్డీయాణ జాలాంతరములు (క)
2 కలకేవలపు గుంభకములఁ గుంభించి (క)

విరివిగా పదియారువేలపత్త్రముల
నలరుచు నుండెడి నారుపద్మములఁ
జెలువొంద పవనునిచే మేలుకొలిపి
నాభిపద్మంబు క్రిందట ముమ్మూల
శోభిల్లు బాహ్యాండ సురుచిరంబైన
గంభీరనాభికాకాండంబులోన
గుంభించి యనిలుగొని దానిచేత
నాధారకమలమధ్య త్రికోణాంత
రాధీనరేఖాంతరాతురానలము
వెలుగించి వాయువు వెస నందు నిలి
పొలుపొంద నెనిమిదిముఖముల క్రిందఁ
దనరు పశ్చిమనాడి తల క్రిందుజుట్టి
పెనుఁబాము బలునోరు వెడలంగఁ జేసి
నలువుగా పశ్చిమనాడిలో నునిచి
వెలయు వేట్కా లనేకవింశతిమణులఁ
బెనఁగొని సంతానభేద్యమై యలరి *
వనజాసనేశవిష్వక్సేనవామ

* బెనగొని సంతతాశ్లేష్యమై యలరి (క)

ములు గలకులిశంబు మురువున నున్న
యలఘుగ్రంథిత్రయం బెలమి భేదించి
తలప నాపైని యూర్ధ్వముఖాంబుజంబు
దలక్రిందుచేసి యందలిసుధారసము
తలకొని హృదయపద్మములోన నునిచి
కులయుచు యోగసామ్రాజ్యసౌభాగ్య
గరిమచే సకలజగన్మయాకారు
వరవస్తు నవ్యయ ప్రణవస్వరూపుఁ
బరమాత్ము భూరిమధ్యభాగనివాసు
శరజాప్తశతకోటిచటులప్రకాశు
మానితమతి నాదిమధ్యాంతరహితు
ధ్యానించి హృదయపద్మంబున నునిచి
హరిహరభక్తుల కాచార్యులకును
నురుభక్తిహితవందనోపచారముల
జాంబూనదాంబరసద్భూషణములు
తాంబూలయుతముగా దానము ల్జేసి
యాచార్యముఖ్యుల కభివందనంబు
లాచరింపుచు వినయంబునఁ బనిచి

హితబాంధవులఁగూడి యిష్టభోజనము
లతిమోదమునఁజేసి హస్తముల్ గడిగి
పొలుపొంద ఘనసారముల మ్రుగ్గు లిడిన
విలసితవిధుశిలావేదికమీఁద
రాజిల్లు నూతనరత్నకంబళము
పైఁ జీనిహొంబట్టు పరుపుపై వేడ్క
వసియించి యిరుమైలవనితలు గొల్వ
కుసుమసాయకులీల గొలువున్న వేళ
నేమంబుతోఁ గొంత నిలిచి వేరొక్క
భామిని కర్పూరభాగంబు లొసఁగఁ
జిత్తంబు రంజిల్లఁ జేరి వేరొక్క
మత్తకాశిని యాకుమడుపు లందియ్య
సొలపుల వలపుల సొంపుల నొక్క
పొలఁతుక పరిమళంబుల మేన నలఁది
హానణికెగా నొక వారినీలవేణి
నవరత్నమయభూషణములు గీలింప
నేరుపుతో నొకనీరజవదన
తీరుగా కస్తూరితిలకంబు దీర్చ

సిరిమీఱ నప్పు డొక చిగురాకుఁబోఁడి
పరువడి జాళువాపాగ గీలింప
జననుతం బగుబురుసాపచ్చడంబు
వనితె నొక్కత వలెవాటుగాఁ జేర్ప
ఘన మూరురాయరగండపెండార
మనువుగా నొకలేమ యంఘ్రిఁ గీలింప
చెంగలించినవేట్కఁ జే నప్పు డొక్క
యంగనామణి నిల్వుటద్దంబుఁ బూన
కలితశృంగారముల్ గైకొని లేచి
కలకంఠికంఠులు కైదండ యొసఁగ
కమనీయరత్నకంకణములు మెఱయ
రమణులు వింజామరంబులు వీవ
రమణీయకక్ష్యాంతరంబులు గడచి
కోమరుమీఱిన కొల్వుకూటంబుఁ జేరి
హితులు పుత్త్రులు పురోహితులు సేనాధి
పతులు సామంతులు బంధువర్గంబు
మన్నీలు గురికాండ్లు మండలాధిపులు
సన్నుతి కెక్కుసచతురంగబలము

కవిబుధగాయనగాయనీవంది
వివిధనటీనట విలసితఘటన
అఘటనాఘటనాఖ్యఖడ్గప్రవీణ
పటుతరోపాయులై పరఁగుమంత్రులును
తగురాయబారు లెంతయుఁ జేరి కొలువ
నగణితనవరత్నసింహాసనంబునను
వెలయు సంగీతాదివిద్యల వినుచు
వలయు నాట్యప్రభావములు గాంచుచును
శ్రీయుక్తుఁ డగుచు రాజిల్లు వేడుకల
వేయిగన్నులుగల వేల్పుచందమున
రావిళ్లలింగభూరమణచంద్రుండు
కోవిదవినుతుఁడై కొలువుననుండి
నామీఁద కృప నుంచి నన్ను రావించి,
ప్రేమతో లాలించి పెంపుఁ జేయించి
తాంబూలయుతముగా ధనమణిహార
జాంబూనదాంబరసైంధవాంధోళి
కాదుల తగునగ్రహారంబు లొసఁగి
నావిక్కు వీక్షించి నయమొప్పఁ బలికె.

అనుపమరత్నాకరాన్వయాధ్యక్షు
ఘనుఁడ గోపాలసత్కవిసార్వభౌమ
నరనుతవాఙ్మయనైపుణ్యమతివి
సరసచాతుర్యలక్షణలక్ష్యశబ్ద
నాటకాలంకారనవరసభావ
పాటవంబులను నేర్పరివలె జగతి
నిరినిరోష్ఠ్యంబుల నిరనునాసికల
గురుతైనశతకముల్ గూర్చిన మేటి
వనునాసికాష్టవర్ణావళి చొరని
గొనబుతారావళి గూర్చిన ఘనుఁడ
నలకౌముదికిని దీపాంధ్రశబ్దంబు
లెలమి మీరఁగ రచియించు నేర్పరివి
కవు లెన్నఁగా బెక్కుకట్లమార్గంబు
లవలీలఁ జెప్పిన యట్టి ధన్యుఁడవు
మహనీయ బహులిపిముద్రచాతుర్య
మహిమలు దెలిసినమాన్యుండ వీవు
భవ్యసౌగంధికప్రసవాపహరణ
కావ్యంబు ద్విపదగాఁ గడువిస్తరించి

నను వేట్క మదంకితముగా సేయవలయు
నిన హర్షించి నే నానంద మొంది
సంశయం బెడలించి సత్కృతినాథు
వంశావతారంబు వర్ణింతు నెలమి.

కృతిపతివంశానువర్ణనము

తులుగరతనపట్టి తొలుతటిచికిలి[1]
ములికిలో నుండి కల్మల నీనురాణి
గాసంబు నేవేళ వదలంబునందు
భాసురోన్నతి నుంచు భక్తవత్సలుఁడు
పాల మున్నీట పాపని లీలఁ దాల్చి
మూలనున్నయ్యసొమ్ములు మెచ్చుజక్క
పై నెక్కి విహరించు పరమపావనుఁడు
దీనశరణ్యుఁడు దిక్పాలనుతుఁడు
సర్వవిద్యాకళాశాస్త్రపురాణ
పర్వతాంభోనిధి బ్రహ్మావతార
తారకాయుధభూతదంతిదిగబ్జ

1 తొలఁగక తనపట్టి తొలుతటిచికిలి (క)

వారిజహిత యోగవర్ణ నవర్ణ
రసతిథిమాసకరణ రాసిచంద్రు
వసుమతినిధిథ రాధ్వయనిసీతార
కలితంబులై దివాకరులీలఁ బోల్చు
బలుకైదువధరించి ఘోరశిఖివహించి
కడుప్రోవుజిగిడాలు గలయొకిమీని
బుడుతబంధించిన పొగరు రక్కసుని
వరభుజాబలగర్వవైభవస్ఫురణ
అరిమురిదునుము సాహసబలోన్నతుఁడు
సకలాగమమునీంద్ర సంఘముల్ పొగడ
నకలంకధృతిఁ బోల్చు నబ్జలోచనుఁడు
పరఁగ నాశ్రీహరి పాదపద్మమున
సురనదితోఁగూడ శూద్రకులంబు

కమ్మకులము

కలిగె వారలలోన కమ్మకులంబు
బలశౌర్యధైర్యప్రభావచాతుర్య
వరదానధర్మదుర్వారసంపదల

తరుతటాకాదిసంతానవైఖరుల
నురుసత్యవాక్యపరోపకారముల
పరగుచు సకలభాండవాశ్రితుల
నలవడఁ బ్రోచి విద్యారహస్యములు
తెలిసిన సర్వజ్ఞప్రతిష్ఠ వహించి(?)
పరిపంథివీరుల బంధించి వైచి
శరణాగతశ్రేణి సత్కృపఁ బ్రోచి
మానితవర్ణాశ్రమములవారలకు
భూనుతంబుగ కల్పభూజంబు లనఁగ
కరుణ కాధారమై ఘనతరకీర్తి
బిరుదుసంపదలచే పృథివిపై వెలసె




ఆకమ్మవంశసుధాంభోనిధియందు
రాకానిశాకరరమణ చెన్నొంది
యనఘమాటోపసాహసవిక్రమార్కుఁ
డనుచు రాయకుమారు లభినుతించఁగను
విమత రాడ్భయదమై విస్మయం బగుచుఁ

గోమరొందుగుడిపాటికోట చెంగటను
గుతలాధిపతులెల్లఁ గొనియాడి మెచ్చఁ
గుతుబుసాహుబలంబు ఘోరించి నరికెఁ
బెల్లుగా రాయలచే పొచ్చుబిరుదు
లెల్లఁ గైకొని మదాహితరాజహృదయ
భల్లప్రతాపప్రభావుఁడై వీర
మల్లభూరమణుండు మహికీర్తి నించె.
వినుతులఁ గాంచు గావిళ్ల వరమల్ల



జననాథు చంద్రవంశంబున నలరి
ఘోరావహాకిరీటి గుణరత్నమేరు
వీరాగ్రగణ్యుండు వితతపుణ్యుండు
పరబలసమవర్తి పటుధర్మవర్తి
నిరుపమకీర్తి మన్నియచక్రవర్తి
చంద్రార్కనయనపూజావిధేయుండు
సాంద్రసత్యవ్రతాచారవర్తనుఁడు
రవివంశమున శ్రీరామచంద్రుండు

భువి నుద్భవం బైనపోల్కి జన్మించి
జననాథు లెన్నఁగా జగతిపై వెలసె
ఘనుఁడు తిప్పక్ష్మాకాంత శేఖరుఁడు.
ధీరుఁ డారావిళ్ల తిప్పభూభుజుఁడు
హేరాళముగ ధాత్రి యేలుచు నుండి
భుజబలోద్దండుఁడై పొదలుచువచ్చు
జగపతిదళములు గవిసి చెండాడి
వికలంబుగాఁ జేసి వెన్నంటి తరిమి
యకలంకబిరుదధ్వజావళుల్ పట్టు
గొడుగు లందలములు గొనబుపల్లకులు
బెడిదంపుభేరులు పెద్దబూరుగలు
వన్నెవన్నెగుడార్లు వాజులు కరులు
చెన్నొందఁ గైకొని సిరులచే వెలసి
తనకీర్తి సకలదిక్తటముల నింపె
జనపాలు రెన్న రాజ్యము చేయుచుండె.

### తిప్పభూపతిభార్య పెద్దమాంబ

పరమసాధ్వీమణి పటుశీల యనఁగ

బరఁగు పెద్దమాంబాగర్భమునను
హరిహరసదృశులై యలరినసుతుల

తిప్పభూపతికుమారులు అయ్యపనాయఁడు వెంకటాద్రి

నిరుపురఁ గాంచె మహీశసన్నుతులు
బలశౌర్యధనునయ్యపక్ష్మాతలేంద్రు
నలఘుతేజుని వేంకటాద్రిభూవిభుని
నరయ నాయిరుపురయం దగ్రజుండు
పరమపావనుఁడయ్య పక్ష్మాతలేంద్రుఁ

{ అయ్యపనాయని భార్య లక్కమాంబ: కుమారుఁడు తిప్పభూపతి. }

డతిశీలవతి లక్కమాంబికయందు
సుతుని శ్రీతిప్పవసుంధరాధిపునిఁ
గని పెంచి సకలభూకాంతులు గొలువ
పనుపడ తనయుని పట్టంబుగట్టి
[illegible]తి నెంత వారికి చెల్లని బిరుదు
లతిశయింబుగఁ దాల్చి యలరఁ బట్టించి
హాగలు గగ్గోలురాయ హాజీరుఁ డనుచు[1]

1 హాగలు గగ్గోలురాయ పటీరుఁ డనుచు (క)

ముగురుదునేదార్లు మోఁగి సన్నుతింప
బాపురే మాయయ్య భళిభళీ యనుచు
గోపాలరాజు చేకొని చూచి మెచ్చ
నళుకు బెళుకును లేక నాహవభూమి
తెలుఁగుబిజ్జలుమాడ్కి తెగువతోఁ జొచ్చి
మొనసి కందనయోలి ముట్టడి యల్ల
మునుమున్న విడిపించి మోహరంబైన
బలుదునేదారుల భంజించి వైచి
పొలుపొంద గంధేభముల నుగ్గుఁజేసి
పొదలుగ నీబుల పొం గణగించి
యెదురుపఠాణీల నెల్ల మట్టాడి
చెలరేఁగి యొగసి వజీరులఁ జిదిపి
కలదక్కినీలఁ జీకాకుఁ [illegible]
డేరాలతో ళ్లెల్ల తెగ నరికించి
కోరి భాండారముల్ కొల్ల లాడించి
తనపేరు వారకందనయోలికోట సం[illegible]
యనురాగమున సొచ్చి య్యాదరాజు చేత
మెచ్చులు గైకొని మేదినీపతులు

నిచ్చలు జూచి నృపులెల్ల నితఁడె
గెలుపులరాజని కీర్తించి పొగడ
విలసిల్లు రణకేళి విహరించె నెలమి
అతనితనూభవుఁ డగుతిప్పనృపతి
కుతలాధిపతులెల్లఁ గూర్మితో మెచ్చ
ధరణి పేరైన యాదవని దుర్గంబు
సురతాణి లగ్గగా చూర లాడించి
తగువజీరుల దునేదారులఁ జంపి
పొగను తురుష్కులఁ బోసీక త్రుంచి
కలహాశిగాంగ్ల చీకాకు గావించి
చెలరేఁగి జయలక్ష్మి చేకొనివచ్చి
చల్లనివాఁడని జనులు నుతింప
నెల్లమహీస్థలి యేలుచునుండె
అంగనాజనమణి యలినీలవేణి

{ తిప్పభూపతిభార్య వెంగమాంబ; కుమారుఁడు లింగభూపాలుఁడు }

సింగారవతి యనఁ జెలువొందినట్టి
వెంగమాంబికయందు వితరణకర్ణు

లింగభూపాలు లాలితయశోధనునిఁ
గనిగొ నాలింగభూకాంతశేఖరుఁడు
తనదానధారావితానవాహినులు
వనధికిఁ గళ్యాణవైఖరుల్ నెరప
తనభుజంబున భూతధాత్రి యేవేళ
ఘనరత్నకేయూరగరిమ రాజిల్ల
మనుజాధిపతులు నెమ్మది గాన్కలొసఁగ
ధరణి యేలుచునుండెఁదగుమహార్థమున

లింగభూపాలునిభార్య సిద్ధాంబ; కుమారులు
కొండభూపతి, అయ్యపనాయుఁడు

పరఁగ నత్రావుల పర్వతాధిపుని
కన్నియ సిద్ధాంబి కరుణావలంబ
నెన్నఁగాఁ బెండ్లిగొని యొసఁగుచునుండి
నీరజాప్తప్రభానిసితాసివిజిత
ఘోరాహితనృపాలు కొండభూపాలు
సతతవదాన్యప్రసన్నస్వకాంతి
జితచంద్రునయ్యపక్షితినాథచంద్రుఁ

బుత్త్రులుగాఁ గాంచి పొలుపు వహించి
ధాత్రీపతులు మెచ్చ ధరణిపై వెలసె
ఆకుమారులలోన నహిత రాజన్య

కొండభూపాలునిసంతానము

భీకరశౌర్యుండు భీమబలుండు
బలభేదివిభవుండు బటుబెళగంటి
జలరాశి టంకశుంభత్పాండ్యరాజ[1]
పురహల్లికల్లోల భువనభేతాళ
పరసైన్యభైరవ బల్లాడరాయ
గండోగ్రజగనొబ్బ గండప్రచండ
గండరగండవిఖ్యాతకేళాది
రాయచౌరాసి దుర్గవిభాళనటుల
గాయగోవాళరక్తచ్ఛత్రబసువ
శంకరసర్వేశనిశ్శంకసాహసుని

వెంకభూపతి

వెంకభూపాలుని విమలచారిత్ర

1 బలశిలాటంకశుంభత్పాండ్యరాజ్య. (క)

ంగరాటోపప్రచండాధిరాజ
ుంగవప్రాభవభుజగర్వహరణుఁ
కరుణాపయోనిధి గాయగోపాళ
బిరుదాంకుఁ డగులింగపృథ్వీతలేంద్రు 465

లింగభూపతి

ద్వరి రిపువీరగజసింహమూర్తి

ముద్దులనాయఁడు

ముద్దులనాయని మోహనాకారు
సిటువంటితనయుల నిపవొందఁ గాంచి
పటుసత్యశీలుఁడై ప్రబలుచు నుండె *

---

* శంకర నిశ్శంకశౌర్యహాంవీర
కంకణహస్తసంగడిరఘుపాల
శత్రుమహీనాథ సముద[illegible]కార
చిత్రతాంగదభీమసింహలలాట
నరశౌర్యముఖ్యనానాధప్రబిరుద
ధరితుఁడు కొండభూపాలశేఖరుఁడు
తనకీర్తి భూనభోంతరములు నించి
ఘనులు భూజనులు సత్కవులు నుతింప

బలియుఁ డాకొండభూపాలసోదరుఁడు 47

## కొండభూపాలుని సోదరుఁడు అయ్యపనాయకుని ప్రభావము

విలసితసాహసవిక్రమార్కుండు
గురుతరపరవీరకోలాహలుండు
వరభవ్యగాంగేయవర్ణకేతనుఁడు
రాజిల్లు వెలియు కర్ణాట శ్రీరాయ
రాజదత్తకిరీటరమ్యభూషణుఁడు 47.
మనసిజాకృతి చెంచుమలచూరకార
ఘనబిరుదాంకుండు కలితతేజుండు
నరనుతు నయ్యపనాయకేంద్రుండు
ధరణీశు లెన్న భూస్థలివార్తకెక్క
ఆమోద మెసఁగ నయ్యపనాయకేంద్రు 48(

## ఆతనికుటుంబము

భామిని వెంగమాంబామణి గర్భ

---

పరుస నార్గురు చక్రవర్తులకైన
నిరవొంద ధాత్రిని నేలుచునుండె (౩)

జలనిధి సంపూర్ణచంద్రునిలీలఁ
గలిగె శ్రీకొండ భూకాంతశేఖరుఁడు
ఆకొండనృపతి దయాపరమూర్తి
శ్రీకామినీనాథ సేవాభిరతుఁడు
అనిలోన నెదిరిన యహితకోటులకు
ఘనదివ్యభోగము ల్గలుగంగఁజేసి
వెన్నిచ్చి చను శత్రువిభులకు నెల్ల
సన్నుతం బైనమోహంబుఁ గల్పించి
శరణుజొచ్చిన రిపుజనకోటి నెల్ల
సురభోగభాగ్యసంయుతులఁ గావించి
తనకీర్తియాచంద్రతారకముగను
వినుతింప నెగడించి వెలయ భూస్థలిని
రాజతేజం బగు రావిళ్లలింగ
భూజానికొండభూభుజుఁడు మోదమున
సులవకపుత్రుల సుముహూర్తమునను *
జెలగుచు రాజ్యాభిషిక్తులఁ జేసి

---

* సొలవక పుత్రుల సుముహూర్తమునను (క)

మంతుకెక్కిన మేటిమన్నీలతోడ
పంతము ల్గలధరాపాలురతోడ
బలువిడి చతురంగబలములతోడ

కొండభూపాలుని పరాక్రమము

వలనొప్పు పలువైభవములతోడ
ఖరకరదీప్తులకరవాలుఁ బూని
సరిలేని చికిలిపచ్చలబాకుగట్టి
కరకుకెంపుల బాహికంబులు దాల్చి
తరలక కరపీరదామంబుఁ బూని
సిరిగుల్కు రత్నాలసింహాతలాట
బిరుదాంకముల చాల పెంపొందు జవన
తురగంబు పైనెక్కి తోరంపువేడ్క
సరసల వీరసేనలు జల్లుచుండఁ
గొప్ప యుజ్జనిపట్టుగొడుగులనీడ
నొప్పు చల్లనిగాలి యొదవుచు నుండ *
చెలువొంద జయలక్ష్మి చేకొనుకొఱకు

* నొప్పచందము కావి యుల్లైన క్రింద (క)

కులుకుచుఁ జను పెండ్లికొడుకుచందమునఁ
బొదలుచు మానవపురిచెంతఁ జేరి
పదరునేదులకొవాలుబలములమీఁగ
గొదకక హరిణంపుగుంపుల గాంచి
కొదమసింహము చొచ్చుకొమరు చెన్నొంద
తేజిని చేసల్లిథే యని నూకి
యాఁజిరంగముఁ జొచ్చి యహితసైన్యముల
గకవికల్ గావించి గర్జించి నరికి
ప్రకటించి తనపేరు పారిపోసిక
నెదురు రావంతుల నెలమి హాజీర్ల
పొదలుదునేదాక్ష పుడమిపైఁ గొల్చి
హత్తి వెంబడివచ్చు నవనీశు లెల్ల
తత్తరంబున వెన్కఁ దగులు వెట్టంగ
నిరువొసల్ నరకిన నేదిక్కుగన్న
ధరడొల్లియాడెడుతలలును నెగసి
పడెడికండలు బెట్టుఫారుసక్తములు
పాడియైనయలుఁగులు పొలియు రావుతులు
గలిగి యొప్పెడుమహాకదనరంగమున

నళుకు బెళుకును లేక నని సేయువేళ
వేయారు లైన గాడి పీఁపున వెడలు
గాయముల్ మణిపతకంబులుగాఁగ
వెక్కసంబున మేన విరిగినయలుఁగు
లక్కజంబుగ హీరహారముల్ గాఁగ
పెనగొని మైప్రేలు ప్రేవులసొబగు
తనరు నుత్తరజన్నిదంబులు గాఁగ
తేరలక రంభాదితరుణులు మోహ
భరితలై తనదిక్కు భావించి చూడ
ఆచంద్రతారార్క మగునట్టికీర్తి
భూచక్రమున నించి పోరిలో వెలసె.
ఆమహావీరుని నాత్మజులందు[1]

కొండభూపాలుని సంతానము

రామాభిరాముఁడు రణభయంకరుఁడు
వితరణకర్ణుఁడు విద్యలభోజుఁ
డతిబలశాలి దయాపయోజలధి

1 అమహామహిమ్మారు నాత్మజులందు (క)

బలిమి భీమమురారి బలరాము కులిశ
ములయజ ఘనసార మల్లికాతార
తారకాతుషార మందార నీహార
హారకుంద పటీర హారశరదభ్ర
హారి శారదా నారదాహీశ చంద్ర
శారదా చంద్రికాసాంద్ర సత్కీర్తి
కార్తికేయాగ్రజ కలితసాహసుఁడు
మార్తాండమండలమండితగుండ
లాగ్రఖండితవిమతావనీనాథుఁ
డగ్రప్రతాపుఁ డత్యున్నతబలుఁడు
ఘనుఁడు రావిళ్లలింగనృపాలచంద్రుఁ

లింగభూపతి కృతిభర్త

డెనయ వేడ్కల ధాత్రి యేలుచు నుండు.
కారుణ్యవితరణగాంభీర్యపటిమ
క్షీరపయోరాశి చెలువున నలరు
సాయపనాయనిసత్కులాఢ్యుండు
శ్రీయనంతనృపాలశేఖరుం డెలమి

ధరణి భాగీరథీతరలాక్షిఁబోలి
పరఁగు శ్రీలక్కమాంబాగర్భమునను[1]
గన్న సద్గుణధామ కాంతాలలామ
సన్నుతాంగ విలాసచంద్రికాహారి
పరమకళ్యాణసంపత్పరంపరల
నరవిందమందిర యనఁగఁ జెన్నొంది
రచితశుభాకారరమ్యవైఖరుల
నచలేంద్రకన్యక యన నొప్పు మీరి
ప్రతిలేనిరూపవిభ్రమవిలాసముల
రతిదేవి యనఁగ ధరాస్థలి వెలసి
పరఁగు శ్రీభాస్కరాంబాపయోజాక్షి
వరముహూర్తమున వివాహమై ప్రేమ

లింగభూపతిభార్య భాస్కరాంబ

లోనర భావింపుచు నుచితవైఖరుల
వినుతకీర్తుల ధాత్రి వెలయుచునుండె.
మదదానవారిపద్మావలియందు

1 పరఁగు శ్రీలింగమాంబాగర్భమునను (క)

మదనునిఁ గన్న క్రమంబున నెలమి
పరఁగు శ్రీభాస్కరాంబామణియందు
సరసరూపవిలాససత్కళామూర్తి
లలితభాగ్యవిశాలలక్షణాన్వితుని

లింగభూపతికుమారుఁడు రామభద్రుఁడు

కలితచాతుర్యవిక్రమధురంధరుని
రామభద్రనృపాలు రమణీయశీలు
శ్రీమంతు బాంధవాశ్రితకల్పవృక్షు
బలరామ సత్యసంపన్నునిఁ గాంచి
చెలువుమీరఁగఁ బోషింపుచు నుండె.

లింగభూపతిపరాక్రమము

అంగ వంగ యుగంధ రాంధ్ర విదర్భ
బంగాళ నేపాళ బర్బర ద్రవిళ
లాట కర్ణాట వరాట కాశ్మీర
ఘోట విదేహ కాంభోజ సౌరాష్ట్ర
కురు కరూశ మరాట కోశలాద్యంత
ధరణీతలేశు లెంతయు సంతసింప

తిరుమణికోటలో స్థిరముగా నునిచి
పరవీరదుర్గముల్ పట్టణంబులును
నదలించు భేదించు నావార్త దెలిసి
బాదలు సుల్తానయబ్దులపాదుశాహా
మలయుచు నేదార్ల మన్నీలఁ బిలిచి
సెలవు మన్నించియ శీఘ్రమె తరలి
చతురంగబలహితసంరంభు లగుచు
ధృతిమీరఁగా నలుదిక్కులు గ్రమ్మి
యుదయాస్తమయముల నురిమినలగ్గ
లుదిరించి సరికి మహోగ్రశౌర్యమున
డాబాలపైఁబడి డాగులుచేసి
జీబులు బలిసిన సేనల దునిమి
మన్నీల దొరల సామంతుల చెండి
వన్నెకు నెక్కు రేవంతులఁ జదిపి
మేటిమనేదార్ల మెరయువజీర్ల
ఘోటకమత్తేభకోటులఁ జదిపి
యాలంబుపై సొచ్చి యఖిలశాత్రవుల
దోలి పెన్గొండకుఁ ద్రోవలు సూపి

కురువీరబలముల గోరించినట్టి
వరుఁడే విభుండని నరనాథు లెంచఁ
గదిమిన శత్రువుల్ గళవళమంది
చెదరి పోరఁగ లేక చేతులు మొగిచి
కావుము బసవశంకరబిరుదాంక
ప్రోవుము బెళగంటిపురి శిలాటంక
శరణు గండరగండశత్రువిభాల
కరుణించి రక్షించు గాయగోవాళ
కీర్తించెదము మిమ్ము కేళాదిరాయ
యార్తులమన్నింపు మవనీశగేయ
యని వేడుకొనిన దయాదృష్టి చూచి
తనదు వేడ్కల ధర్మదారఁ బొన్పించి[1]
సమరంబు చాలించి చయ్యన మరలి
ఘనతో ధారుణీరమణులచేత
నళవాయి వేంకటధరణీశుచేత
నలరుచు దగు హెచ్చు లగు మెచ్చు లందు

1 తనదు వేడ్కల ధర్మదారఁ బట్టించి (క)

రావిళ్లలింగభూరమణచంద్రుండు
పావనచరితుఁడై ప్రబలుచు నుండె.

లింగభూపతిసోదరుఁడుముద్దులనాయనిపరాక్రమము

ఆలింగధరుణినాయకసహోదరుఁడు
బాలికామదనుఁడు భవ్యశీలుండు
కదనభీకరుఁడు జగన్నుతకీర్తి
మదవైరి బలభేది మానధనుండు
పరమదయాళుండు పావనమూర్తి
నరసాహసుఁడు పురందరవైభవుండు
తనకీర్తి కోసలద్రవిళాధినాథ
ఘనతరం బగుమల్లికాధామ మనఁగ
తన ప్రతాపము యుగంధర భోటలాట
మనుజాధినాథమత్తకాశినుల
కలవారు కెంపులహారము గాఁగ
నలువొందు ముద్దులనాయకేంద్రుండు
బలభేదివైభవభాగ్యసంపదలఁ
బలగుచు రాజిలు జగతి చందమున

సమరాంగణకిరీటి శాత్రవధరణి
రమణ త్రిదశకోటిరణరంగవిజయ
ఘాటిఘోటకఖురోద్ధతవైరికోటి
కోటీరవాటి సద్గుణమణిపేటి
యగుకోటిపాటిమాకావనీంద్రునకుఁ
దగనుద్భవించిన తరుణీలలామ
సరసకళాధామసౌందర్యసీమ

{ మద్దులనాయనిభార్య తిరుమలాంబ; కుమారుఁడు వెంగభూపతి }

తిరుమలాంబామణి స్థిరలగ్నమునను
చెలఁగి కల్యాణమై సిరులచే నలరి
గొలమి ధరాస్థలి యేలుచు నుండి
నలకూబరజయంతనలచక్రవర్తి
లలితరూపవిలాసలక్షణమూర్తి
శతపత్రహితపుత్త్రశంకరమిత్ర
వితరణంబౌ షష్టివిద్యాప్రవీణు
మానినీ పాంచాలు మహనీయశీలు

మానకౌరవరాజు మార్తాండతేజు
గాంగేయనగధైర్య గాంగేయశౌర్య
వెంగధాత్రీనాథు విమలచారిత్రు
తనయునిగాఁ గాంచి ధరణీశు లెన్న
వినుతసంపదలచే వెలయుచు నుండి
శశిధర వితరణ సాహసశాలి
విశదచారిత్రుండు వెల్లుట్లగోత్ర
పాత్రుండు సకలార్థిబాంధవపద్మ
మిత్రుండు లింగభూమీకళత్రుండు

## భాస్కరాంబవర్ణనము

దనరు వేడ్కలతో సుధాకరవదన
జననుతగుణధామసాధ్వీలలామ
తిలకింప పరమపాతివ్రత్యమహిమ
నల యరుంధతిసాటి యని యార్యు లెంచఁ
జెన్నొందు బాంధవాశ్రితజనార్థులకు
నన్నపూర్ణ యటంచు నభినుతిసేయ
జగతిపై నుభయవంశములవారలకు

నగణితకీర్తి నెయ్యముగల్గి మెలఁగి
ఏపగు శ్రీభాస్కరాంబామణి నెలమి
సరసవైఖరుల ముచ్చటలఁ బ్రోచుచును

## లింగభూపాలుని కీర్తికాంతావర్ణనము

సలలితసంపూర్ణచంద్రబింబంబు
వలువు మీఱాజినయాననంబును గాఁగ
వలనొప్పు తెల్లకల్వలవిలాసముల
కలికిబెళుకులసోగకన్నులు గాఁగ
లలిత మాధవళతిలప్రసూనంబు
విలసిల్లు నాసికావిభవంబు గాఁగ
పలుచని ఘనసారఫలకపు బ్రాఁతి
చెలువొందు ముద్దుల చెక్కిళ్లు గాఁగ
మలచి సానలు దీరు మగరాలచాలు
కలితమా రదనవికాసంబు గాఁగ
సరసంపువలమురి సౌభాగ్యగరిమ
కరము రంజిల్లెడికంఠంబు గాఁగ
వరసి చూడఁగ నంచ మగుకల్పలతలు

పరువడి భాసిల్లు బాహువుల్ గాఁగ
భూనుతంబై మించు పుండరీకములు
మానితహస్తపద్మంబులు గాఁగ *
శ్రీలవిరాజిల్లు సింహవిస్ఫూర్తి
లాలిత గగనావలగ్నంబు గాఁగ
చెన్నొంది మిన్నయై చెలఁగుచున్న
పొన్నక్రొవ్విరిమేటి పొక్కిలి గాఁగ
పురుహూతబంధురస్ఫురితకంబములు
బిరుదులు రాణించు పిరుదులు గాఁగ
సముదగ్రశారదాస్తంభభాగ్యములు
కమనీయమృదులోరుకాండముల్ గాఁగ
రకమై వెలింగెడురజతకాహళులు
సుకరంపుజంఘికోస్ఫురణలు గాఁగ
నాకమహీజాతనవపల్లవములు
ప్రాకటంబగుపాదపద్మముల్ గాఁగ

* చెలువొందుతారాద్రిశీతాద్రిగోత్రములు
మలయుచుఁ జొక్కపుగుబ్బలుగాఁగ (క)

కళల నొప్పెడుతారకానీకములు
సొలపులు గలమేలిసొమ్ములు గాఁగ
బలుదండిగాఁగాయుపండు వెన్నెలలు
పొలుపొందు వెలిపట్టుపుట్టముల్గాఁగ
వెలసిన సత్కీర్తి వికచాబ్జముఖిని
పలుకులకొమ్మయంబరసదీరమణి
కులుకు చక్కని పెండ్లికూఁతుఁ గావించి
నిలిచి పేరంటముల్ నెరపుచునుండ
భీమరాములు పెండ్లి పెద్దలై మెలఁగ
తామస మెడలించి దగ్గఱఁ జేరి
యలనారదుఁడు పురోహిత మొనరింప
చెలఁగి యశోలక్ష్మిఁ జేకొనివేడ్క
బలపరాక్రమభీమభాగ్యసంపదల
విలసిల్లె లింగపృథ్వీతలేశ్వరుఁడు
ఎంతకాలంబు మహీమండలంబు
దంతావళంబులు ధరణీధరములు
వననిధానంబులు వాహినీతతులు
దినరాజచంద్రులు దిక్పతుల్ సురలు

తారకావళులు వేదములు ధర్మములు
నారూఢి విలసిల్లు నంతగాలంబు
నాయు రారోగ్యంబు లమితసౌఖ్యంబు
లాయతసంపద లఖిలభాగ్యములు
మానితోన్నతసామ్రాజ్యభోగములు(?)
సురుచిరకల్యాణశోభనంబులును(?)
కరితురగాందోళికాస్యందనములు
గలిగి రావిళ్లలింగమహీశ్వరుండు
వలనొప్పి జగతి ప్రవర్ధిల్లుచుండు
అని యిట్లు సకలలోకాభిరామునకు
ఘనఘనాఘనచంద్రకల్పధరాజ
శిబిదధీచిబలీంద్ర దిక్పాలఖచర
విబుధధేనుసమానవితరణాఢ్యునకు
శరజన్మగాంగేయశక్రతనూజ
వరబలోద్దండదుర్వారశౌర్యునకు
బహుళప్రతాపప్రభాపరాభూత
మహనీయతరచండమార్తాండునకును
కోమలమాధుర్యగుణధురీణునకు

భామినీ నూతనపంచబాణునకు
సకలపురాణశాస్త్రవిధిజ్ఞునకును
వికటశాత్రవబలవిచ్ఛేదనునకు
శరణాగతారాతిసంరక్షకునకు
నరపతి సింహాసనస్థాపకునకు
గురుతర రావిళ్లకులభూషణునకు
ధర నెన్నఁదగులింగధారుణీపతికి
నంకితంబుగను నే నార్యులు మెచ్చ
పొంకించి రచియింపఁబూనిన యట్టి
పరమసౌగంధికాప్రసవాపహరణ
చరితంబునకుఁ గథాసరణి యెట్లనిన. *

---

* అయ్యపనాయకునికుమారుఁ డైనకొండనృపతి కిద్దఱు పుత్త్రు లున్నట్టు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని వ్రాతప్రతియం దున్నది.

*అకొండనృపతి బాహాబలోదగ్ర
ధీకరశౌర్యగంభీరచాతుర్య
వినయవివేకప్రవీణు లైనట్టి

తనయుల నిర్వురఁ దగఁ గాంచి పంక్తి
రథుడు మోదమున శ్రీరామలక్ష్మణుల
విదితంబు గాఁ గన్నవిధము చెన్నొంద
నందగ్రజుఁడును ధర్మాయత్తచిత్త
మందరధీరుండు మహితయశుండు
కమనీయరూపరేఖాపరాభూత
సుమసాయకుండు తత్ క్షోణీధవుండు
ధరతల్లిదండ్రి ముత్తాశలకీర్తి
కరయు దన్నియుఁ గూర్పునట్టిధన్యుండు
రామభద్రకుమారరమణచంద్రుండు
భూమీశు లెన్న సద్భుతశక్తి వెలసె
ఆరామభద్రనాయకసహోదరుఁడు
సారబలోద్దండసాహసాంకుండు
హారచౌషష్టివిద్యాప్రవీణుండు
ఘోరమదాదిసంకులభేదనుండు
ధీరుండు తిమ్మధాత్రీకళత్రుండు
ధారుణి వెలసె సత్కవులు నుతింప

# ప్రథమాశ్వాసము



## కథాప్రారంభము

సకలపురాణశాస్త్రంబులు వినుచు
నకలంకహృదయుఁడై నలరుచు నుండి
జనమేజయుండు వైశంపాయనునకు
వినయమార్గంబుల వినుతులుచేసి
విహితభక్తిజ్ఞానవిభవవైరాగ్య
మహితతపోధనమానికులేంద్ర!
పాండవులకు యదుపతికి నేతెరఁగు
ఖండనంబు ఘటిల్లె? ప్రదన మేరీతి?
అలర జయాపజయంబు లెవ్వరికిఁ
గలిగె నానతియిమ్ము కరుణాపయోధి
యని విన్నవించిన యతికులేంద్రుండు
మనుజేంద్రుఁ జూచి సమ్మతి నిట్లు పలికె.

### బదరికావన వర్ణనము

భూతలాధీశ! జంబూద్వీపమునను
ఖ్యాతి కెక్కిన యట్టికాంతారములకు
మేటిగ్గా మిక్కిలి మిన్నంది పెరిగి
పాటిల్లు పాటలి పనస ఖర్జూర
చూతమహావటాశోకహింతాల
మాతులుంగాశ్వత్థ మాధవి వకుళ
మందార చంపకామ్లాత తక్కోల
కుంద కురంటక కుర్వ్యజ కుటజ
బదరికా జంబీర పాటలి నింబ
కదళికా కౌరద క్రముక పలాశ
తాల తక్కోలాది తరులతావితతి
కాలవాలంబులై యనవరతంబు
పల్లవదళపుష్పఫలవిలాసముల
సల్లలితామోద సరసవైఖరుల
వాసవనందనవనమునుబోలి
భాసిల్లు నిరతంబు బదరీవనంబు
ఆకాననంబున ననవరతంబు

నాకాల మీఁకాల మని తేటపడక
సొలపువాసనలచే జొటజొట వడియు
పలుచనిపూఁదేనెపై నాస పొడమి
చిగురుజొంపములపై చిత్తముల్ నిలిపి
తగుఫలాపేక్షల తమకముల్ మించి
గగనభాగం బెల్లఁ గప్పి యుప్పొంగి
జిగిమీర దిక్కులఁ జీఁకట్లు గ్రమ్మఁ
జను భృంగశుకపికసంఘముల్ గాంచి
తనరుచు బలునీరదము లని తలఁచి
వెలయ కలాపము ల్వికసింపఁజేసి
యొలమితోఁడుత నటియించుచు మయూర
తతులకు తాళభేదనము పీఠియలు
జతగూడ మీటుచు స్వరలయకాల
మానముల్ దెలిసి వేమరు రాలు గరఁగఁ
గానంబు లొనరించు గంధర్వపతులు
గానము ల్విని సొక్కి గదుపులై చేరి
పూనిన పరవశంబున వైరవర్గ
ములు మాని యానందమున వినుచున్న

సలలితబహువిధజంతుసంతతులు
కమనీయబహువనకైరవకమల
కమలసంపూరితకమలాకరముల
రాజిల్లు రాజమరాళసంఘముల
నోజతోడుతఁ జేరి యొక్కొక్కయెడల
కిలకొట్టుచును జలక్రీడ లేవేళ
సలుపుచు మెలఁగు నచ్చరపూవుఁబోండ్లు
కన్నులపండువుగాఁ జూచి భ్రమసి
క్రన్నన విలుకానికయ్యంబునకును
తమకించి బొదలు గంధర్వశేఖరులు
కమలకాండాసక్తకమలాకరములఁ
గడునోర పొరులు గలుగక యుండ
నడుపులు నేర్పు కిన్నరరాజముఖులు
నలువొంద రంభాదినలినలోచనలు
సలలితనాట్యప్రసంగవైఖరులఁ
జెలువురంజిల్లుమై సిరిపొంకములును
బొలుపొందు నభినయంబులసోయగములు
కొలఁదికిమీరినకోపుచాలులును

బెళుకులు దళుకులు పేరిణివిధము
లొనరంగ వీక్షించి యుల్లము ల్చెదరి
యనయంబు మోహించుయతీవల్లభులు
సొరిది నన్నియుఁ జూచి చూడని యట్ల
వెర వొప్పఁగా విని విననిమార్గముల

పరమేశ్వరుని మనఃపద్మంబునందు
నిరవొందఁగా నిల్పి యీషణత్రయము
హరియించి యొప్పెడు బ్రహ్మర్షు లగుచు
ధరతపంబులు సేయు తాపసోత్తములు
మఱి పెక్కుఁగలచిత్రమహిమలు గలిగి

పరువడి విలసిల్లు బదరికావనము.
ఆవనమధ్యంబునందు నత్యంత
పావనంబై భవభయహారం బగుచు
గరుడగంధర్వరాక్షసయక్షఖచర
సురకిన్నరమునీంద్రశోభితం బగుచు
ధర నెన్న మోక్షప్రదాయకం బగుచు
గరిమచే వెలయు గంగాతీరమునను

### పాండవులు బదరికావనమున నివసించుట

పరువడి వసియించు పాండునందనులు
ధరణీసురులతోడఁ దమవారితోడఁ
దగినవేళలను గృతస్నాను లగుచు
నగణితం బగుపురాణాదులు వినుచుఁ
జెనఁటి యాకురురాజు చేసినకొదువ
లనయంబుఁ దలఁచుచు నావనంబునను
ధూర్తదానవకోట్ల ద్రుంచివైచుచును
నార్తులఁ బ్రోచుచు నలరుచుండఁగను.

### వసంతకాల వర్ణనము

బొలుపొంద తీయనిపూవుఁదేనియల
వలసి వల్లములుగా వలగొని త్రావి
మధుమత్తవిస్ఫూర్తి మలయుచు మెలఁగు
మధుపసంఘంబులు మధురగానముల *
జతలుగూడి యపాంగసంగతు ల్నెరపి
సతతంబు క్రీడించుచారణాంగనలు

*మధురప్రసంగముల్ మధురవాక్యములు (త)

సలలితం బైన రసాలసాలములఁ
జెలువుమీరిన లేఁతచిగురులు మెసవి
కడుపులు నిండి వెక్కస మైననవల
కడలకుఁ దొలఁగించి కడు మెడ లెత్తి

ప్రాకటంబుగఁ గూయుబలుకలకంఠ
కాకలీరవములఁ గలయంగ నిరత
మానందహృదయు లై యలరుచు మధుర
గానంబు లొనరించు గాంధర్వపతులు
వెలయు భూజములకు ప్రేగుగాఁ బండి

బలురసంబుల పరిపక్వంబు లైన
ముంతమామిడిపండ్లు ముక్కునఁ జిమ్మి
గొంతులగోలఁదిగాఁ గుటగుట ద్రావి
తామరతంపమై తనివిదీరినను
వేమారు పుక్కిళ్ళ వెళ్లఁగాయుచును

చెలువంబు మెరయ రాచిలుకలకులుకు
పలుకులతోఁగూడ బహుతాళగతుల
వరుసతో మాధుర్యవాగ్విలాసముల

కెరలి దర్వులు బాడుకిన్నరసఖులు *
లాలితస్వరకాలలయతాళగతుల
తాలమానంబులు దప్పకయుండ
కుటిలకుంతలములు కులికినటింప
నటియించు దేవతానలినలోచనలు
బోలుపుమీరిన మల్లెపూఁబొదరిండ్ల
వలరాజుకేళిలో వలపులు హెచ్చి
ప్రమదంబులను బహుబంధవైఖరుల [1]
రమణులతో సమరతులభోగించి
యంతంత మోహంబు లగ్గలంబైన
కాంతులఁ బైకొని కళ లుప్పతిల్లఁ
బలుమరు ధమ్మిల్ల బంధము ల్వీడ
బలువిడి కబరికాప్రసవముల్ రాల
సొలపుమై జెమటలు సోనలై గురియఁ
కెలువంపుహారముల్ చిక్కులుపడఁగ
నలువురంజిల్లు కంకణము లందియలు

---

* బల్కు (త) (ట)    1 మార్గముల (త)

ఘులుఘుల్లు రని తాళగతులచే మొరయ
పనుపడి నుపరతిబంధవైఖరుల
వనయంబు క్రీడించు యతుకామినుల
నలసత వెడలింప సతులమోదమున
మలయుచు విహరించు మందవాతములు[1]
మనుజేంద్ర! మరి పెక్కుమహిమల నలరి
చనుదెంచె నపుడు వసంతకాలంబు

భీముఁడు కంచమాలములఁ జేఁబూనుట

ఆసమయంబున నాయరణ్యమున
భాసిల్లు వేడ్కల బాండవాగ్రజుఁడు
తమ్ములు హితులు బాంధవులు గొల్వఁగను
నెమ్మితో ద్రౌపది నెయ్యంబు నెరప
పొలుపొంద ధౌమ్యాదిభూసురావళులు
చెలువంబుగను సుఖాసీనులై యుండి
ననురాగమునఁ జేర నరిగి యేవేళ
మునులు భూతభవిష్యములు దెల్పుచుండ

1 వాయువుల (త)

దుష్టదానవకోటి ద్రుంచివైచుచును
శిష్టరక్షణమును జేయుచుండఁగను
జెన్నొంద నొకనాఁడు చెలఁగుచు భీముఁ
డన్నకు మ్రొక్కి ధౌమ్యాదుల కెరఁగి
తమ్ముల ద్రుపదనందన నాదరించి
నెమ్మి నానాయుధనికరము లూని
మందస్మితంబున మసలక వేగ
కందమూలఫలార్థగమనుఁ డౌనపుడు

### ద్రౌపది భీమునితోఁగూడ వనవిహారము సేయఁగోరుట

ధరణీతలశ్రోణి ద్రౌపదీరమణి
అరసి దిగ్గనలేచి యనిలనందనుని
దారి కడ్డమువచ్చి ధర్మజుఁ జూచి
నేరుపుతో మ్రొక్కి నిలిచి యిట్లనియె
అనఘాత్మ! నేఁడు నీయనిలజువెంట
వనవిహారముసల్పు వాంఛ బుట్టెడిని
యీచెంత నున్నమహీరుహావళులు
పూచి కాచి ఫలించి పొదలుచున్నవియు

తక్కినవనముల తరులతావితతు
లిక్కడికన్నను యెక్కువ లేమొ!
అక్కడివనభూము లావినోదములు
మక్కువతోఁ జూచి మరలివచ్చెదను
యనుమతు ల్చెప్పక నవును కా దనక[1]
నెనరున తలఁపు[2]మన్నించఁగావలయు
నని వేఁడుకొన్నట్టియంభోజముఖిని
గనుఁగొని పాండవాగ్రజుఁ డిట్టు లనియె
వనజాక్షి యిటువంటివాంఛలు గోర
జనునె నీమదిలో విచారించి చూడు

ధర్మరాజు పలుకుట

మనకు రారాజుకు మానసిపగలు
ఘనముగా నేవేళ గలిగియుండఁగను
అదిగాక యీనిబిడారణ్యభూమి
మదదానవేంద్రులు మలయుచుండఁగను

1 అనుమతు ల్చెప్పక నవును కాదనక (ప)
2 నెలవు (378)

అనిలనందనుఁ డొంటి నరుగుచుండఁగను
చనియెదనన నీకు సమ్మత మగునె!
సరసీరుహానన సఖియలకోర్కె
లరసి చూచిన నెంతకైననువచ్చు
కామినిచే బెఱుఁగనికూన వగుట
యేమియుఁ దలపోయ నిది నీతి గాదు
కసిబోయి తిరిగెడుకావడిబరువు *
వసుధపై మోసేటివారికె తెలుసు
కడనున్నవారికిఁ గానఁగా రాదు
పుడమిలో పయనమై పోయెడివారి
నరికట్టఁగాఁ జెల్లదరుగునీవేఁగ
సరసంబు లిక చాలు చాలు రి మ్మనిన
అండజయానరోషాశ్రువులొలుక
పాండవేయాగ్రణి భాషించి పలికె

ద్రౌపది నిష్ఠురోక్తు లాడుట

నరవరోత్తమ నీవు ననుదూరవచ్చు

---

1 కాశికిబోయిన కావడిబరువు (ట)
కసిబోక తిరిగెడు కావటిబరువు (త)

నరుదుగా మీరు నాకై పడ్డచేటు
లరసి చూడంగ నెన్నైనను గలవు
గరిమెతో నేకచక్రంబునఁ జేరి
చలములు విడిచి భిక్షము లెత్తి కుడిచి
పలుదురు విప్రులపంచల ముడిగి
యున్నతస్థితిమాని యున్నది యొల్ల
నన్నుంచికాదె! యోనరనాథచంద్ర!
మాయజూదము లాడి మహిఁగోలుపోయి
దాయలచేఁ జిక్కి ధైర్యముల్ వదలి
కూళలై యాయుధకోట్లఁబోనాడి
ఆలి నంగడిబెట్టి యపకీర్తివడసి
జేలపై పగరకు భృత్యులై చేసి
చలములు విడిచి భిక్షము లెత్తి కూడు
పోలింపఁ ద్రోపులఁబోయి యన్నిటికి
యలసి యుండుటయెల్ల న న్నుంచికాదె!
ఘోరాటవులఁజేరి కోష్ఠంబు లుడిగి
కూరలుగాయలు కూళ్లుగాఁ గుడిచి
నారచీరలుఁగట్టి నగుబాటుకోర్చి

చారుసువస్త్రభూషణములు విడిచి
పాలుపొందనిష్టోపభోగము లుడిగి
నలుకువఁ జెందుట నన్నుంచి కాదె!

అనఘాత్మ! నిన్ను నే ననఁబని లేదు
తనరార బ్రహ్మవ్రాతకుఁ దప్పరాదు *
మాయయ్య ద్రుపదభూమండలేశ్వరుఁడు
పాయనిప్రేమల పగలును రేలు
దాదులఁరొమ్ములఁ దనరారునట్టి
దూదిపానుపులయందు బెనిచి యెపుడు
యేకోర్కెఁ గోరిన నేవేళనైన
కైకొనఁగాఁ దెచ్చి కరుణతో నిచ్చు
పలుమారు మీపాలఁబడినది మొదలు
నలమటకోదువలే దది మీకె తెలుసు

నాకనాయకుని నమ్మి యుండినసతికి
సకలకోరికలెల్ల సమకూర్చు నతఁడు
అతులితాటోపు లత్యంతప్రతాపు

* లేదు (2421)

లతిధైర్యబల విక్రమాటోపులయిన
పటు లేవురును గల్గి పడుపాటులెల్ల
జితపడ ననుభవించితి నని పల్క
యనిలతనూజుని యాననాబ్జంబు
గనుఁగొన నాతఁ డగ్రజున కిట్లనియె

భీముఁడు ద్రౌపది నంపుమనుట

నరనాథ! మీయనుజ్ఞలు గల్గెనేని
ధరణిపై నా కసాధ్యములును గలవె
నను నీవు పేదమానవునిగఁ జూచి
యనిలనందనుఁ డొంటి యని పల్కఁదగునె
సాటికి నెక్కు నిశ్శంక రాయనికి
కోటముత్తిక లన గూడునే యొందు [1]
తిలకించి చూడు రాతికిగిలిగింత
గలిగిన నాకెక్క గలుగుభూపాల [2]

---

1 కోటముత్తిక లన గూడునా యొందు (౧)
కోటముట్టుచే యనఁగూడునా యొందు (క)
2 గలుగునె లోకంబులోన భూపాల (చ)

నీకు నేవెఱచుట నిక్క మొక్కటియు
కాక భయంబు నే కలనైన నెఱుఁగ!
కురురాజు నొకపెద్దకొండఁగాఁజేసి
పరువడి మొనఁజూపి పల్కితి రిపుకు
అతనికిఁ దోడుగా నమరగంధర్వ
పతు లేఁగుదెంచిన బర్వు లెత్తింతు
ననుఁజూచి యిపుడె యీనలినాక్షి ననుపుఁ
డన విని ధర్మజుఁ డనిలజుఁ జూచి
ఓభీమ! కల దింక నొకసంశయంబు

ధర్మరాజు సంశయించుట

ఈభీతహరిణాక్షి యీనీలవేణి
నిఁక నేమి యనవచ్చు నిటువలెఁ గోరె
సొగసినట్లన రాదు సులభంబుగాదు
బహుయక్షరాక్షసభయద మీవనము
విహితంబుగా దిది వీరాగ్రగణ్య!
యదిగాక నీవైన నర్జునుండైన
పదపడి నన్నుఁ గాపాడకయున్న

కలుషాత్ముఁడైన యాకౌరవాధిపుఁడు
పాలియింతు నని చెంతఁ బొంచియున్నాఁడు.
అక్కట చనియెద నన ధర్మ మగునె!
అక్కడ గాండీవి యమరేంద్రపురికి
తతశక్తి నేఁగె నింతకుఁ జేరఁడాయె!
నతఁ డిందు రాక ని న్ననుపలే నని న
వినయంబుతో మ్రొక్కి వేఁడ్క రంజిల్ల
ననిలతనూభవుఁ డన్న కిట్లనియె.

### భీముని సమాధానము

అమరేంద్రపురినుండి యగ్రజుం డిపుడె
కమనీయవస్తువుల్ గైకొనివచ్చు
వహికెక్కు కురుపతి వచ్చిన నకుల
సహదేవు లున్నారు సమయింపఁగలరు
జగదీశ! సతులవాంఛలు దీర్పకున్న
నగణితపాతకం బని యంద్రు బుధులు
ము ద్దుంచి మన మీతమోనిభవేణి
పద్దుదీర్పకయున్న భావ్యంబుగాదు

లలనలు చిన్నబాలురు వీరవరులు
తెలియఁజెప్పిన *దండ దీయరెంతైన
సకలలోకంబులఁ జండప్రతాప!
అకలంకగతి నిల్పు ననఘుఁడ వీవు
పెలుచ నీపేరు చెప్పినయంత మమ్ముఁ
దలఁపఁగా శక్యులే ధరణీతలేంద్ర!
ముక్తిప్రదాత కాముని గన్నతండ్రి
భక్తశరణ్యుఁ డాపద్బాంధవుండు
ఘనవర్ణుఁ డఖిలజగద్రక్షకుండు
మనపాలఁ గల్గఁగా మరిభయం బేల?
నుతికెక్క నానందనుని ఘటోత్కచుని
ధృతిమీర మాసన్నిధిని నిల్పి పోదు
ధరణీశ సెలవిమ్ము తడవేల యనిన
నరనాథునకు మ్రొక్కి నకులుఁ డి ట్లనియె.

నకులుఁడు ద్రౌపది నంపు మనుట

తావకకీర్తిప్రతాపము ల్సకల

* పట్టిన (ట)

దీవులయందెల్లఁ దేజరిల్లఁగను
అదిగాక భీము బాహాటోపశౌర్య
విదితగదాదండవిస్ఫులింగములు
శిఖిశిఖారేఖ ప్రసిద్ధమై మిగుల
నిఖిలలోకంబులయందు వెలుంగ
సకలనాథకేతనాశ్వసాదులు
సకలయుదివ్యశస్త్రశరాసనములు
[బహుముఖరాజసభయందమానసము
విహితంబుగా దిది వీరాగ్రగణ్య
యదిగాక నీవైన నగ్రజుండైన
పదపడి నన్నుఁగాపాడకయున్న
కలుషాత్ముఁడైన యాకౌరవాధిపుఁడు
పాలియింతు నని చెంత బొంచి యున్నాఁడు
అక్కట చనియెద నన ధర్మ మగునె
అక్కట గాండీవి యమరేంద్రుపురికి
తతశక్తి నేఁగె యింతకుఁ జేరఁడాయె
నత డిందురాక నిన్ననుపలే నన్న
వినయంబులో మ్రొక్కి వేడ్క రంజిల్ల

ననిలతనూభవుఁ డన్నకి ట్లనియెఁ
ధరణీశ నీముద్దుతమ్ముఁ డైనట్టి
పరశక్తి గలకపిధ్వజుని యీక్షణమె
పసమించు నస్మదంబరదూతచేత
పొసఁగ మీసమ్ముఖంబునకు రప్పింతు
నుర్వీతలేశ్వర యొకనిరూపంబు
పరువడి వ్రాయించు ఫల్గునుపేర
నన విని సంతోషితాత్ముఁడై శమన
తనయుండు కరుణ నాతని కౌఁగిలించి
యాయర్జునునిపేర నపు డొకలేఖ
వ్రాయించి యిచ్చిన వాయుసూనుండు
కరుణతోఁ దనతండ్రి గంధవాహుఁడు
ఇరవొందఁ దను మెచ్చి యిచ్చినయట్టి
గ్రంథానుసారసత్కమనీయధూప
గంధిలవరమంత్రకలితరభాంగ
బంధబంధురకరభార్జితంబైన
గంధసారోజ్జ్వలద్ఘనసాయకంబు
పొది యడలించి యద్భుతముగా నార్చి

పదపడి యాలేఖ భద్రంబు చేసి
శరమధ్యమున గట్టి చట్టమైనట్టి
వరశరాసనము చెల్వమున చేపట్టి
గొనకొని విలునారి గొనయు మెక్కించి
కనకపుంఖోజ్జ్వలకాండ మంకించి
నారి సంధించి యానాక మీక్షించి
ప్రాయాధకర్ణాంతపర్యంతమునను
దిగిచి కపర్ది సన్నిధిని నిల్పు మనుచు
గగనవీథికి నేసె ఘనతరాస్త్రంబు
అపు డాశరాసము నద్భుతం బడర
గప్పున నురగలోకము సొచ్చివచ్చి
కాకోదరాధీశు గర్వం బడంచి
వైకుంఠమునకు జవంబున నేఁగు
గరుడుని లీల నాకాశమార్గమునఁ
గర మొప్పు నధికవేగమున నేతెంచి
వరభోగభాగ్యదుర్వారసంపదల
సరసమై చెన్నొందు స్వర్గంబునందు
కౌండిన్య గౌతమ కశ్యప కణ్వ

మాండవ్య మైత్రేయ మౌద్గల్య ప్రభృతి
పరమమునీశ్వరుల్ పార్శ్వభాగముల
నరసి పురాణశాస్త్రాదులు చదువ
తుంబురునారదాదులు వీణెయలను
తంబురుల్ మీటి గీతములు పాడఁగను
రంభావధూటికఠోరంపువక్షోజ
కుంభంబు లొక్కింత కులుకఁ జెల్వుగను
కొలువువా రచ్చెరుకొని చూచి మెచ్చ
నలు దెరంగుల హెచ్చి నాట్యంబు సలుప
నురగేంద్రనిభవేణి యూర్వశీరమణి
పరువడి కటికచభారంబులకును
గడువడిఁ బరికింపఁ గద్దు లేదనెడి
నడుము దోట్రుపడంగ నర్తనం బాడ
మెలకువ గతులచే మేనకాలలన
నిలుకడతోఁ జేరి నృత్యంబు సలుప
వలమంజుఘోషామృగాక్షి శాస్త్రోక్తి
నలువునఁ జెలరేఁగి నటనలు సూప
గరుడకిన్నరయక్షఖచరకన్యకలు

సిరులు నొలుకఁ జేరి సేవలుసేయ
ఆకటికట నిల్చి యమరగంధర్వ
రాకేందుముఖులు పరాకులు దెలుప
రహిమించు కాంచనరత్నసంఖచిత
మహితమహాస్థానమంటపంబునను
తిరవొందఁ గొలువున్న దేవవల్లభుని
పరిగద్దె యుక్కి యచ్చరులు మెచ్చఁగను
కాలకేయాదుల ఖండించు బిరుదు
లోలి దేవతలెల్ల నుగ్గడింపఁగను
సరసకళావిలసద్వినోదములఁ
బరికించుచున్నట్టి ఫల్గునుఁ ద్రోల
నమరసంఘము లెల్ల నచ్చెరుపొంద
భ్రమసి సంయమిరాజపటలిపీడింప
సురవిభుం డెంతయుఁ జోద్యంబునొంద
పరివారములు భయభ్రాంతిచేఁ జెలఁగ
వ్రాలిన నమ్మహావాయుసాయకము
పోలించి కాంచి యాపురుహూతసుతుఁడు
ఆయస్త్రమున వ్రాయు నక్షరపం క్తి

వాయుసూనునియాన వ్రాలొటఁ దెలిసి
విహ్వాలచిత్తుఁడై విహ్వచ్చుఁ డపుడు
సింహాసనము డిగి చేతులు మొగిచి
వరుస నస్త్రమునకు వలగొని మ్రొక్కి
కరమొప్ప తనరెండుకరములు నెత్తి
కమ్మ నమ్ముననంటఁ గట్టినయట్టి
కమ్మపై పాండవాగ్రణిముద్రఁ గాంచి
సిరిమించు నాలేఖ శిరసావహించి
గరిమెతో నిటలభాగంబునఁ జేర్చి
కనుఁగవనొత్తి వక్షంబున నలమి
పసుపడఁ గట్టిన బంధముల్ విడిచి
వినయంబుతో కమ్మ విప్పి వాసవుఁడు
వినుచుండ చదివె నావీరశేఖరుఁడు
"శ్రీమన్మహారాజశేఖరుం డఖిల
భూమండలాధీశ భూరిమాణిక్య
మహితకిరీటశుభప్రభాజాల
విహితపాదాబ్జుండు వీరపుంగవుఁడు
సత్యవ్రతాచారు సర్వజ్ఞమూర్తి

నిత్యషోడశదాననిరతుఁ డై నట్టి
యనఘుచారిత్రుండు యమతనూభవుఁడు
తనరార తనకూర్మితమ్ముఁ డై నట్టి
భుజబలవిక్రమాద్భుతయశోధనుని
విజయుని వేట్కఁ దీవించి పుత్తెంచె
నట్టికార్యము నేటియరుణోదయంబు
దట్టించి పవననందనుఁడు కాంతార
మునకుఁ దాఁజని కందమూలఫలములు
గొనివత్తు నని వేగఁ గువలయనేత్రి
పతిహితచారిత్రి పాంచాలపుత్త్రి
నతని కడ్డమువచ్చి యాఁగిపోనీక
గొనకొని తనుఁదోడుకొనిపొమ్మటంచు
వనజాక్షిచలపట్టు వదలదింతైన
నేమియుఁ దోఁచక నిపుడున్నవాఁడ
నాముద్దుతమ్ముఁడ నాకేశతనయ
కడఁకతో నీకమ్మ కన్నాక్షణంబె
వడిగ రమ్మని దూరి వ్రాసినలేఖ"
తేటగాఁ జదివి పార్థివుఁడు వేగంబె

ఖేటేశునకు మ్రొక్కి కీర్తించి పలికె
దేవదైత్యవిదారదీనమందార
యే విన్నవించెద నేనొక్క మనవి
వడిగ రమ్మని లేఖ వ్రాసె మాయన్న
తడవు నే నిందుండ ధర్మంబుగాదు
పాంచాలపుత్త్రి తాపట్టిన ప్రతిన
కొంచెపుపని గాదు క్షుధరవిదార
కోరదు మున్నెట్లు కోర్కె లెన్నఁడును
మీరదు మామాట మిగుల దింతైన
చపలనేత్రికి యింతచలము పట్టుటయు
విపరీతకార్యంబు వివరించి చూడు
కలహంబు బహుళంబుగాఁ గల్గు మాకు
సెలవిమ్ము చనియెద శీఘ్రమే యనిన
తనయుఁ గౌఁగిటఁ జేర్చి తగ నాదరించి
కనకాంబరములు ఘనభూషణములు
గారవం బెసఁగ సుగంధవస్తువులు
పారిజాతాధిక ప్రసవదామములు
యాంవాసవుం డిచ్చి యనిచిన నతఁడు

దేవసంఘములు సుభళి యని మెచ్చ
సురనాథునకు మ్రొక్కి సారిది నర్జునుఁడు
వరదివ్యరథ మెక్కి వడి నేఁగి యేఁగి
ద్వైతవనాంతరస్థల మటు చేరి
యాంతతభయభక్తి యన్నకు మ్రొక్కి
వరుస ధౌమ్యాచారవరుని శ్రీపాద
సరసిజములకు సాష్టాంగము ల్సేసి
యనవొంద ననిలజు నడుగుల కెరఁగి
యనుజులదీవించి యతివ నూరార్చి
యందఱఁ జూచుచున్నంత దేవేంద్ర
నందనుతో ధర్మనందనుం డనియె.
అర్జున విక్రమోపార్జన సమద
దుర్జనసంహార దోర్వీర సార
వనజాతదళనేత్రి వనవిహారంబు
జనఁదలఁచినది యీసామీరి వెంట
నిబిడఘోరాటవినిఖిలదానవులు
ప్రబలులై యందంద బలిసియున్నారు
కౌరవాధీశుఁ డిక్కడ దృష్టినిలిపి

ధీరుఁడై కోరలు దీటుచున్నాఁడు
ఈవేళ మనపైన భీష్టంబులేక
దైవరాయఁడు దయదప్పియున్నాఁడు
అక్కడ నొకకార్యమై చిక్కువడిన
పక్కన నగరె! యాంపగవారలెల్ల
సమయంబుగా దని సరసోక్తిమీర
కమలాక్షికిని దెల్పఁగా దగుననిన
విని సంతసించి యావివ్వచ్చుఁ డపుడు
సనబోణి వీక్షించి నగుచు నిట్లనియె.
ఫుల్లాబ్జగంధి! యోభుజగేంద్రవేణి
పల్లవపాణి యోపాంచాలతనయ
కోమలి యిది యెంత కోర్కె గోరితివి
యామహాగగనంబునందు పోవలదు
మృదులాంబుజంబుల మీరు నీతళుకు
పదముల కేల యీపాషాణబాధ
నాకలోకమునందు నఖిలవస్తువులు
నీకు వెచ్చితి నేను నెమ్మితో నిపుడు
మందారకుసుమదామములు నిచ్చెదను

ఇందిందిరాలక యీకోర్కె విడువు
మంచివస్తువులు ప్రేమమున యిచ్చెదను
సందీప్తదేవభూషణము లిచ్చెదను
ఇందుబింబానన యీకోర్కె విడువు
రమణీయదివ్యాంబరము లిచ్చెదను
కమలయాతాక్షి యీకాంక్షలు విడువు
మంచివస్తువులు ప్రేమమున నిచ్చెదను
కాంచననాస! యీకాంక్షలు విడువు
కోంచక దక్కినకోర్కె లిచ్చెదను
కాంచనాంగిరో! బుద్ధి కాంక్షలు విడువు
అటుగాక చంద్రబింబాస్య! యీయడవిఁ
బటుతరకాలసర్పంబులు గలవు
అరుదఱదమీనాక్షి యవ్వనభూమి
నరిసంచయములవిహారము ల్గలవు
కరిరుఁదయాన భూగహానంబులందు
గురుతరహార్యక్షకులములు గలవు
అరవిందపాణి! యీయడవిలోపలను
దురుసైనగంధసింధూరము ల్గలవు

హరిమధ్య! యిట్టిమహారణ్యమునను
కరమొప్ప శరభమృగంబులు గలవు
ఏమిగావలె నన్న యిచ్చెద నీకు
వామలోచన! యిట్టివాంఛలు విడువు
అన విని పాంచాలి యర్జునుఁ జూచి
కనుఁగవ నశ్రువు ల్గ్రమ్మ ని ట్లనియె
అనఘ చారిత్ర యోయమరేంద్రపుత్ర
యనువొంద మున్నెన్నఁడైనను మిమ్ము
కోరి యీగతి వేడకున్నదిగాదె
మారుతి మానవమాత్రుఁడే యకట
అడవిలో లేనిభయంబులు సెప్ప
తడబడి పెదవులు తడుపుచు నిట్లు
తెరగొప్ప నావాంఛఁ దీర్పక మీరు
పరిహసించఁగ నెంత పని యిది నాథ
మందారకుసుమదామములు నే నొల్ల
సందీప్తదేవభూషణము లే నొల్ల
రమణీయదివ్యాంబరములు నే నొల్ల
క్రమమొప్ప చందనగంధ మే నొల్ల

మంచివస్తువులు ప్రేమమున నేనొల్ల
కొంచక దక్కినకోర్కె నేనొల్ల
నంపిన గహనవిహార మంపుదురు
నంపకయున్న నే నన్నియు నొల్ల
వన విని కలకంఠి నపు డాదరించి
ఘనుడు కిరీటియగ్రజున కిట్లనియె
జగతీశ! సతులు వాంఛలు దీర్పకున్న
నగణితపాతకం బని యండ్రు బుధులు
లలనలు చిన్నబాలలు వీరవరులు
తెలియజెప్పినదండ తీయ రెంతైన
ముద్దుగా నతిహర్షమున నీలవేణి
పద్దుదీర్పకయున్న భాగ్యంబుగాదు
సకలలోకంబులు చండప్రతాప
మకలంకగతి నిచ్చు ననఘుండ వీవు
పెలుచ నీపేరు చెప్పినయంత మమ్ము
దలపంగ శక్యులేధరణీతలమున
ననిలతనూభవుం డసహాయశౌర్య
ఘనధైర్యగాంభీర్యకలితతేజుండు

నరయ హిడింబి బకాసురవీర
వరుల చెండాడినవరబాహుబలుఁడు
సందేహ మేటికి సామీరి వెంట
యిందీవరాక్షుని నిపు డంప నగును
నావిని ధర్మనందనుతోడ నకులుఁ
డావెస నిట్లను ననుమోంద మెసఁగ
తావకకీర్తి ప్రతాపము ల్సకల
దేవులయందెల్లఁ దేజరిల్లఁగను
భీమసేనునిగదా భీమ ప్రచండ
ధామ విజృంభితోద్దండప్రదీప్త
శిఖశిఖారేఖప్రసిద్ధతేజంబు
అఖిలలోకంబులయందు వెలుంగ
నక్షీణరథకేతనాశ్వసారథులు
నక్షయదివ్యశస్త్రాస్త్రజాలములు*]
గలమహాబలశౌర్యగాంభీర్యధైర్య

* 249-290 పంక్తులస్థానమున ఈవిషయము(291-531 పంక్తులు) ఆంధ్రసాహిత్యపరిషత్తువారికడనున్న (త) యను తాళపత్రప్రతియం దున్నది.

కలిత తేజోనిధి గాండీవి గలుగ
నిన్నిఁటికన్నను హితుఁడు బాంధవుండు
వెన్నుఁడు గలుగంగ వెరపేల మనకు
దర్పణంబునఁ బర్వతప్రకాండంబు
లోర్పున నణుకులై యున్న చందంబు
నకట దేవరపాలి యాజ్ఞలోఁ జిక్కి
యొకకొంత వెరపుచే నుందురుగాని
ధరణీశ నీసహోదరులు గోపింప
కుసురా జనఁగ నెంత కురుయోధు లెంత
సురవరు లెంత రక్షోవీరు లెంత
గరుడనాయకు లెంత గంధర్వు లెంత
నరు లన నెంత కిన్నరు లన నెంత
పరగ త్రిలోకాధిపతు లన నెంత
నెలకొని నీబల్మి నీవెరుంగకను

### సహదేవుఁడు ద్రౌపది నంపుమనుట

తలపోయనేటికి ద్రౌపది ననుపుఁ
డన విని సహదేవుఁ డగ్రజుతోడ
ననువొంద నిట్లను నవనీతలేంద్ర

కడుభీతితోఁ దల్లికడుపుసొచ్చినను
కడపటవచ్చెడికార్యంబులెల్ల
రాకపోనేరవు రానికార్యంబు
లెక్కడనున్నను నింతైనరావు[1]
వలనొప్ప నలచక్రవర్తి రాఘవులు
తలపోయలేరైరె దైవవశంబు
దప్పింప శక్యమే ధాతకునైన
నెప్పటి కప్పటి కేమేమిపనులా
యప్పటి కాపను లమరఁజేయంగ[2]
తప్పివచ్చినమీద దైవ మున్నాఁడు
అదిగాక మొనఁజూపి యాడితి రిపుడు
మదినుండి నీపవమాననందనుఁడు
చలమున నెంతైన చట్రాతినార
వలచు నీపనులందు వలదన్న వినఁడు
అతివ నంపుట లెస్స యంపకయున్న
నతఁడు దోడ్కొనిపోవునది నిక్కవంబు

---

1 లెక్కడనుండిన నెంతైన బోవు. (4491)
2 యప్పటి కాపను లమరకపోవు. (1378)

నాకుఁ దోఁచినయంత నావిన్నపంబు
మీకుఁ జెప్పితి దేవ మీచిత్త మింక

— ధర్మజునిసంశయము —

అన విని సహదేవు నక్కునఁ జేర్చి
యనుమోదమునఁ బాండవాగ్రణి పలికె.
తమ్ముఁడ నీపల్కు తథ్యంబు మాకు
సమ్మదం బగు నిందు చల్లలే దనుచు
నూఁదుక త్రావుచు నుందుమీఘనుఁడు
తోఁ దేనెలేనివాదులు దెచ్చు నెపుడు
మిముఁజూచుకొనుచు నేమియుఁ జింత లేక
నెమ్మదినుండుఁ నన్నియుఁ గల్గినటుల
కాంతారమున నొంటిగా జనువేళ
నెంతవారికినైన నింతి సంగడము
నడవిలో నొక కార్యమైన నీరమణి
మెడగు దె కే తెంచి మే లెంచవలయు
నంపక యుండిన నతివదుగ్ఖించు
నంపిన యేమానొ యది గానరాదు

బహుభోగముల నున్నపాంచాలపుత్త్రి
గహనంబునందు సాంగత్యదోషమున
నలమటగుంద నేమనవచ్చు విధిని
పలుమరుదైవంబు పగవారి గూడె
నని తలయూఁచి హా! యని వెచ్చ నూర్చి
కనుఁగవ కలితాశ్రుకణములు నించి[1]

— ధర్మరాజు ధౌమ్యాచార్యు నడుగుట —

తెలియ ధౌమ్యాచార్యు దెసఁ జూచుటయును
అలరి యావిప్రకులాగ్రణి పలికె

— ధౌమ్యుఁడు ద్రౌపది నంపు మనుట —

నిటువంటిపనులకై యేటికి మీరు
అటునిటు జూచెద రవనీతలేంద్ర
నాకుఁ దోఁచినరీతి నయశాస్త్రయుక్తి
వాక్రుచ్చుచున్నాఁడ వనితతో నిపుడు
కాననభూమికిఁ గదులుచున్నారు
నానావిహారముల్ నడుపుచున్నారు

---

1 ఘనముగా చింతించి కటకటా యనుచు (2421)

కనఁగలకార్యముల్ గనుచు నున్నారు
వినుతకీర్తులచేత వెలఁయు చున్నారు
మంచివస్తువులు ప్రేమంబునఁ గొనుచు
వేంచేయుచున్నారు వేవేగ నిటకు
కలుఁగనేటికి మీకు ఘనరాజ్యలక్ష్మి
చెలువంబుతో మిమ్ముఁ జేరుచున్నదియు
ననుమానమేటికి నంభోజముఖిని
ననుపుట లెస్సయా యనిలజువెంట
నన విని ధర్మజుఁ డౌఁగాక యనుచు
మనమున హర్షించి మారుతిఁ గాంచి
నాముద్దుతమ్ముఁడ నగరాజధీర
యోమరున్నందన యోభీమసేన
వనిత నీవెనువెంట వచ్చుచున్నదియు
ఘనమృగాధీశఖగసంకులంబు
తరులతానిబిడీకృతంబైనవనము
సరస చీమకుఁ దూరశక్యంబు గాదు

ధర్మరాజొడంబడుట

కంటికి ఱెప్పగాఁ గాపాడి వేగ

వెంటబెట్టుకరమ్ము వీరాగ్రగణ్య
అని సెలవిచ్చిన యధికమోదమున
పనుపడ ధర్మజుపదముల కెరఁగి
యతనిచే దీవన లంది ధౌమ్యునకు
హితభక్తిసంభ్రమం బెసఁగ నెంతయును
మ్రొక్కి యాశీర్వాదములు గాంచి యొలమి
గ్రక్కునఁ దమ్ములఁ గౌఁగిటఁ జేర్చి
నిశ్చలవృత్తితో నెలఁతయుఁ దాను
పశ్చిమగమనుఁడై పరువడి వెడలె.
సంతాపమును బొంది శమననందనుఁడు[1]
చింతించి నకులుని జేరఁగాఁ బిలిచి

**భీముఁడు ద్రౌపదితో వనమున కరుగుట**

వనితాలలామంబు వాయునందనుఁడు
ఘనమైన ఘోరదుర్గములకుఁ జనిరి
అమరగంధర్వవిద్యాధరయక్ష

1 శమననందనుఁ డంత సంతాపమంది
యమకేంద్రసుతునితో ననియె నెంతయును. (త)

ధర్మరాజువిచారము : నకులుని భీముని వెంటఁ బొమ్మనుట.

రమణీమణు లహోరాత్రు లెల్లెడల
నిరవొంద జరియింతు రివ్వనభూమి
నెరయ నాయుదిలోన నెగులు బుట్టెడిని
యవనిపై సఖులపై నర్థంబుపైని
ఎవరికి నైన నభీష్టంబు గలదు.

సరయక్షకిన్నరనాగగంధర్వ
గరుడఖేచరసిద్ధకామినీమణుల[1]
సరకుసేయని మహాసౌందర్యశాలి
తరుణిమాత్రంబె యీద్రౌపదీరమణి
చంద్రనివాసంబు సతి నెమ్మొగంబు
చంద్రవిలాసంబు సఖియ లేనగవు
కనకంబు నిరసించు కలికి మైమెఱుఁగు
కశకంబు నిరసించు కలకంఠినాస
కువలయానందంబు కొమ్మనేత్రములు
కువలయానందంబు కోమలిపిఱుఁదు

1 గరుడఖేచరసిశాకరబింబముఖులు (ట ; ప)

సారంగవిభవంబు జలజాక్షివేణి
సారంగవిభవంబు చామయానంబు
హరివినోదంబు తొయ్యలి రోమరాజి
హరివినోదంబు కంజాక్షి నెన్నడుము
అబ్జసౌభాగ్యంబు హరిణాక్షిగళము
అబ్జసౌభాగ్యంబు అతివ హస్తంబు
దానివిలాసంబు దానిరూపంబు
దానిమిటారంబు దానిచెల్వంబు
దానివయ్యారంబు దగఁగాంచిరేని[1]
మానీంద్రులకు నెల్ల మది బెగ్గడిల్లు
వనితయు మారుతి వచ్చునందాక
ననుమాన మగుచున్న దనఘాత్మ నాకు
పదపడి వారివెంబడి వడి నీవు
కదలిన నామది కలకదీరెడిని
అన విని నకులుఁడు యమసూతుఁ జూచి[2]

---

1 దాని యొయ్యారము ల్దగఁగాంచిరేని (ప)

2 అన విని గాండీవి యన్న కిట్టనియె (త)

## నకులుని ప్రత్యుత్తరము

అనఘాత్మ మీపల్కు లవియెల్ల నిజము
కరముద్ధి మీయనుగ్రహమున నేఁగ
యిరవొంద వనభూమి కేతెంచునపుడు
నన్ను వీక్షించి గంధవహాత్మజుండు
సన్నల బిల్చి హస్తంబుఁ జేపట్టి
ఎన్నెన్ని విధముల నిటచాటి చాటి
యన్న యున్నాఁ డని యరిగె నెంతయును
పదరక నాతని పటువాక్యసరణి
మదిలో విచారించు మానవాధీశ[1]
మనమీద క్రోధ మేమఁగడు రా రాజు
దినరాజసుతుఁడు బోధించు నాతనికి
చలమున శకుని దుశ్శాసను లెపుడు
పెలుచ మచ్చరములు పేర్చుచుందురు
కనుగల్గియుండక గడు మోసపోయి[2]

---

1 అమహోమహుని వాక్యము నిక్క మరయ
నీమది దలపోయుము నృపకులోత్తంస (2421)

2 కనుగలియుండ కిక్కడ మోసపోయి (2421)

వెనుక చింతించుట వెఱ్ఱితనంబు
ధరణిపై పవననందనుఁ డజేయుండు
నెరయ నాతనిబల్మి నీ వెఱుంగుదువు
గాక నంతట దొడ్డకార్యమౌ నేని
యాంకట వనుల కే నరిగెదగాని
వెనుక బుద్ధులు పదివేలుచెప్పుదురు
జననాథ యిపు డిది సమ్మతిగాదు
నావిని ధర్మనందనుఁ డట్టినీతి
దా విచారించి యంతయు నూరకుండె
అంతట పవనుజుఁ డలివేణి దాను
కొంతద వ్వరుదెంచి కోమలిఁ గాంచి

### ద్రౌపదీదేవివనవిహారము.

వనజాక్షి మాయన్న వలదన్న వినక
వనవిహారము వాంఛ వచ్చితి వీవు
అనువొంద యేఫలం బనుభవించితివి[1]

---

1 ననుబోటి బలశౌర్యనయశాలివెంట (ట)
ననువంటి బలశౌర్య నయశాలివెంట(ప)

వనిత పోయినయట్ల వచ్చినయట్ల
గాకున్న నీమహాగగనంబునందు
నీ కభీష్టం బేమి నిక్కంబుపలుకు
మిచ్చెదువచ్చిన నేవస్తువైన
నిచ్చెద నీయాన [1]యిందీవరాక్షి
నావిని నవ్వి యానాళీకపాణి
తీవి నెమ్మదిని వాటిల్ల నిట్లనియె
ప్రాణేశ నాకోర్కె ఫలియింప నీవు
గాని యింకెవ్వరు గల రెంచి చూడ
నడుగ మంటివి గాన నడుగుట సులభ
మడిగిన యిచ్చుట యది దుస్తరంబు
నోటి కొచ్చినయట్ల నూఁకనవచ్చు
మాటాడి నిలుపుట మరికొద్దికాదు.
సతులు గోరినకోర్కె సఫలంబు సేయ
చతురాననునికైన శక్యంబు గాదు
బిరుదు వీరుండైనఁ బిరికివాఁడైన

1 సాధించి. (ట)

సరసి జాతులచెంత సాహసుం డౌను
ఎదురు దన్నెఱుఁగక నెంతయుఁబల్కు
కదిసి వేడినవేళ కళవళమందు
వలవని యడియాస వలదు భూపాల!
యలరువనంబుల కరుగుదమన్న[1]
కనకాంగివదనంబు గాంచి యుప్పొంగి
యనిలతనూభవుం డనియె నంతయును
ఎంత మాటాడితి విందీవరాక్షి
కంతువిద్వేషితోఁ గదలివచ్చినను
అంభోజసంభవుం డడ్డగించినను
జంభాసురారిమచ్చరముచేసినను
కోరి త్రిలోకము ల్గూడివచ్చినను
ధారుణి వాక్యంబు దప్పను నేను
తిరమొంద నీకోర్కె దీర్చకయున్న

1 నెరసాహసుండవు నిన్నంటగాదు
నరనాథ పురుషులనడత లెంచెదను
చనువున కోపంబు క్షమియింపవలయుం
ననిన పాంచాలితో ననిలజుం డనియె.(1378)

తరుణి నేధర్మజు తమ్ముఁడఁగాను
అన విని పాంచాలి యనిలనందనుని
గనుఁగొని యిట్లనె కటకటం బడుచు
నాజీవితేశ్వర నరనాథచంద్ర
రాజవంశాగ్రణిరణరంగభీమ
మతిలేక నే ననుమాటకె యింత
ప్రతినసేయఁగ నీకు భావ్యమే నాథ
వనవిహారముజాలు వస్తువుల్జాలు
నిను వేఁడుటలు చాలు నీ యావి చాలు
చెదరె యుల్లంబు వచ్చినయట్టితోవ[1]
పదపద నీకఁజాలు పదివేలువచ్చె
నన విని నవ్వి యయ్యనిలనందనుఁడు
వనబోణి వీక్షించి నలుఁవొందఁ బలికె
శీతాంశువదనరాజీవదళాక్షి
నా తెంపు నా పెంపు నాభుజాబలము
గని యున్నదానవు గలఁగ నేమిటికి

1 పదకడి ధర్మజపదములకడను (2421)

ననుమీఱివచ్చు నంతటిపనిగలదె
యిచ్చెద ననిపల్కి యియ్యకయున్న
కచ్చుకపడి పాతకముబోవనీదు
ధరణి మెచ్చరు వీరధర్మంబుగాదు
యరమఱ సేయక యనుమానపడక
నడుగు మేవరమైన నడిగినకోర్కె
లిడియెద ననిన నయ్యింతి యిట్లనియె
ప్రకటించి నీదు వెంబడివచ్చునపుడె
సకలభాగ్యములెల్ల సమకూడె నాకు
వేమాఱు నే విన్నవించిననైన[1]
నామాట చెల్లించు సాధుండ వీవు
మనుజేంద్ర యీవనమార్గంబునందు
ఘనమైనవస్తువుల్ గనుగొంటినేని
యప్పుడు మిమ్ము నే నడిగెదఁగాని
యిప్పటి కేమి మహీనాథచంద్ర[2]
సొంపైన వనములు సొబగైన నగము

1 నేమేమి నేవిన్నవించిననైన (త)
2 యొప్పైనతావుల కొనరవేంచేయు (త)

లింపైన వాహిను లెన్నంగఁదగిన
కొలఁకులు నొరపైన కోన లెచ్చోట
గల వచ్చుటికి వేగ గమనించవలయు
అనిన సంతోషించి యనిలనందనుఁడు
చనుమార్గములను గంజాతలోచనకు
గరుడకిన్నరయక్షఖచరగంధర్వ
వరసిద్ధసాధ్యనివాసభూములను
వనములు నదులు పర్వతనికాయములు
ఘనమైనపాదరిండ్లఁ గలితంబులయిన[1]
మహితవస్తువులు వేమాఱు దెల్పుచును
విహితసంభ్రమముల విహరించుచుండ
పొసఁగ నాకట నొచ్చి బోరియలు సొచ్చి
బుసగొట్టుచును నేఁగు భుజగసంఘముల
కొదకక మెడలంటి గోరికి ఖండించి
బొదలు ముంగిసల చప్పుడు లాలకించి
యదరుచు కన్నంబులఁ లీల వెడలి

1 మునిజనాగణ్యతపోనివాసముల (ప)

కదుపువై చనుమూషకములకు బొంచి
రాగించు బలుబిడాలములపై దూరి
మూగిన రేచుగుంపులు మీఱఁ గొప్ప [illegible]
గించు బెబ్బులులపై గినియు భల్లూక
సంచయంబుల నొంపఁ జనువరాహముల
బోనీక మార్కొనఁబోవ నేనుఁగుల
పైన లంఘించి కుంభంబుల వ్రచ్చి
మనుచు వేలె నన్ని యంభోజవదన
ననుపమానందసముంచితామోద
లలితలతాంతపల్లవపుష్పప్రతతి
వలనొప్పు శృంగారవనము సొత్తెంచి
తన కైశ్యవదననేత్రకపోలములకు
తన కాళికాధరదంతవాక్తతికి
తనకంఠబాహులతాహస్తములకు
తన కుచరోమాళితనుమధ్యదేశ
ఘనతరనాభికాకటిభోగములకు
తనయూరుజంఘాపదద్వయగతుల
కమరసమానంబు లైనవస్తువులు

కమలాకరములందుఁ గని చెలరేఁగి
తుమ్మెదకదుపులఁ దోలి నెత్తమ్మి
గమ్మి య్యెమ్మె లడంచి కలువలు ద్రెంచి
పలుమారు నవచంద్రఫలకముల్ విరిచి
పొలవక కాంచనసూనముల్ రాల్చి
లలితమౌ బింబఫలంబులు డుల్చి
కలగక మొల్లమొగ్గలనిగ లడఁచి
చిలుకల నెగదోలి చెలగి శంఖంబు
కలిమెల్ల బోనాడి కంజకాండములు
చెలువముల్ బెకలించి చిగురాకుగిల్లి
తులకించి పువ్వుగుత్తుల నెత్తిబట్టి
చీమబారుల నొంచి సింగంబు దరిమి
వేమారు జిగిపొన్న విరిరేకు మడచి
తెలియంగ కర్పూరదిన్నియల్ ద్రొక్కి
చలమున కదళికాచర్మంబు లెత్తి
కరమర్ది శాలికాగర్భముల్ సించి
యరుణాంబుజంబుల నటు నిటు బరచి
యంచల్లంచల మించు నంచలగముల

నించుక చప్పట లిడిపారదఱిమి
రవణ మూ కములాకరంబు సొత్తెంచి
యవగాహ మొసరించి యటవినోదించి
తనరారు కాంచనతరుల మధ్యమున
నవతరకల్పవృక్షంబులనీడ
భూనుతంబై మించు పూఁపొదరిండ్ల
జానొప్ప గిరిగింజచప్పరంబులను
ఘనసారమృదువేదికలఁబోలి వ్రాలి
జనపతి దాను విస్తారభోగముల
విలసిల్లురోఁద లేనివేడ్కల బొరలి
పొలపొంద నొకప్రొద్దు క్రీడించి
అంతట జాలించి యచ్చోటు బాసి
కుంతితనూజుండు కువలయనేత్రి
అంచితంబైననీలాభ్రంబు చెంత
మించులు గుల్కఁ గ్రొమ్మించుచందమున
సతికేలు వదలక జనవల్లభుండు
పతిదండ బాయక పాంచాలపుత్త్రి
ఏంతయు వేడ్కల నింపుసొంపులను

వింత వనాంతమున వెదకి చూచుచును
నెయ్యంబుతోఁటల నికరంబులందు
నుయ్యాల లూగుచు నొఁగి పొదరిండ్ల
దూఱుచు మీఱుచు తుమికి యాడుచును
నీరజాకరముల నెఱి జొచ్చి హెచ్చి
యోలలాడుచు భ్రమ నొండొరుల్ గెరలి
వేలారువిధముల విశ్రమించుచును
కేళికాననగముల క్రీడించి మించి
మేలైనకోనల మెలఁగుచు పూల
బంతులవేయుచు బలుదెరంగులను
మంతనం బాడుచు మరి జన నెదుట
మహీజాతముల్ రోమమార్గముల్ గాఁగ
రహిమించుగండశైలములబెడంగు
లలితమా కుంభస్థలంబులు గాఁగ
నలరారు నలపారు టాకుల సిరులు
నలువొందునట్టి కర్ణంబులు గాఁగఁ
తిలకింప గిరినుండి దిగువకు సాగి
తోరమై తగమూడ తుండంబుగాఁగ

నారూఢతిలకాజటాలంబగరిమ
వరుస మహాజలవాలంబుగాఁగఁ
బరువడి నెడలేక పారునిర్ఝరులు
దనరారు మదగజధారలుగాఁగ
లోనుండి యిల నంటు గొన బ్రైనవిరులు
పనుపడ విలసిల్లుపదములుగాఁగ
ననలొందురామృగవిహారామహిమ
గరమర్థి భయదలంకారంబుగాఁగ
నరుదుమీరినవారణాచలాధీశు
గనుఁగొని యత్యంతకౌతుకం బడర
నెనయ సాపాంచాలి కిట్లని పలికె
యిందీవరానన యీమహానగము
మందులగుబ్బ లీమలయాచలంబు
హిమపర్వతంబు హేమభూధరము
నమరుతారాగంబు నరుణగోత్రంబు
నకలంకలీల నణకించుజాతి
సకలవస్తుచయంబు సకలభాగ్యంబు
సకలసౌఖ్యంబులు సకలౌషధములు

సకలవైభవము లచ్చటఁ గల్గియుండు
ఒకవంక కిన్నరు లొకదిక్కు దివిజు
లొకచక్కి గంధర్వు లొకట గింపురుషు
లొక టెంకి యక్షేశు లొకచెంత సిద్ధు
లొకచోట గరుడులు నొకక్రేవ మునులు
నమితమోదంబున ననవరతంబు
సమధిక క్రీడల సలుపుచుండుదురు
వనజాక్షి యిమ్మహావైఖరిగొంత
గనుగొందు రమ్మని కడువడి జనఁగ
మనసిజపవమానమానవాధీన
దినవీర ప్రతిమానదేదీప్యమాన
గరుడకిన్నరయక్షఖచరసంతాన
నిరతకల్యాణవర్ణితసంవిధాన
సౌభాగ్యసంధాన సంతతానూన
శోభనవిజ్ఞాన సుకరప్రధాన
భూనుతసంతాన భూజవితాన
నానాలతాసూన నవ్యనిధాన
మానితనిరుపమమణిమయస్థాన

తానమానసమాన తంతస్వమాన
కలితసాంద్రనవీన గంధర్వగాన
విలసితం బగు కోనవేట్కలింపూన
గని మెచ్చి మెచ్చి యాకామినీమణికి
ఘనవినోదంబులు గణుతించి మించి
పశ్చిమభాగంబు పరికించి కాంచి
యాశ్చర్యచిత్తుఁడై యనిలనందనుఁడు
ద్రౌపది నీక్షించి తగ నిట్టు లనియె
నోపంకజానన నోముద్దుగుమ్మ
కలికి చక్కెరబొమ్మ కమ్మపూఁగొమ్మ
కులుకుమీటుమిటారి కోమలాకారి
యలరు మొల్లలబంతి యంగజుదంతి
కలితకైరవనేత్రి కాంచనగాత్రి
తనరు వేడ్కల కొంతదవ్వుబుచ్చితిమి
మనవివేకంబు లేమనవచ్చు నబల (త)
కుప్పలుగా నున్నగొప్పముత్యములు
చప్పరించుచు వెదచల్లుచుఁ గెరలు
కొదమసింహముల మార్కొని పోరి పోరి

కదలని శరభసంఘములఁ దోలుచును
మేదిని నేనుంగు మేతలాడుటకు
మోదంబుతో మిన్ను ముట్టి భోరునను
చండవేగంబున జను దెంచుఘోర
గండభేరుండపక్షిరవంబులకును
భీతి నేగెదురణభీమగృధ్రముల
ఘాతకుదీరి దిగ్గనఁ బారతెంచు
బైరిల చప్పుళ్లఁ భ్రమసి రివ్వనను
బారులగుళ్లనిబ్బరముల దెలిసె
చలియించి పరతెంచుసాళ్వసంఘముల
నెలవెల్ల బరికించి నెగులునఁ బారు
వారణంబులఁ గని వణఁకుచుఁ బొదలు
దూరుజాల్ డేగలతోరంపురవళి
కలుకుచు నులుకుచు నన్యోన్యభీతి
కలకలార్భటుల నాకసము గంపింప
బరచు నానావర్ణపక్షిసంతతుల
నిరవందఁజూపుచు నేఁగుచున్నంత
సింధురగమనరాజీవదళాక్షి

గంధవాహతనూజుఁ గనుఁగొని పలికె
నవనీశ చూడు మల్లదె మిన్నుముట్టి
వివిధభూరుహలతావితతులఁ బొదలి
కనకనానామణీకలితంబు నగుచు[1]
కనిపించుచున్ననగంబు పేరేమి?
యని విన్నవించిన యలినీలవేణి
ననురాగమునఁ జూచి యనిలజుం డనియె

### గంధమాదనపర్వత వర్ణనము

తరలాక్షి గంధమాదన మను పేరఁ
బరఁగినశైలమీపర్వతమహిమ
లెన్న శక్యంబె వాణీశునకైన
పన్నగేంద్రునకైన పల్లవపాణి
మందరగ్రామంబు మణికోటినగము
మందులగుబ్బలిమలయాచలంబు
హిమచలోచ్చయము హేమభూధరము

---

1 కలిత నానామణీకలితంబు లగుచు
విలసితంబుగ చాల వేడ్కరంజిల్ల

నమరుతారాగంబు నరుణగోత్రంబు
నకలంకలీల నణకింపఁజాలి
సకలవస్తుచయంబు సకలభాగ్యములు
సకలసౌఖ్యంబులు సకలౌషధములు
సకలవైభవము లిచ్చుటఁ గల్గియుండు
ఒకవంక కిన్నరు లొకవంక దివిజు
లొకచక్కి గంధర్వు లొకట కింపురుషు
లొకతెంక యక్షేశు లొకచెంత సిద్ధు
లొకచోట గరుడులు నొకక్రేవ మునులు
నమితమోదంబుల ననవరతంబు
సమధికక్రీడల సంచరింపుదురు
వనజాక్షి యిమ్మహావైఖరుల్ గొన్ని
గనుఁగొందు రమ్మని గడువడిఁ జనఁగఁ
గడురమ్యముగఁ గ్రొత్తగా ననలొత్తి
వడిజలకణములు వానలై కురిసి
సలలితపుష్పగుచ్ఛంబుల వ్రాలి
తొలకెడుపూఁదేనెతోఁగూడ పక్వ
ఫలరసంబులఁ జాలుపైని వర్షించి

బలుకాల్వలై పారి పండువెన్నెలల
కువలయాధిప శిలాకోటులు గరగి
ప్రవహించి దుముకు నిర్ఝరములఁ గూడి
పచ్చరాచలువలపై నిండి యున్న
పచ్చికస్తురితెప్పలు లోనఁగొనుచు
సొంపైన వంకల సొలపు జవ్వాది
రొంపుల మీఁద నారూఢిగా దుమికి
పసుపడ నేరులై పారుచు తట్టు
పునుఁగున జొబ్బిల్లి పొలుపొందు వెదురు
గుములపై వడిసొచ్చి కుసుమపరాగ
సముదయంబుల మంచిశారదతతుల (తరుల)
పొంతలగపురంపుప్రోవుల నెల్ల
వింతగాఁ గలయించి వెల్లువల్ బారి
కడురమ్య మగుతరంగములచే నలరి
బెడిదంబు లగుచు నొప్పెడుపుణ్యనదుల
నవగాహనముల నెయ్యమున గావించి
కవగూడి యవల వేడ్కలుమీరఁ జనఁగ
ఉన్నతావరణచంద్రోపలగిరులు

సన్నుతికెక్కిన సాలము ల్గాఁగ
లలితవినూత్నపల్లవరసాలములు
పసమించు మణిసౌధపఙ్క్తులుగాఁగ
ప్రౌఢపుష్పపల్లవకింశుకములు
భూరిమాణిక్యగోపురములుగాఁగ
పొలుపొందఁ బూచిన పొన్నభూజములు
బలుమగరాల యుప్పరిగెలుగాఁగ
నెంచ మొగ్గలఁబోల్చు నీపూలసిరులు
మంచిముత్యపు మేలు మచ్చులుగాఁగ
బహుసూనరమ్యచంపకమహీజములు
మహనీయ హేమధామంబులుగాఁగ
సిరు లుల్లసిల్లఁ బూచిన పొదరిండ్లు
సరసంపు చిత్తరుచవికెలుగాఁగ
ధర నొప్పుగురువింద ద్రాక్షపందిరులు
మెరపైన చెందొవల్ మేల్కట్లుగాఁగ
కొమరు చెన్నొందు వైకుంఠంబుపోలె
సముదగ్రమాధవసంచార మగుచు
నిటలాబలోచననిలయంబుపోలె

పటుసర్వమంగళాభ్యంచిత మగుచు
వారిజాసనునినివాసంబుపోలె
నారదశారదానందంబు దగుచు
పురుహూతపట్టణంబునుబోలి యెపుడు
నెరయు రంభావాహిణీయుతం బగుచు[1]
పురుడింపఁగ నయోధ్యఁబోలె శ్రీరాము
భరతలక్ష్మణకళాబంధురం బగుచు
పొలుపొందుద్వారకాపురమునుబోలె
బలభద్రహారిచక్రభాసురం బగుచు
కవిరాజకల్పితకావ్యంబుఁబోలె
నవరసాలంకారనైపుణ్య మగుచు
సతతకవిస్తుతచందంబుఁబోలె
యతిగణవర్ణఫలాన్వితం బగుచు
రమణీయరత్నాకరంబునుబోలె
విమలాబ్జ బహురత్నవిలసితం బగుచు
ఘనరామరావణకదనంబు బోలె[2]

---

1. నెరయ రంభాప్సరోనిర్గతంబగుచు.
2. 4491 లో లేదు.

వనచరాధిపదైత్యవర్ణితం బగుచు
నొరపైన భారతయుద్ధంబుఁబోలె
గురుకర్ణభీష్మసంకులమును నగుచుఁ[1]
దనరారు గంధమాదనపర్వతంబు
చనవున కమలలోచనకుఁ జూపుచును
పలుచనీహారసోపానమార్గమునను
నెలమితో తిన్నగా నెక్కి పోవుచును
మదగజగమనయామార్గంబునందుఁ
బొదలు తుమ్మెదలఁ జూపుచు వేగవేగ
మలయక మిట్టతామరలు ద్రుంపుచును
విలసిల్లు సంపఁగెవిరులు రాల్చుచును
వెసచంద్రఫలకముల్ విఱిచి వైచుచును
అసమానబింబఫలాలి దుల్చుచును
కుందకోరకముల గుంజివేయుచును
పొందైన చిలుకగుంపులను దోలుచును
తెలివైన పోఁకబోదియలు గీటుచును
తొలఁగక జిగిఁదమ్మితూండ్ల ద్రెంచుచును

1. 4491- లో లేదు.

నలువు మీరిన లేఁతననలు గిల్లుచును[1]
సలలితసూనగుచ్ఛముల రువ్వుచును
పదరుచు కృష్ణసర్పములఁ దోలుచును
కొదమసింగముల కొంకులకుఁ బాపుచును
చక్కనిఘనసారసైకతస్థలులఁ
ద్రొక్కుచు ననఁటుల తొలఁగ దొబ్బుచును
పొల్పు నిర్వ్యాలబిత్తుపొట్టలబిగువు
సిల్చుచు తాఁబేళ్ల చెదర నూకుచును
నరుణాబ్జములుతమ్మిహంససంఘముల
నురికింపుచును మది నుల్లాసమొంది
పతికేలువదలక పాంచాలపుత్రి
సతి నండఁబాయక జనవల్లభుండు
వింతస్థలంబుల వెదకి చూచుచును
సంతోషచిత్తులై చన చన నెదుట
మనసిజపవమాన మాధవస్థాన
ఘనవాససానూనకలితనవీన

1. సొలపుమీరిన లేఁజసానలు గిల్లుచును (1578)

ఫలపల్లవోత్తాన పావనాసూన
లలితవనాసీన లావణ్యమాన
మానితగాంధర్వమానిని గాన
మానసస్వాధీన మార్గఘణీన
తాండవలసమాన దాననిధాన
పాండురద్రుమవిటపస్థలోడ్డీన
కలకంఠముఖపతగవ్యాజమాన
కలకలాకీర్ణలోకస్తూయమాన
సలలితశీతలచ్ఛాయాసమాన
విలసితం బగుకోన వేడ్కలింపూన
గని మెచ్చి మెచ్చి యాకామినీమణికి [1]
ఘనవినోదంబులు గనుపించె వేగ
పశ్చిమభాగంబుఁ బరికించి చూచి

## సూర్యాస్తమయసమయము

యాశ్చర్యచిత్తుఁడై యనిలనందనుఁడు
అంచితాంబుజపాణి యలిసీలవేణి

---

1 గని మెచ్చి మెచ్చియాకాననంబునను (ట)

పాంచాలపుత్త్రి నేర్పడఁజూచి పలికె
సలలితమృదుపాణి సైకతశ్రోణి
తలిరాకుఁబోణి యోద్రౌపదీరమణి
తనరు వేడ్కల నెంత దవ్వు వచ్చితిమి
మనవివేకంబు నేమనవచ్చు నబల
తిలకించి పడమటిదిక్కు వీక్షింపు
నలినాక్షి ఘడియ యున్నది ప్రొద్దుగ్రుంక

భీముఁడు ద్రౌపదితో ధర్మజాకడకుఁబోదమని చెప్పుట

నీయకార్యస్ఫూర్తు లెల్లఁ జూచుటకు
వేయిగన్నులు గలవేలుపువళిమె!
తడవిందు నిలిచిన ధర్మనందనుఁడు
బుడిబుడి యదటునఁ బొక్కి చింతించు[1]
నామీఁద నీమీఁద నరనాయకునకుఁ
ప్రేమవాత్సల్యంబు ప్రియమును గలదు
ననుబాసి నినుబాసి నరనాథుఁ డెంత

---

1 బుడి బుడి యడలును బొక్కిచింతించు (త)

ఘనదైన్యభయములఁ గలఁగుచున్నాఁడో![1]
పోవలె పద మని పొసఁగఁ జేపట్టి
పావని మరలింపఁ బాంచాలి పలికె
సన్నుతాటోప! మీసంగడి రాఁగ
నన్నియుఁ గనుఁగొంటి నభిలాషదీఱ
కలకంఠ శుకముఖ్యకలకలధ్వనులు
విలసిల్ల వీనుల విందుగా వింటి
సురుచిరదివ్య ప్రసూనవాసనలు
గరిమ నాఘ్రాణింపఁ గలిగె నీవలన
పరిపక్వమాధుర్య ఫలవితానములు
పరువడి రుచిగొని భక్షింపఁ గలిగె
సమ్మతి నొందితి ననుఁ దన నతఁడు

---

1 కవ్వడి నిచటికిఁ గ[illegible]ముచున్నాఁడో
యెవ్విధి నున్నాఁడో యిందునిభాస్య
అర్జునుం డిచటికి నరుదెంచె నేని
దుర్జనుం డైనట్టి దుర్యోధనుండు
ఏపనుల్ దలఁచునో యెఱుఁగ రా దతని
చేపట్టు గతజలసేతుబంధనము. (త)

ద్రౌపది యందుల కిష్టపడుట

నెమ్మితోడుత గమనించు నవ్వేళ
బాలభానుప్రభాభాసితం బగుచు
లాలితామోద విలాసంబు నగుచు
కమనీయకలితశృంగారంబు నగుచు
రమణ లోకైకవిరాజితం బగుచు
సముదితఘనతరాశ్చర్యంబు నగుచు
కొమరొందు జిగిబిగిఁ గులుకుచు నలరి
వేయుదళంబులు వెలయుపద్మంబు

సౌగంధికము వచ్చి వారలకడఁ బడుట.

వాయువశంబున వడి నేఁగుదెంచి
వరసౌరభము దిశావలయంబునిండ
నిరువురిసన్నిధి నెలమి వ్రాలినను
పన్నగాశనయాన పాంచాలతనయ
కన్నులపండువు గ్గాఁగ వీక్షించి
గరిమతో దనముద్దుకరముల నెత్తి
సరసలోచనపంకజంబుల నొత్తి

భావించి కాంచనపద్మంబుఁ గాంచి
పావనివదనంబు పరికించి గాంచి
వామలోచన ఖిన్నవదనాబ్జ యగుచు
భీమసేనునిఁ జూచి ప్రియమునఁ బలికె
ధరణీశ కనకపద్మము గనుఁగొనిన

ద్రౌపది సౌగంధికములఁ గొన్నింటిఁ దెమ్మని భీము నడుగుట

నరుదార మదిలోన నాసవాటిల్లె
గరిమెతో నివ్విరిఁ గైకొందుననిన
సరస మున్నెవ్వరో సవరించినారు
పరులు ధరించిన ప్రసవసంఘములు
నొరులకు ధరియింప యోగ్యముల్ గావు
వనవిహారమునకువచ్చు నవ్వేళ
చనువున ననుఁ బిల్చి సత్యప్రతిజ్ఞ
నడుగు మిచ్చెద నని యంటిరి మీర
లడిగెద నిటువంటివాటకాబ్జములు
గనుఁగొని యెందైనఁ గలదేని తెమ్ము
ఘనత మీసత్యవాక్యము నిల్పుకొండు
చేకొని మీర లిచ్చినవరంబునకు

నాకోర్కె చెల్లించు నా ప్రాణనాథ
యీవర మీకున్న నిచ్చోటు పాసి
నే వచ్చునది లేదు నీపాదమాన
అన విని బెగ్గిలి యనిలనందనుఁడు
కనకాంగి పల్కులు కడుముల్కు లగుచు
మనమున నాట ధర్మతనూజునీతి
ఘనముగాఁ దలపోసి కామిని డాసి
కనువిచ్చి మోము వెక్కసముగాఁ జూచి
యనుదిక్కు వీక్షించి యిట్లని పలికె
కలకంఠి కంటివే కమలబాంధవుఁడు

ద్రౌపదీ భీముల సంవాదము

పొలుపొందు పశ్చిమాంభోనిధిఁ జేరె.
నిరులు గ్రమ్ముచు నున్న నీకాననంబు
సురదైత్యులిచట హెచ్చుగ మెలంగుదురు
నారీశిరోమణి నను వంటి మేటి
వీరశేఖరు నీవు వేడితి విపుడు
ఇష్టము దప్పినవేళ నెంతేసి ఘనులు

సమ్మతి గాని విచారంబు లనక
కోరుట కొదువలౌఁ గోరినయట్టి
కోరిక లీకున్న కొదువలో కొదువ
కటకటా సమయంబుగాని యీవేళ
నిటువలె నడిగిన నేమనఁగలను
నిబిడాటవులయందు నిన్నుఁ బోవిడిచి
యబల యేవిధమున నరుగుదు నేను
ప్రాణపర్యంతమౌ పనులయందైన
మానంబు పోకుండ మనవలె నండ్రు
అటుబోవ నిట నెవ్వరైనను గలరె
యిట నున్న నటు సన నెవ్వ రున్నారు
ఇట నిల్తు నటఁ బోదు నేన యటన్న
పటుతరవిశ్వరూపంబును లేదు
తెగువ నిచ్చోటికిఁ దెప్పింతు నన్న
మగువ యాకర్షణమంత్రంబు లేదు [1]

1 రహిమీర నిచ్చటికి రప్పింతు ననిన

మాయన్న యెంత నెమ్మది నిన్ను నిలిపి
పోయెదఁ దెచ్చెదఁ బ్రొద్దున లేచి
కనకాంగి సౌగంధికములు దేకున్న
పనుపడ నామోము పరికింపవలదు

లోలాక్షి మునుదాటిలో గాలు దూర్చి
నేలమూర్ఖము మాను మీపనియంత
చనుదెమ్ము పోదము జాగేల ననిన[1]
వనజదళాక్షి పావని కిట్టు లనియె
అనఘాత్మ నీవంటి యసహాయశూరు
నినువంటి నెరయోధు నే వేఁడుకొనిన
కళవళపడి చేతగాని మానవుని
వలె దూరిపలుక నెవ్వరు చెప్పఁగలరు
మునుపు యిచ్చెద నని మొనసినవేళ
వెనుకముందఱఁజూడ వీరధర్మంబె
యీపని మీ మన్న యింతయు విన్న
కోపించుకోరికల్ కొనసాఁగఁబోవు

1 చనుదెమ్ము పోరాము జాగేల యనిన (త)

ముల్లోకములఁ జూడ ముగుదలకోర్కె
చెల్లించఁగలవీరశేఖరు లెవరు
నీవు చింతిల నేల? నెగులొంది నన్ను
భావించి చూచి కోపము సేయ నేల?
విచ్చలవిడి పల్కువేళలు వేరు
ఇచ్చట బరికింప నెవ్వరు లేరు
ఇచ్చట లే దను మిపుడె నీవెంట
వచ్చెద ననిన పావని యిట్లు పలికె
నళినాయతాక్షి యొంతయు బాలకన్నఁ
బలుచఁగా ననుఁదూరి పలుకఁగ నగునె,
యీయరణ్యమున నిన్నిరవొంద నిల్పి
పోయిన నపకీర్తిఁ బొందుదు నిజము;
కుసిమీర వెంట దోడ్కొని పోదు ననిన
పసదప్పి కార్యంబు పైకొనివచ్చు;
ముందఱ చఱి వెన్క పులి పొంచియున్న
చందమాయెను! నీదుసౌఖ్యంబు రమణి ;
కలఁగక నీవంటి కాంత యీబుద్ధి
దలఁచుట యిది యెల్ల దైవయోగంబు

వామాక్షీ చలపట్టి వదలవు మీఁద
నేమిగా నున్నదో యెఱుఁగంగ రాదు,
నినుఁ దూర నేమి నా నేరమె గాదె!
యన విని పాంచాలి యనిలజుఁ జూచి,
అమ్మక్క చెల్ల! యో యనిలతనూజ!
ఇమ్మెయి ననుఁ దూరి యేల పల్కెదవు?
ధర్మనందను కూర్మి తమ్ముండ వగుట
ధర్మశాస్త్రము లాడి తప్పరా దనుచు
మొరలు పెట్టుచు నుందు మొనసిన నెపుడు
విరులు గోరుట లవివేకమే నాథ!
భీముఁ డాడినమాట బె[illegible]కె నటన్న
భూమి విశేషంబు బొంకుట గాదు
పెక్కుగా నాసలు బెట్టుటకంటెఁ
గ్రక్కున లేదనఁ గలుగుపుణ్యంబు;
పట్టినప్రతిన నేపట్టున నైన
గట్టిగా వదలని ఘనధైర్యశక్తి
వరునకుఁ గాక పదునాల్గులోకముల
నొరులకు చెల్లునే యుర్వీతలేంద్ర!

అన విని చింతించి యనిలనందనుఁడు,
తనమదిలోఁ గొంత తడవు చింతించి,
చలపట్టి వదలదు. జలజాయతాక్షి
తొలఁగఁగూడదు బహుదుర్ఘటం బాయెఁ!
గొరగానిసంగతి గూడి నే నిట్లు
ఇరుకున జిక్కితి నే మనవచ్చుఁ!
గొనకొని తాఁజేసుకొన్నంత తానె
యనుభవింపకతీర దజునకునైన,
గురుతుగా మెడఁజుట్టి కొన్నట్టిపాము
గరువక విడుచునే కటకటా యింక!
కావలిగ్గాయె యింతి కడనుండ నెవరు?,
దేవప్రసూనము ల్దెచ్చువా రెవరు?
వనజాతములఁజూపు వార లెవ్వారు?
అనుచు వితర్కించు నాసమయమునను

## నారదాగమనము

శ్రీకాంతుచరితముల్ చెలగువేడుకల *

---

* శ్రీకాంతుచరితలంచితవైభవమున (2421, 4502)

ప్రాకటజంత్ర గాత్రములబాడుచును
జడలు దూగంగ బొజ్జనటింపుచుండ[1]
వడిగ రుద్రాక్షతావళము[2] లల్లాడ
కరకమండలనీరకణములు చింద
సరసిజాసనుసూతి చనుదెంచుటయును ;
గని వధూవరులు జక్కఁగ నెదురేఁగి
ఘనభక్తి మ్రొక్కి వేడ్కలను బూజించి,
వినుతులు గావించి వినయము ల్సేసి
జననాథసూనుఁ డాసంయమి కనియె
సురమునిరాజ భాసురరవితేజ

నారద భీముల సంభాషణము

పరమదయాస్వాంత పటుసత్యవంత
మునుపు సేవనమార్గమున వచ్చునపుడు
వనజాతపాణికి వర మిచ్చినాఁడ
నిందుబింబానన యిపు డిటువంటి

1 జడలు దూగెడ బొజ్జనటింపుచుండ (2421, 4502)
2 తావడము (2421, 4502)

పొందమ్మివిరిగోరి పొక్కుచున్నదియ
నివియున్న నెలవు లే నెంతయు నెఱుఁగ
వివరించి యొందైన వెదకెద ననిన
నిక్కడి కక్కడి కే నొక్కరుండ
నెక్కడ దెత్తునే హేమకంజములు
కడఁకతో నిచట నొక్కరుఁడు కాపున్న
గడియలోఁ దెచ్చెద కనకపద్మములు
అనఘాత్మ దీని కుపాయ మేమైన
ననువొందఁగా వేగ నానతిమ్మనిన
జలజసంభవసూతి జనపతిఁ జూచి
నలువొందఁ జిఱునవ్వు నవ్వి యి ట్లనియె
ధరణీశ మీ కసాధ్యము లైనపనులు
కరమర్థి సకలలోకములందుఁగలవె!
వనజాక్షి చెంత కావలి యుండునట్టి
ఘనునిఁ జెప్పెదను నాకర్ణింపు మిపుడు
సన్నుతాటోపుఁడు చండవిక్రముఁడు

**{ నారదుఁడు ఘటోత్కచుని నందునిచి కమలములఁ దెచ్చుటకుఁ బొమ్మనుట }**

వరబాహుబలుఁడు దుర్వారశౌర్యుండు
తరణితేజుఁడు ఘటోత్కచుఁడు నీతనయుఁ
డారాక్షసాధీశు నరయ నిం దునిచి
పోరాదె తేరాదె భూరిపద్మములు
కమలంబు లన నెంత లోకము లన నెంత
నిమిషమాత్రము పట్టునే నీవు దలఁప
ద్రౌపదీరమణి సంతతపుణ్యశాలి
యోపిక లేక దా నుసురుసు రనిన
నాపదల్ సంధిల్లు నవనీతలేశ
యీపువ్వుఁబోణికి హేమకంజములు
గొనివచ్చి మదిలోని కోర్కెలఁ దీర్చు
మనుజేంద్ర నీ వేఁగుమార్గంబునందు

**{ నారదుఁడు భీమునితో నతని కార్యము నందొకమహాత్ముఁడు సాయపడునని తెల్పుట }**

ననఘాత్ముఁ డొకఁడు నీకైనబంధువుఁడు
కనకకంజము లున్న క్రమముఁ దెల్పెడిని

మనమునఁ దగుననుమానము ల్మాని
చను మని దేవతా సంయమి గదలె
అంతట గంధవాహాత్మజుం డధిక 1245

ఘటోత్కచుండు భీమునికడకు వచ్చుట

సంతోషచిత్తుఁడై సతిని లాలించి
యమితలోకభయంకరాకారమూర్తి*

* అఖిలలోకభయంకరాకారమూర్తి
సుఖపుణ్యకీర్తి భాసురజయస్ఫూర్తి
కమనీయసకల రాక్షసచక్రవర్తి
సముదగ్రశత్రుసంచయసమవర్తి
బలశౌర్యధైర్యప్రభావప్రతాప
పటులోగ్రుఁడఖిలదిక్పాలకప్రిదశ
ప్రకటవిద్యాధరగరుడగంధర్వ
యక్షకిన్నరసిద్ధహారిదశ్చంద్ర
రాక్షసాధిపనవబ్రహ్మరుద్రాది
లోకచతుర్దశలోకానవరత
భీకరుఁఢగుహిడింబీనందనుండు (త)

సముదగ్రశత్రుసంచయసమవర్తి
ఘనబలోద్దండ విక్రమకళాస్ఫూర్తి
తనతనూభవు ఘటోత్కచుఁ దలంచుటయు
దలఁచినయంత నుద్దండప్రచండ
బలశౌర్యనిధి హిడింబానందనుండు
అట్టట్టు త్రిజగంబు లల్లలనాడ
బెట్టుగా ప్రస్థానభేరి వేయించి
గగనచుంబి ప్రచండ గండభేరుండ
ధగధగద్ధగితకేతనధాళధళ్య
నానాయుధోజ్జ్వలనవరత్నఖచిత
భూనుతదశచక్రభూరిషట్కోటి
మహనీయఘంటికామార్తాండసదృశ
బహుళకాంచనకుంభ భాసురప్రకట
పంచాననవ్యాఘ్రభల్లూకశరభ
సంచయభయదోగ్రచర్మసంకలిత
వితతమనోవేగవిధజవనాశ్వ
శతపరిభ్రాజితస్యందనం బెక్కి
యరదముల్ నలుబదియాఱుకోట్లమర

కరిఘట లోకకోటిఁ గడలుకొనంగ
హారులు లెక్కల కెక్కువై పిక్కటిల్లఁ
దరుచుగా బలువీరదానవు ల్గొలువ
తమకంబు బలము నుద్దండంబు చలము
గమకమై పెనఁగొన గడువడి నేఁగి.
తల్లిదండ్రులకు వందనములు చేసి
మెల్లమెల్లన లేచి మిక్కిలి పొగడి
వడముడి వదనంబు వలనొప్పఁ జూచి
కడుమోదమున ఘటోత్కచుఁ డిట్లు పలికె
పనియేమి మాయయ్య! పనియేమి దేవ!
పనియేమి భూపాల! పనియేమి స్వామి!
భోరున నాకొకబుద్ధి మన్నించు
చారణ గరుడ ఖేచరులఁ జెండుదునా!
హరిహయ వైశ్వానరాంతక నిరుతి
వరుణ వాయు కుబేర వామదేవాది
ఘనదిశాధీశుల కట్టల్కఁబట్టి
కొని వత్తునో! భూపకుంజరావళుల
కొట్టుదునో! భూతకోటులనెల్ల

పట్టుదునో! దైత్యపతుల నెంతయును
చట్టలు చీల్తునో సర్వాధినాథు.
ధట్టింతునో! చతుర్దశభువనముల
నట్టిట్టు చేతునో! యంబుధు లెల్ల
బెట్టుగా వింతునో! భీకరవార్ధి
కురుబలంబుల నెల్ల గూల్తునో! లేక
వరబల్మి పట్టి తేవలయునో! యింటకు
నని బల్కునందను నక్కునఁ జేర్చి
తనరు వేడుక వృకోదరుఁ డిట్టు లనియె

ద్రౌపదియొద్ద భీముఁడు ఘటోత్కచు నునిచి
సౌగంధికముల కరుగుట

ఓవీరశేఖర! యోదైత్యనాథ!
ఓవిశ్వభీకర! యోయికుమార!
వనవిహారమునకు వచ్చు నవ్వేళ
వనజలోచనకు నేవర మిచ్చినాఁడ
పోఁడిమి నిటువంటి భూరిపద్మములు
వేఁడుచు నున్నది వికచాబ్జవదన

ఆడినమాట లే దనిన పాపంబు
పాడి దప్పుట రాజపంతంబుగాదు.
నిన్నుఁ బంపగవచ్చు, నీచేత నౌను;
నన్ను వేడినది యీనాళీకపాణి
యిదిగాక రణమ్మున కరుగుటకంటె
నదనుమానము గాచు టది మిక్కుటంబు
నాపాటివాఁడవు, నాముద్దుపట్టి
వాసికెక్కిన ధైర్యవరశౌర్యనిధివి
అచ్చెరువడి మీర లందఱు బొగడ [1]
తెచ్చెద జాముకు దివ్యసూనములు
కనకాంబుజము గొని కలకంఠి దొడ్డ
జననాథుఁ డున్నయాస్థలమున కరుగు
మని దానవాధీశు నక్కునఁ జేర్చి
కనకాంగి నెంతయుఁ గౌఁగిట నలమి
పోయివచ్చెద నని భుజ మప్పళించి

1 ఇచ్చట నీవుండు మే నేఁగి వేగఁ
దెచ్చెద జాములో దివ్యసూనములు (శ).

వాయువేగంబున వాయుజుఁ డరిగె.
అనిలజుం డరిగిన నాఘటోత్కచుఁడు[1]
మొనసేయ కున్నను మోసం బటంచుఁ
దనబలంబుల నెల్లఁ దగ వేఱువేఱఁ
గొనఁగొని యష్టదిక్కుల బారు లేర్చి
నలుదిక్కులందు నెంతయు హెచ్చరికల
పొలుపొంద కోవురంబులు బెట్టి రమణి.
నొకపొదరింటిలో నుంచి తా నొక్క-
నికటదేశంబున నిలిచి కాపుండె
అంతట జాంచాలి ననిలజుఁ దలఁచి

ద్రౌపది సంతాపము

ఎంతయుఁ దల యూచి యిది చిత్ర మనుచు
మనమునఁ గడు ననుమానంబుఁ బొడమి.
తనలోనె తాను నెంతయుఁ జింత నొంది
జనపతి వల దని చాటి చెప్పినను

1. భీముఁ డేఁగిన హిడింబీనందనుండు
కేమరి యుండుట నిది మోస మనుచు (త).

విననైతి నే నింత పిఱికిఁడి నైతి
వనవిహారం బేల వచ్చితి! వచ్చి
కనకకంజము నేల కాంచితి! గాంచి.

పదరి నే నెందుకు పట్టినపట్టు
వదలక ననిచితి వాయునందనుని!
మించిన నామాట మీరంగ లేక
వెంచేసె నొంటిగా విపినభూములకు! *
కరమర్థి సౌగంధికము లున్న నెలవు.
లెఱుఁగునో యెఱుఁగడో యేకార్య మగునో!
ఆసకు సిగ్గులేదాయె! యయ్యయ్యో!
నా సరివారిలో నగుబాటు గలిగె
వెలయ పెద్దలబుద్ధి వినక నే వచ్చు
ఫలమెల్ల చేఁజేత ఫలియించె నిపుడు.

పతి నంపి యెంత పాపంబు గట్టుకొంటి!
మితిలేని యపకీర్తి మెడఁగట్టుకొంటి!

---

* హెచ్చగు నాకోర్కె మీరంగ లేక
విచ్చేసె నొంటిగా విపినభూములకు (త).

రాముని మాయాకురంగంబు బోనిపి
కామిని నెడబాపుకరణి నే నిపుడు
భూమీశు నెడబాపె భూరిపంకజము.
ఏమికార్యం బౌనో యిటుఁగరా దింక
తనరార ధర్మనందనుఁ డిది విన్న
ననుదూరు, నిందించు, నామీఁద నలుగు
నని విలపించు న య్యంభోజముఖిని
గనుఁగొని యాఘటోత్కచుఁ డిట్లు పలికె.
అమ్మ! నీ వీపని కడల నేమిటికి?
నెమ్మది నిదె వచ్చు నీప్రాణవిభుఁడు
ఆవీరశేఖరు నామహాబలుని
దేవదానవకోట్లు దృష్టింపఁగలరె!
అటుగాక వేరొకరైన నాబాణ
పటలంబుచేత నీపదములకడకు
నరలోక సురలోక నాకలోకములఁ
దిరముగ నిప్పుడె తెప్పింతుఁ జూడు
గొనకొని యిటువంటికొడుకు గల్గఁగను
వినవమ్మ నీ కేల విచారపు భయంబు.

అన విని పాంచాలి యసురేశుమోము
గనుఁగొని గద్గదకంఠయై పలికె
మాయన్న! దైతేయమండలాధీశ!
మీయయ్య నెరయోధ మిక్కిలి నీవు
విలుకాండ్ర మేటివి వీరశేఖరుఁడ
వలఘుతరోగ్రమాయాప్రవీణుఁడవు
అసహాయశూరుండ వని యెఱుంగుదును
పొసఁగ నీశౌర్య మిప్పుడు గానవచ్చె
నేకాకియై భీముఁ డేఁగు నవ్వేళ
ప్రాకట చతురంగబలములఁ గూడి.
నిచ్చట నీ వుండు టిది ధర్మ మగునె!
హెచ్చైన రథికుల నిటఁగాపుఁ బెట్టి
చనరాదె నీవు నీజనకుని వెంట!
చేనవరి వగుచు నిచ్చటను నీ వున్న
దనుజవీరులనైనఁ దగ్గ నంపవలదె!
వనవీథియందు నెవ్వారు లేనిచోట
దిద్ది మీసము దువ్వి దిగ్గన లేచి

గద్దించితే నేమి కార్యసాధనము! *
అక్కడ వడముడి యహితులచేత
చిక్కి నొచ్చిన నేమి సేయఁగవచ్చు.
నటుమీఁద నీదుసాహసము నీబాణ
పటలంబు నీభుజాబలము మాకేల!
పొలసినపిమ్మట బోయి మీయయ్య
కొలదీర్చిరా మది గోరితివేమొ!
అని పల్కి విని విన్నయై తలవాంచి.
కనకాంగితో ఘటోత్కచుఁ డిట్లు పలికె
నాతల్లి! యింత చింత గలంగనేల?
వాతాత్మజుం డాహవమునఁ జిక్కినను
పగలు చుక్కలురాలు పద్మబాంధవుఁడు
తొగలరాయఁడు తప్పుత్రోవ నేఁగుదురు.
పొగలు లోకాలోకములు బెగ్గడిల్లు
గగనోర్వ్యలల్లాడు కమలజాండములు
పటపటపగులు సప్తపయోధు లింకు

* గద్దించినను నేమి కార్యసాధకము (త)

వటపత్త్రశయన శర్వ బ్రహ్మలకును
వరుస నెమ్మనముల వణఁకు వాటిల్లు.
నరపతిమాత్రుఁడే ననుగన్నతండ్రి!
గతి దప్పి వేఱొక కార్యమానేని
సుతు నన్నుఁ జుల్కఁగాఁ జూడంగ వలదు
బ్రహ్మాండభాండముల్ పగులఁగొట్టుదును
బ్రహ్మరుద్రాదుల బంధించి వైతు.
వాలాయమునను నవనిధానములును
గాలింతు సకలలోకములు భేదింతు
కడి గొందు గులమహాగ్రావసంఘముల
మడియించెదను గ్రహమండలినెల్ల
భూవరు దెత్తు మద్భుజశక్తి నీవు.
భావించి చూడుము పాంచాలతనయ!
నన్ను నాబల్మి నెంతయు నెఱుంగకను
కన్నతల్లివి గాన కారు లాడితివి
జనని యిందుల కేమి సంతోష మారె
విను మింక నొకనీతి విన్నవించెదను.
ననఁబోణి యిచ్చట నను నిల్పి చనిరె

జనపతి యుంచు నచ్చట నుండ కేను
యతని యానతి మీఱి యరిగితినేని
యతివరో! స్వామి భృత్యన్యాయ మగునె? [1]
మాయయ్య యసహాయమహితశౌర్యుండు.
మాయయ్య యత్యంతమానధనుండు
దేవప్రసూనము ల్దెచ్చి యిమ్మనుచు
నావీరు నొక్కని యడిగితి వీవు
యతఁడు దాఁ దెచ్చెద నని మమ్ము నెల్ల
చతురోక్తి మెరసి యిచ్చట నిల్పి చనియె
నాతని కేసహాయంబుఁ బంచినను
నాతండ్రికిని ప్రతిజ్ఞాభంగ మౌను[2]

1 యితరమా స్వామి భృత్యన్యాయ మగునె (ట).

2 అమరేంద్రు గొట్టెద నగ్నిఁ బట్టెదను
శమను మట్టెదను పుణ్యజనుని మొట్టెదను
వరుణుని తెంచెద వాయు నొంచెదను
నరవాహనుని మహానటు నశించెదను
వాలాయమున సప్తవరనిధానములు

వచ్చును నీమనోవల్లభుఁ డిపుడె
తెచ్చు నీచెంతకు దేవసూనములు 1425
అనుమాన మిక మాను మవ్విన పాంచాలి
దనుజవీరునిఁ జూచి తలయూచి పలికె

గాలింతు సకలలోకములఁ జరింతు
కడిగొందు కులమహాగ్రాహసంఘములు
మడియింతు గ్రహతారమండలి నెల్ల
భూవరుదేవి సమ్మదమున నీవె
భావించి చూడుము పాంచాలితనయ
నన్ను నాఖ్యాతి నెంతయుం నెఱుంగకను
కన్నతల్లివిగాన కారులాడితివి
జనని యిందుల కేమి సంతోషమాయె
విను మింక నొకరీతి విన్నవించెదను
ననుఁ జేరఁ బిలచి యెంతయు గారవించి
కనికరంబున గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి
తనయ భద్రం బని తడయక నేఁగె
యదిగాక నికనొక్క యనుమాన మెదవె
నదియుఁ జెల్పెద విను నంభోజవదన (త).

అన్న సంగరశూర హాసుకుమార
చిన్నన్న నా కిన్ని చెప్ప నేమిటికి
అపజయశకునంబు లయ్యెడి నిపుడు
విపరీతములు పుట్టె వినువీథియందు
మది తల్లడము నొందె మక్కువ దొలఁగె
నిదె చూడు మెడమక న్నీగగొట్టెడిని
వాపతి నాదాత నాపట్టుఁగొమ్మ
నా పెన్నిధానంబు నాప్రాణవిభుఁడు
నాకూర్పుచెలికాఁడు నాకొంగుపసిఁడి
నాకోర్కెచెల్లించు నాకూర్మిమగఁడు
భీముఁడు రిపురాజభీముఁడు సుగుణ
ధాముఁడు పటుబలోద్దాముఁడు ఘనుఁడు
ఆయుధహీనుఁడై యడలుచు సర్వ
కాయమంతయు నంపగమి గాడి వెడలి
పచ్చిగాయంబుల బహుళరక్తములు
విచ్చలవిడిఁ బార వెక్కసపడుచు
పొదరుచు నడరుచు బొబ్బరించుచును
నెదుట నిల్చినలీల లెసఁగెడి నిపుడు

అని యని వగచి హా యని విలపించు
ననఁబోణి గాంచి దానవనాథుఁ డనియె
వెరవకు మాతల్లి! వెరవకుమమ్మ!
వెరపు నీ కేటికి వికచాబ్జవదన!
రవిదూరదృష్టి దూరశ్రవణములు
మహితమాయోపాయమర్మకర్మములు
వరుస ననాగతవర్తమానములు
కరతలామలకముల్ కలకంఠి నాకు
న న్నెఱుంగక యుండ ననుఁగన్నతండ్రి
కిన్ని బాధకములు ఏటికి వచ్చు?
నపజయశమనంబు లయినవి యెల్ల
చపలాక్షి మనకు విజయ మని తలఁపు

ఘటోత్కచుని సాంత్వనము

ఇంతుల కెడమక న్నీగ మొత్తినను
నెంతయు శుభమగు నిందుబింబాస్య
కొత్తగాయంబులఁ గుందుచు విభుఁడు[1]

---

1 కొత్తగాయములలోఁ గొతుకుచు విభుఁడు
హత్తి చిల్చినయట్టు లయినది వినుము

హత్తి నిల్చిన యట్టులైనది వినుము
కలితమౌ సౌగంధికప్రసూనములు
వెలది వేగమె దెచ్చి వేడ్క నీ కిచ్చు
నమ్ము నావచనముల్ నాళీకపాణి
సమ్మతి నొందుము చలియింపవలదు
పతికి నెంతయు మనోజయము గల్గినను
పతికి నంతటిబాహుబలశక్తి గలదు
తిర మొంద నీదుపాతివ్రత్యమహిమ
పరమదీర్ఘాయువు పాండుసూనులకు

---

యదువంశకలిత శ్రీరాబ్ధిచంద్రుండు
పరమదయాళుండు భక్తవత్సలుఁడు
కరిరాజవరదుండు కపటనాటకుఁడు
భవరోగవైద్యుఁ డాపద్బాంధవుండు
రవికోటితేజుఁ డార్తశరణ్యమూర్తి
మన్మథజనకుండు మదవిభేదనుఁడు
చిన్మయుం డాదిలక్ష్మీనాయకుండు
కరుణతో మన్నపాల గలుగు నన్నాళ్లు
సరసిజాసన యపజయ మేల కల్గు (త).

నని యెక్కురథముపై యబ్జాక్షి నునిచి
కనకపంకేజంబు గైకొని వేగ
వలనొప్పు బదరికావనమార్గమునను
బలములతోడ నిబ్బరమునఁ జనియె

### సూర్యాస్తమయవర్ణనము

తను ప్రయోగింప నుద్దండత వెడలి
దనుజవీరులనెల్లఁ దగఁ దునుమాడి
ఘనరక్తయుక్తమై గ్రక్కున మరలి[1]
చనువున పశ్చిమజలరాశి యనెడి
చెలువంపు టొరలోనఁ జేరు కంజాక్షు
సలలితంబగుదివ్యచక్రమనంగ
నరయ మహానటుం డనువీరముష్టి
దురుసునఁ బరువల్లు ద్రొక్కునవ్వేళ
నలరుచు సమయకంజాక్షువాయించు*

---

1 ఘనతరరత్నసంకలితమై మరలి (త)

* ప్రతిలేని నాభుజాబలశక్తిపొందు
సుతులకు వజ్రాంగి జోడుమృగాక్షి

పలుమఱు నిటువంటిపనులకై నీవు
వలవదు విలపింప వనజాతపాణి
యని కోటిచండమార్తాండసంకాశ
ఘనతరమాణిక్యఖచితసంకలిత
తనదివ్యమకుటంబు ధవళాక్షిపాద
వనజాతములు సోఁక వరభయభక్తిఁ
బ్రణమిల్లి లేచినఁ బటుబలాధిపుని
రణరంగవిజయుని రాక్షసాధిపుని
కనుఁగొని పాంచాలి కచవిజితాళి
యనుమోంద దీవించి యతని కిట్లనియె
దనుజేంద్ర నినువంటితనయుండు డుండఁగను
మనసులో నా కనుమాన మేటికిని
యదుకులస్వామి కటాక్షంబు గలుగ
పదపడి మరికొంతభయము నాకేల
పంకజంబులకు నే పతి నంపినట్టి
యపకీర్తి దరిగె నెంతయుగాని?
విపరీతములకు నే వెరుపలేదన్న
యని పల్కి తనమదియడలు వారించి
కనకాంగినిశ్చలగతి యున్నయంత
తను ప్రయోగింప నుద్దండత వెడలి (త)

చెలువైనబంగారు జేగంట యనఁగ
వినుతారుణప్రభావితతవైఖరులఁ
దనరు పంకజబాంధవుఁ డస్తమించెఁ
గరిమతో ఫణిరాజకన్యకల్వేగ
గుఱుతైన బుఱ్ఱట క్రోవులు బూని
పరపైన యస్తాద్రిపై నెక్కి నిక్కి
సురకామినులమీఁద చూడ్కులు నిలిపి
నెయ్యముల్ మనమున నివ్వటిల్లంగ
నురగకన్యలమీఁద నొగి జలరేగి
కరమర్థి దేవతాకమలలోచనలు
మురియుచు రతనంపు మొరిటెల ముంచి
గురుతుగా నించినకుంకుమో యనఁగ
సడలక దట్టమై సాంధ్యరాగంబు
పడమటిదిక్కెల్ల ప్రభవించి మించె
వెడవిల్తుఁ డెంతయు వేట్క రంజిల్ల
వడి పాంథులౌ సురవర్గంబుమీఁద
విలసిల్లు రసదాళి విల్లెక్కువెట్టి
తొలఁగక నేసిన తుది మిన్నుదాకె

మొనలు జిక్కఁకయున్న మొల్లబాణంబు
లనఁ బొల్చె తారక లాకాశవీథి
రమణీయగిరిగహ్వరంబులు వెడలి
గమకమై చనుభల్లుకంబు లనంగ
గరుడవాహనుమీఁదఁ గదుదండు వెడలి
పరతెంచు రాక్షసబలము లనంగ[1]
ననిలునిఁ దార్కొన నధిక వేగమున
కనలుచు చను ఘనాఘనము లనంగ
తనర నెల్లడల తానయ్యె నిండి?
కనుపించు హరిదేవకాంతు లనంగ
భూనభోభాగముల్ పూర్ణమై కవిసి[2]
కానఁగానఁగ మించె కటికిచీఁకటులు

చంద్రోదయవర్ణనము

ఆసమయంబున యామినీరమణి
భాసిల్లు హరిపదపద్మావధూటి

---

1 అలఘుపంకజభవాండకరండభూరి
కలితబంధురదివ్యకస్తూరి యనఁగ (తే)

2 భూనభోభాగసంపూర్ణమై కవిసి (తే)

కరుదు మీఱఁగ మంగళార్తులు పెట్టి
పరఁగ నెత్తిన వెండిపళ్లెర మనఁగ
కలితమౌ పదియారుకళలఁ జెన్నొంది
తొలిదిక్కు ననుదోఁచె తుహినకరుండు
అలరుచు చందురుం డనుమాంత్రికుండు
మలయుచు దిశ లన్ని మంత్రించి కట్టి
తగ నంధకారభూతంబుల దరిమి
పొగడొందఁ జల్లు విభూతి యనంగ
పొసఁగ నభోలక్ష్మి భూకాంతమీఁద
గసటుదీరగ నించు కర్పూర మనఁగ
మునుల నెల్లను దేవమునులఁ గావించి
వనధు లెల్లను క్షీరవారిధుల్ జేసి
భూజాతములఁ గల్పభూజముల్ సేసి
రాజవర్యుల బలరాములఁ జేసి
నదుల నెల్లను దేవనదులు గావించి
వదలక సతులవా గ్వనితలఁ జేసి
యలరుపక్షుల రాజహంసలఁ జేసి
కలమృగంబులను సింగములఁ గావించి

కడిమి విద్యలఁజూపుగారుడసాని[1]
వడువున చంద్రికావైఖరు ల్వెలసె[2]

---

1 (1) కడిమి విద్యలు జూపుఁ గారడిగాని (క)
(2) కడిమి విద్యల చూపుగారడసాని (ట)
(3) కడిమివిద్యలు జూపుగారుడవాని (త)

2 వరుస నారదమునివరులెల్ల నవ్వ
శరనిధులటుసుధాజలరాశిగెరల
తరుచైన యఖిలభూతములు సహింప
లరిధరాజములు కల్పకము నెగ్గింప
కరమర్థి నదులు గంగను నెరిగింప
తరుణులెల్లను శారదను జుల్క సేయ
ఖగములు హంసల గదుముచు దిరుగ
మృగములు సింగంబుమీఁద దండెత్త
కమలాక్షి కమలాంక కమలసంభవులు
మమతతో సతులనేమరకుండఁ జేయ
కడు దానియా మహాగారడసాని
వడువున చంద్రికావైఖరుల్ వెలసె

### మలయమారుతవర్ణనము

మలయాద్రి చెంత నెమ్మది నుద్భవించి
పొలుపొందు మల్లెపూఁబొత్తుల బొరలి
యొనరు పూఁదేనియ యుగ్గున బెరిగి
పనుపడ నునుమంచు బాల నీడేరి
వరుస నానాసూనవాసన లాని
శరజాకరముల ముచ్చట నోలలాడి[1]
కపురంపుఁదిన్నెలఁ గడువినోదించి
విపులమౌ చందనవృక్షంబు లెక్కి
యొగి కల్పలతలతో నుయ్యాల లూగి
జిగిమించు తేటితేజీ నెక్కి నిక్కి[2]
పంచధారాగతు లుపన్యసింపుచును
నంచల నంచల నటు దువాళించి
చెలఁగుచు నాకవీథి చేవాగెసడలి
తొలఁగనీక కుదించి దుమికించుకొనుచు

1 సరసులయందు ముచ్చట నోలలాడి
2 జిగిమించు లేడి తేజీనెక్కి నిక్కి

వలనొప్ప మేటిరేవంతునిలీల[1]
మలయుచుఁ జనుదెంచె మలయానిలుండు.
అంతకుమున్నె యయ్యనిలనందనుఁడు
సంతోషచిత్తుఁడై చన చన నెదుట
పాఠీనకర్కట బహుజలగ్రాహ

## కళానదీవర్ణనము

కాఠీన కర్పర కమఠాళిఘోర
హారిభేక భేకీ మహాధుళీఘోర
కరిభీమ తిమితిమింగిలారావ
కోలాహలంబునై కొమ రొందుదాని
హాళిదరు ల్మించి యరుదెంచుదాని

1 యంతట నంతట నాగి నిల్చుచును
పొంతట చొపుటంబులు త్రేడెములును
నంచల నంచల నటు దువాళించి
చెలఁగుచు నొక వీథి చేవాగె నడలి
తొలఁగక కికురించి మమికించుకొనుచు
వలనొప్ప మేటికే వంతునిలీల (ఠ)

వలగొనియున్న శైవాలజాలంబు
లలితమౌ వేణీవిలాసంబు గాఁగ
పొలుపొందు వికసితపుండరీకంబు
కలితమౌ వదనవికాసంబు గాఁగ
కలికి నిగ్గుల నల్లకలువలసిరులు
తళుకులు గుల్కు నేత్రంబులు గాఁగ
వలనొప్ప రంజిల్లు వలమురిగరిమ
కళల రాజిల్లెడు కంఠంబు గాఁగ
నలువొందు మృదుల మృణాలవైఖరులు
బలురమ్యమై యొప్పు బాహువుల్ గాఁగ
నరుదుగా వికసించు నరుణాంబుజములు
గరిమశోభిల్లెడు కరములు గాఁగ
కరమొప్పు నలరు పంకజకోరకములు
సరసంపుబిగి వాడిచన్నులు గాఁగ
నందమై మెలగెడి యావర్తసరణి
పొందుగా నలరారు పొక్కిలి గాఁగ
నారూఢసలిలవేదండతుండములు
తోరంపు మెరుగు పెందొడలును గాఁగ

నంచితం బగుచున్న యాంకచ్ఛపములు
మించులు దుళికించు మీఁగాళ్లు గాఁగ
నలరుచు వెలయు ముక్తాబ్జపత్రములు
పలుచని కోమలపదములు గాఁగ

ననయంబు విహరించుహంససంగతులు
ననువుమీరిన మందయానంబు గాఁగ
పవనవిధూతపుష్పపరాగమహిమ
రవణమౌ చిత్రాంబరంబులు గాఁగ
పరఁగు కళానదీప్రాంతంబుఁ జేరి

వెరవున సంధ్యాదివిధు లాచరించి
పంతంబు నుదుట నిబ్బరము నగ్గలము
నంతకు నంతకు నధికంబు గాఁగ[1]

---

1 అంతకు మున్నె యయ్యనిలనందనుఁడు
కొంతద వ్వరుదెంచి కొల నటు గాంచి
స్నానంబు గావించి సంధ్యాదివిధులు
భూనుతంబుగ సల్పిఁ బోరున కదలి
పంతంబు నుదుట నిబ్బరము నగ్గలము

భీముని ప్రయాణము; ఆతఁడు శంఖమును బూరించుట.

మలయుచు చనుచున్న మార్గంబునందు
పులులతోఁ గలఁబట్టి పులులను మోఁది
కరితుండములఁ బూని కరులను జదిపి
హరివాలము లమర్చి హరుల మర్దించి
శరభసంఘంబుల చక్కాఁగావించి
కరకరి బలుపన్నగంబుల మోఁది
ననువొందఁగా నట్టహాసంబు చేసి
ఘనశైలజాలము ల్గంతులుగొనుచు
పొసఁగ మహానదు ల్పొంగి లంఘించి
మసలక గహనము ల్కరి చౌకళించి
తనపాదయుగళంబు తాకినతరుల
కనగ నిట్టటు చోఁప కట్టుగాఁ బడఁగ
చరణఘాతల గండశైలముల్ పెకలి
కరమర్థి యెగసి యాకాశంబు గప్ప

---

నంత కంతకు భూతి యధికమై మించి
తనధైర్యలక్ష్మి యెంతయుఁ దోడునడువ

వరవేగసంఘాతవాతజాలములు
సొరిగి జంతువులెల్ల సుడిగొని తిరుగ
యలవైనతేయుని యనువు కై న్కొంది
ఎలమి మహోద్ధతి నేఁగుచు నుండి
గరుడకిన్నరయక్షగణము భేదిల్ల
గిరులెల్ల నురుల మిక్కిలి దిక్కు లవియ
ధారుణి గంపింపఁ దరువులు పెకల
భోరున శంఖంబుఁ బూరించుటయును
పిడుగుమ్రోఁతలఁబోలు బెడిదంపురవము

ఆంజనేయుఁ డాశంఖారావమును విని లేచుట

కడువడి విని లేచి కపినాయకుండు
వడముడి శంఖారవం బిది యనుచు
తడయక యంత నుదగ్రతఁ జూచి[1]
యతఁడు వచ్చినకార్య మంతయు నెఱిఁగి
అతనిభుజాబలం బతనిశౌర్యంబు
దెలిసి పద్మము లున్న తెఱఁగెల్లఁ జెప్ప

---

1 తడయక కొంతయుఁ దా విచారించి (ప)

వలయు నటంచు జవంబున లేచి
మను జేశుఁ డేతెంచుమార్గంబునందు
నొనర కన్నులు మూసి యోగి నోరు దెరచి
పలుమఱు నఱచుచు బయలు బ్రాకుచును
తలవడ కింపుచు దగ్గుచు నిలిచి[1]
పలువిడి రోజుచుఁ బడియుండె నచట

1 అతిరయంబున జను నాభిమనేను
గలియొల్ల మున్నె తా గన్నట్టె తెలిసి
యంతరంగంబున నాంజనేయుండు
గొంత చింతించి వేగురుమదికోతి
తనువు గైకొనివచ్చి తగమ్రానికింద
నొనర కన్నులుమూసి నొగి నోరు దెరచి
తెరువుకడ్డముబడి తెలివి లేనటుల
కరచరణాదులు కదలింపలేక
నుసు రుసు రనెడి నిట్టూర్పులతోడ
బుసపెట్టుచును బోరుగొండచందమున
మూల్గుచు బలుమూచు ముడుగుకుఁ బొరలి
నీల్గుచు వదరుచు నెరయ నున్నంత. (త)

అలఘుబలోద్దండుఁ డాంజనేయుండు
ఆపాండుసుతుఁ డడ్డమాఁగయు లేక[1]

భీముఁడు హనుమంతునిఁ జూచుట

నేపున జనుదేర నెలమి గట్టెదుర
నడలుచు వణకుచు నరచుచు నిట్లు
బడియున్న వనచరు భావించి చూచి
కరుణాకటాక్షమాఘునునిపై నునిచి
పారిపారి మేనెల్ల పుణికి చూచుచును 1630
వెరవకు మని చీరి వెన్ను చే జరచి
యిరుమైల నడలించి యిట్లని పలికె[2]

భీమహనుమంతుల సంవాదము

అనఘాత్మ! నీ వెవ్వరయ్య! యిచ్చోట
కనుమూసి పడియున్న కారణం బేమి

1 (a) ఆపాండుసుతు డడ్డ మాగెయుం లేక (ప)
(b) ఆపాండుసుతు డడ్డమాజ్ఞయుం లేక (త)
2 (a) యిరవొంద నదలించి యిట్లని పలికె (క)
(b) యిరువందఁగా హెచ్చరించి యిట్లనియె (త)

మేదినీరుహాచర్య! మిక్కిలి నీకు
ఈదైన్య మీభయం బెటువలెఁ గల్గె?
అదిగాక శతవృద్ధవైతి పీ వింక
కొదువ వస్తువు లేమికోరెద విపుడు
పనిఁబూని నేవచ్చి పయనంబు మాని
గొనకొని నిను గనుంగొనినది మొదలు
మాయన్న నీమీఁద మమత పుట్టెడిని[1]
యీయున్న విధము నీవింతయుఁ దెలుపు
మని సారె సారెకు యదలించి పిలువ
వినియును నొక్కింత విననిచందమునఁ
గనియును లేశంబు గననిమార్గమున
తనుదానె ప్రక్కలు తలగిరికొనుచు
విప్పుగా రెప్పలు విప్పించి నవ్వి
తప్పి వ్రాలినబొమ ల్దాల్మి నిక్కించి
పెదవులు నట్టిట్టు బెట్టుగాఁ జెదరి
పదరిచిందులుద్రొక్కి పండ్లూగులాడ

1 మాయన్న నీమీద మర్లుబుట్టెడిని (ప; ట.)

నలసత చేఁ జూచి యలుకుచు కీఁచు[1]
పలుకుల నిట్లనుపాండునందనుని
నీ వెవ్వరో యయ్య నీకుఁ బే రేమి?
యేవస్తువులకు నీ వేఁగుదెంచితివి?
గరిమెతో నీమోము గనుఁగొన్న యపుడె
సొరిది నాతమ్ముని జూచిన ట్లాయె;
నింతింత యని మది నెన్నంగరాని
సంతోష మందితి జనపాలచంద్ర!
బడలి కెల్లను దీరె భయములు దారె
నడలు దైన్యము మాసె నాఁకలి పాసె
తత్తరంబు దొలంగె తాల్మి చెలంగె
చిత్తంబు జిగురించె చెలువంబు మించె
తపమెల్ల ఫలియించె ధన్యుండనైతి
నృపచంద్ర! దైవంబు నినుఁ జూపె మాకు
మేదినీవల్లభ మీస్వరూపంబు
నాదిగర్భేశ్వరునట్లు గన్పించె

1 కీలు, పలుకుల నిట్లను (ట. త.)

వలనొప్పఁగా చక్రవర్తిచిహ్నములు
తొలఁగక నీయందు దోఁచుచున్నవియు
నిన్నియుఁ గల్గి నీ వెవ్వరు లేక
ని న్నగపంక్తుల నీయరణ్యముల
జడియక యీనిశీసమయంబునందు
కడు నొంటిగాఁ జన కారణం బేమి?
నీరాజసంబును నినుఁ జూడ లేక
యీరీతి బనుపువా రెవ్వరు నిన్ను[1]
మనుజాధినాయక మముబోంట్లకైన
నిను గనుఁగొన్నను నెనరు బట్టెడిని
తెలియంగ నిది దొడ్డదేవతాభూమి
మలసి చూచిన నీవు మానవరూపు
చండపంచానన శరభశార్దూల
గండభేరుండము ల్గల వెల్లయెడల;

---

1 నిత్తరి యొకప్తా ర విన్నవిందను
చిత్తావధానివై చెవియొగ్గి వినుము
... ... ... ... ...
ధారుణి నిర్దయుదాక్షిణ్యు లగుచు (తె)

నదిగాక యక్షవిద్యాధరామరులు
కాదకక నినుఁ గన్నఁ గొట్టి చంపెదరు;
చనవల దోయన్న చన దనరాదు
ఘనుఁడవు నీచేతఁ గానిది లేదు
నీవు వచ్చినపని నిక్కంబు పలుకు
నావిధం బెఱిఁగింతు నరనాథ యనిన
తనజనకునిపేరు తనయన్న పేరు
తనపేరు తనసహోదరుల పేరులును
వినయమార్గంబున వేర్వేరఁ దెలిపి
వనితయుఁ దానును వనికి వచ్చుటయు
కనకకంజము గాంచి కాంత వేడుటయు
వనువొందఁ దెచ్చెద నని పల్కి చనుట
పూసగ్రుచ్చినయట్లు పొసఁగఁ దెల్పుటయు
వేసాలవానరవీరుఁ డి ట్లనియె
ధరణీశ; పాండునందనులకుఁగాక
నొరులకుఁ దరమె యి ట్లొంటిగా నేగ
జననాథ మా కతిసంతోషమాయె
కనకాబ్జములఁజూడఁ గరపెద వెనుక

పసుపడ నే నిందు బడియున్న తెఱఁగు
వినుపింతు విన వన్న విశదంబుగాను[1]

నీవిధంబునను నే నిబిడాటవులకు
కావరంబున నొంటిగాఁ జనుదెంచి
మినుకైనఫలములు నొక్కుచు వేడ్క
వనమెల్ల వెదకుచు వచ్చి యామ్రాను
పరికించి యిందొక్కఫలము వీక్షించి

యరుదైన ఫల మూట యాస వాటిల్లి
యరుగక యీతరు వెక్కఁగా బోయి
పరబల్మి చెడిపోయి వ్రాలి యున్నాడ
ముదిమి పైకొని నేత్రములు చూపు దరిగె
పదపడి యీపండు పడినభక్షింతు

ననిన శతాబ్దంబు లయ్యె నీవరకు
మనుజేశ యీమహామాయాఫలంబు
పడినది లేదాయె ఫలమ్ముపై నాస

---

1 పదరుచు నే నిందుఁబడియున్న తెఱఁగు
విదితంబుగా నేను విన్నవించెదను (ట; ప)

విడిచిపోయెదనన్న వెసకాళ్లు రావు
కోరుచుండఁగఁ బిచ్చుగుంటపై ఘనము
జారుభాగీరథిఁ జనుదెంచు లీల[1]
వచ్చితి వీవు నావయసు నిన్నడుగ
వచ్చంబులేని సత్వంబు నిన్నడుగ
మానవాధీశ! యొక్కటే పందు
యీమ్రాన నున్నది యీతీంపు మయ్య
అనఘాత్మ! పాండవు లార్తరక్షకులు
ననుచుఁ బల్కఁగ విని యడిగెద నిన్ను
యీపందు సాధించి యిచ్చితివేని
యేపనులైన నయ్యెడిని నీచేత

1 (a) కోరుచుండఁగ పిచ్చుగుంటుయంగమున
చారుభాగీరథి చనుదెంచులీల
తలఁప శక్యముగాని దారిద్ర్యకును
నలువొంద పెన్నిధానం బబ్బినటుల
నిచ్చలో నాడబోయినతీర్థ మెదురు
వచ్చి నిల్చినమాట్కి వచ్చితి నీవు (క
(b) కోరుచుండగ పిచ్చుకుంటపై వేగ. (ఙ

ధీరత నాకోర్కె దీర్చకయున్న
నీరజంబులఁ దేను నీకు శక్యంబె!
అంటక ముట్టక నామహాఫలము
గెంటించి నను బ్రోచి కీర్తి వహించు
తమకించి వేవేగ తరు వెక్క వలదు
విమలాత్మ ననువాలె వృద్ధ వయ్యెదవు
ఆఁకలి దీర్చిన యాపుణ్యనిధిని
శ్రీకాంతున కైన నేయంగవచ్చు;
నని సన్నుతించిన నయ్యగచరాధిపుని
కనుఁగొని యర్జునాగ్రజుఁ డిట్లు పలికె
ఇది యెంత పని వానరేంద్ర! యీమాయ
గదలించి ఫల మిత్తు ఘనశక్తి మెరసి
మెప్పుగాఁ బలుపులు మ్రింగువానికిని
యప్పళా లననెంత యని విజృంభించి
విల్లెక్కువెట్టి యవ్వీరశేఖరుఁడు
భల్ల మొక్కటిఁ బూని పండు నేయుటయు
నది బీకువోయిన నైదంబకములు
గదియించి వేసిన కడల కేఁగుటయు

పదియు నిరువది ముప్పది నారసములు
పొదివి యేసిన తప్పిపోవుటఁ జూచి
విరివిగా నూరులు వేలు లక్షలును
గురుతరాస్త్రము లేయ గురి తాఁకకున్న
పోలించి కోటు లర్బుదములు మేటి
వాలమ్ము లేసిన వ్యర్థమై చనిన
నచ్చెరువును గోప మధికమై వెలయ*
విచ్చలవిడి పండు వీక్షించి చూచి
ఆయెడ పొదినున్న యమ్ము లన్నియును
పోయిన బాండుభూభుజసూనుఁ డలిగి
కరవాల మంకించి గర్జించి వేయ
బెర బెర చని యది బెళికిపోవుటయు
తరలక కరముల ధనువు సంధించి

---

1 నూరు నిన్నూరు మున్నూరు నన్నూరు
ఘోరాశుగము లేయ గురి దాకకున్న
వేలు లక్షలు కోట్లు వెస నర్బుదములు
వాలంబు లేసిన వ్యర్థమై చనిన
నచ్చెరువును గోప మధికమై చెలఁగ. (త)

చరణంబు లూఁది భూస్థలము ధట్టించి
కనలి మింటను గొట్టి గమకించి వ్రేయ
మునుపటిపాడవున మురియుచు నుండ
నెంతయు వెరగంది యిది చిత్ర మనుచుఁ
చింతించు నరనాథశేఖరుఁ గాంచి
యార్ణవగంభీరుఁ డాంజనేయుండు
కర్ణకఠోరంబుగాఁగ ని ట్లనియెఁ;
నొకపందుకోసమై యూరక నీవు
ప్రకటించి పడరానిపాట్లెల్లఁ బడితి
వటదుర్ఘటంబైన హాటకాబ్జంబు
లెటువలెఁ దెచ్చెదో యెఱుఁగంగరాదు!
ఆతతఘోరాబ్ధి ము న్నాడినయట్లు*
చేతఁ జూపిన వీరశేఖరుఁ డండ్రు
కడప దాఁటగ లేవు కడువడి మీరి
జడధులెల్లను దాఁటి చనఁ దలంచెదవు!
తెగి కూటిలో రాయి తీయగా నోప

* 1 అతీతఘోరాబ్ధి ము న్నాడినమాట. (ట)
2 ఆతతఘోరాబ్ధి ము న్నాడినయంత. (వ)

వెగయుచు సంగడా లెత్తబోయెదవు![1]
దగదొట్టి మేనెల్ల దల్లడమొంది
సొగపణంగెను మోము సొబగెల్లఁ దరిగె[2]
పొంగు నొయ్యారంబు పొంగెల్ల నుడిగె 1777
పొగడ నొప్పెడుబాణములు మాయ మాయె
మగతనం బెడలె జృంభణము దొలంగె
నగుబాటు బ్రతుకాయె నరనాథ యింక
యూకించి యూకించి యసు రుసు రనఁగ
నీ కేల యీపను ల్నీ చేతఁ గాదు 1780
అచ్చుంపు మగలచే నగునట్టిపనులు
? పిచ్చుగుం బెక్కడ! పేరెంబు లెందు!
కూడుగూరలు పెద్దకుంభముల్ మ్రింగి
వాడియతా తోడేలివలె డొక్కఁ బెంచి

---

1 (a) తెగి కూటిలో రాయి తీయఁగా లేవు
ఎగరుచు జంగరా కెత్తబూనెదవు. (మ)
(b) తెగి కూటిలో రాయి తీయఁగా నోప
వెగయుచు జంగరా కెత్తబూనెదవు. (త)

2 సుగు లడంగెను మోము సొబగెల్లఁ దరిగె. (ట)

మేన కండలు బెంచి మించి మదించి
పూనిక గడిపోతు పోల్కి నుండఁగను
నిన్ను నే నెరనమ్మి నెమ్మితో వేఁడు
కొన్నది నావల్ల కొదువ లెంతైన*
ఎనుపోతు గాంచి మత్తేభం బటంచు
ననువొందఁగా భృంగమాశించినట్లు
వాసికెక్కిన మగవాఁడవే యనుచు
ఆసింప నాశ నిరాశఁ జేసితివి
పంద నీ దేయూరు! పద్మ మేయూరు!
ఇందేల వచ్చితి వేఁగు వేవేగ!
అన విని కోపించి యాపాండుసుతుఁడు
వనచరాధీశ్వరువదనంబుఁ గాంచి
నినుఁ జూడు, ననుఁ జూడు నీ వెంతవాఁడ
వనరానిమాట లి ట్లాడ నేమిటికి?
నాపేరు చెప్పిన నను గనుంగొనిన
నేపారలోకంబు నిట్టటుగావె

* కొన్నగి నావల్ల కొదువ లెంకయును. (త)

పండన నెంత! నీపని యన నెంత!
ఖండింతు దండింతు గదగొని యిపుడె
అడరంగ నాయుపాయంబు లన్నియును
నుడిగియు, నోరేల యుడుగకపోయె!
చెలరేఁగి యీకోతి చేష్టలు సేయ
నలుక పుట్టదె యెంత యోర్పరికైన
నవలక్షణపుకోతివై బంగి మ్రింగి
శివ మెత్తి వెంట వృశ్చికము సంధించి
పెనుబాము బంధించి పిడికిళ్లఁ జిక్క
యనలంబు ద్రొక్కి దయ్యము లూదినపుడు
ఏగుణంబులచేత నెసఁగుచు నుండు
నాగుణంబులు గానవచ్చె నీయందు
వానరాధీశ! నీవంశ మిట్టిదియ;
యేనాట యెదురు దన్నెఱుఁగక నీవు
కొసవెట్టి బలుగొంటె కూబ ఝుంకెనలు*
వసుధపై మీస్వభావంబులెగావె!
కలనైన మిమ్ములఁ గనుఁగొన్న హాని

---

* కొసవెట్టి బలుగొంటె గోల ఝుంకెనలు. (త)

పాలుపొంద నటువంటిపుణ్యులు మీరు
మదమత్తుఁడవు నీవు మర్కటాధముఁడ!
ఇదిగో యల్పస్నేహ మింతకు వచ్చె!
పొగరుకూతల గూసి పొంగితి విపుడు!
తెగి నిన్ను మోదిన దిక్కెవ్వ రిందు?
వానరుఁడై యుంట వార్ధక్య మౌట
నానాతరులయాకు నములి యాపసరు
తలకెక్కి యుండుట తడవడి నుంచి
యలసి నిరాహారివై యుంట నిన్ను
యెగ్గు లెన్నగ చెల్ల దిక నొక్కఁడైన
నుగ్గునూచంబుగా నులిమిపోవైతు;
నావిని పాండునందనుని వీక్షించి
యావానరాధీశుఁ డనియె నెంతయును;
ఓరి మానవ! యింత యుద్దండ మేల?
యూరక యిటుపడి యున్నా నటంచుఁ
గొనకొని యిటువంటికూతలు గూయఁ
జనునేర ! నావంటి సాహసాంకునకు
ముదిమి వాటిల నొంత మోసంబువచ్చె?

తుదిమొద లెఱుఁగక తూలనాడెదవు!
మునుపు నే నీప్రాయమునఁ జేసినట్టి
పనులెల్ల శ్రీరామచంద్రుఁడే యెఱుఁగు;
నలవడ నాదిత్యు నైన మ్రింగుదును
నలఘుశక్తిపయోధు లైన దాఁటుదును
పెనుమహీజము లైన పెల్లగించుదును
ననువంద బలుగిరు లైన నెత్తుదును
ఈసున నిపు డైన నేమి యింకొక్క
దాసరితోపాటు తలపడగలను
అచ్చుగాముకు పచ్చలారవు బిరుదు*
పిచ్చుకతోఁ సరి బెనఁగఁ జూచెదవు
చెనకఁగూడనివారి చెనకి యావెనుక
తినుక నేటికి లేనిధీమసం బేల
మగఁటిమి గలిగిన మగవాఁడ వైన
తెగువతో నాపండు దెచ్చి నాకిమ్ము;
గరిమ నీపని చేత గాకుండెనేని

---

* 1 అచ్చుగాముకు పచ్చలారవు పనులు. (ట)
2 అచ్చుకతో శేరి నదలించవచ్చు. (మ)

దోరవలె వచ్చిన త్రోవనే జనుము;
అనిన నత్యుగ్రుఁడై యాపాండురాజ
తనయుఁ డిట్లనిపల్కెఁ దరుచరేశ్వరుని
వనచరాధమ! ముదివాఁడవై యున్న
ఘన మెఱుంగక పెక్కుకారు లాడెదవు
ముందె వానరుఁడవు, ముదిమికిఁ దోడు
కుందేటివెఱ్ఱి నెక్కొనె మేలు మేలు!
ములుచవానరపేదముండకోపంబు
తిలకింప పెదవులతీటమాత్రంబె*
పాటించి నోటికి బగిసికిఁ దగిన[1]
మాటలాడెద వెంత మడియఁడ వీవు[2]
వరుసఁగూర్చుండి లేవగ లేవు గాని

---

* దీనికితర్వాత నొకప్రతిలో నీపంక్తులుకలవు.
కడుబలశౌర్యముల్ గలవు నీయందు
వెడగ నీమోముఁ జూడఁగఁగానవచ్చు.

1 పాటించి నోటికి బరిపాటిదగిన (త)

2 మాటలాడవు యొంత మడియవు నీవు.(వ)

పరువడి వేరము ల్బార బోయెదవు
విదిత మెఱుంగవు వెఱ్ఱిమర్కటము
వదరిన పండ్లూడవైచెద నిపుడు
నీ వనఁగా నెంత! నీ పని యెంత!
దేవేంద్రముఖ్యుల తృణముగాఁ జూతు
పొలుపొందఁగా నిన్నుఁ బుట్టించినట్టి
యలికలోచనునైన నదలించగలను
బిక్క పగ్గెల నింక ప్రేలితివేని
చిక్కించుకొని సిగ్గు చెరచక విడువ
తిరమొంద నన్ను ప్రార్థించి వేడినను
నెరయ నాఫల మిత్తు నీయాశదీర్తు
నరసురయక్ష కిన్నరసిద్ధసాధ్య
వరు లడ్డమై యున్న వనజము ద్రెత్తు
ననుఁ జూడు మని సింహనాదంబు చేసి
తనరు దక్షిణభుజాదండంబునందు
మలసి మేదోమాంసమస్తిష్కరక్త
కలితమై చెలువొందు గద ధరియించి
పరువడి సూటిగా పండు వీక్షించి

వరబాహుశక్తిచే వడిగ వైచుటయు;
అది మహారయమున నటు బరతెంచి
పరువడి ఫలము నిబ్బరముగ దావి
బెదరక బంగారు చెండుకై వడిని
గదతోడ నెగసి యాకాశమార్గమున
నటియిఁపుచను యోజనం బరుదెంచి
యటుబోకనిటురాక నంతట నిలిచి
భానువై ఖరినిస్వర్భానునిలీల
భూనుత ప్రభలచేఁ బొలుపొందుచున్న
ఫలవిలాసమును నా ప్రతిభ వీక్షించి
పలుమరు చింతించి ప్రౌఢి చాలించి
మదిలోన డోలాయమానుఁడై యంత
యిది యేమి మాయయొ! యీభూమితీరొ ![1]
తెలియరా దని తనదెసఁ జూచుచున్న
బలశాలిఁ గనుగొని పలికె వానరుఁడు
ఓహోహా! యీగద నుంచి నీచండ

---

1 ఇది భూవిశేషంబో ! యీశోతిమహిమొ ! (త)

బాహుబలంబు నీబగిసెల్ల దెలిసె
కూతలు బెట్టుగా గూసినవాని
చేతగా దనుమాట సిద్ధంబుగాదె
జగతిలో వింతగా జలజసంభవుఁడు
మగపుట్టుఁ బుట్టించె మాయన్న! నిన్ను
పాలుమాలిన యట్టిపాపపుబుట్టు
వేల బుట్టఁగవలె నీలోకమునను
జననాథ సకలదేశములఁ గాంచితిని
నినువంటిపందల నే నెందుఁ జూడ!
నీలావు నీబిగి నీయొడ్డుపొడుగు
భావింపఁ గన్నులపండు వయ్యెడిని!
ఓరి! నీ కేమాయె! నొరపైనపెద్ద
బూరుగవృక్షంబుఁ బోలి యున్నావు!
నిన్నుఁ జూచిన నిల్వ నీరు పండెడిని
అన్న నీసాహసం బంతయుఁ దెలిసె[1]

1 పలుమరు నీ భుజాబలిమిఁ గనుఁగొన్న
వలనొంద నాకును నవ్వుపుట్టెడిని. (త)

పోలుపుమీరిన మేకపోతుగంభీర
ములు సాగ వికనిందు మూర్ఖ మానవుఁడ!
వెఱ్ఱిచూపులు చూచి వెస పండ్లుగోరికి
వెఱ్ఱికూతలు గూయ వెరవ నే నింక[1]
ముదిమిచేఁ గన్నులు మూసుకయున్న
నదరక యెంతలే దని చూచి నన్ను
కోతి కోతి యటంచు కోదువ లెన్నెదవు
కోతు లేమైనను గొంచెమా నీకు
వననిధి లంఘించి వరశక్తి మెరసి[2]

---

1 బిఱ్ఱులేశములేక భీదభావమున
వెఱ్ఱిచూపులు చూచి వెసపండ్లుగోరికి. (త)

2 వననిధి లంఘించి వరశక్తిమించి
దనుజేశుపురి గాల్చి దైత్యుల గూల్చి
రావణు జంపించి రహికీర్తి మించి
యా విభీషణుని లంకాధిపు జేసి
యినకులస్వామికి యింతినిగూర్చి
పనుపడ రాఘవు పట్టంబుగట్టి
ఘనులెన్న రామభూకాంతుడు మెచ్చ. (త)

దనుజేంద్రపురి గాల్చి దైత్యుని గూల్చి
ఘనులెన్న రామభూకాంతుఁడు మెచ్చ
గొనబుమించినవారు కోతులుగారె
యాకాలమునను నే నాంజనేయుండు
ఏకశరీరమై యొలమి నుండుదుము
మడియడ నీకేల మమువంటివారి
గొడవ లిట్లొనరిన కొట్టి చంపెదరు
తగనిమాటఁ నన్నుఁ దడవితివేని[1]
సుగుల నొంచక మాన చూడు నాచెయ్యి[2]
కొదువలువచ్చిన కూతలు మాని

---

1 చెప్పగ లట్టెల్ల చెప్పితి నింక
తప్పు నాయెడల నింతయుం లేదు లేదు
తలలేని తెరబంటు తనముగల్గినను
సొలువక నొకచెయ్యి చూడు నామీఁద
నదిగాద టంటివే యష్టమ మానవుఁడ
గదమీది మోహముల్ గదలించి కదలు. (త)

2 (a) సుగు లడంచక మానఁ జూడు నాచెయ్యి. (ట)
(b) సుగు లడగించెదఁ జూడు నాచెయ్యి. (ఘ)

గదమీఁది మోహముల్ గదలించి కదలు
అన విని వనచరాధ్యక్షుని మోము
గనుఁగొని వడముడి కను లెఱ్ఱచేసి
మర్కటాధమ! యిన్ని మాయలు పన్ని
మాఱొకని యొంతేని మాటలాడెదవు
ముదికోఁతి వనియున్న మోసంబువచ్చె[1]
నిదియెల్ల నీమర్మ మిప్పుడు దెలిసె
పరుషంబు లిట్లాడి బకహిడింబాది
నరభోజనులు గూలినారు నాచేత
దనుజుఁడ వేమొ! గంధర్వుఁడ వేమొ!
వనచరాధమ! చావవలదు నాచేత
ఆరసి నీబాము లన్నియుఁ జూచి
యీరూపుతో నిల్పి యిచ్చోటనుండి
యనుమాంద మాయన్న యాంజనేయుండు
వనధిలంఘించిన వైఖరిదోఁప
దాఁటిన నొకజంగ ద్దాఁటనా నిన్ను
మీటిన మిన్నంట మీఁద నా వ్రేల

1 ముదికోఁతి యనియున్న మోసంబువచ్చె. (ట)

వాలంబుతోఁబట్టి వరణముల్ద్రిప్పి[1]
నేలలోఁ గొట్టినా ని న్నీక్షణంబు
నిముషంబులోపల నీతను వెల్లఁ
దుమురుగాఁ జేతును దుర్మార్గ! యనిన
తరుచరాధ్యక్షుండు ధరణీశు మోము
పరికించి యిట్లను బకపక నగుచు
పాండునందన నీప్రభావంబు బలిమి
పండువల్లనె గానబడినది గాదె!
నిన్ను జూచితిగాని నీసాహసంబు
లెన్ను చుండెడివారి నెవ్వరి నెఱుఁగ
చలమున నిశ్శంక సాహసు లిట్లు
పలుకరు నినువంటి పందలుగాని
తెల్లమిగలనరుల్ తిన్నగా బారు
పిల్లవంకలు మొరల్బెట్టుచు దుముకు
నను దాటఁజాలవు నను మీటలేవు
ఘనశక్తి వాలంబు గదలింపఁగలవె.
యీనీచవాక్యంబు లేల నారోమ

---

1 వాలంబుతోఁబట్టి వడిగ నిన్నుఁద్రిప్పి.

మైనను దెరలింప నలవియే నీకు?
దడయక వాముహస్తముఁ బట్టెదను
విడిపించుకొని పారి వెళ్లఁగాఁ గలవె
బలిమి నీకెక్కడ ప్రజ్ఞ లేయూరు
చేలపదం బిచ్చోట సాగదు నిలువు
మనిన పాండుతనూజుఁ డాగ్రహ మొంది
ఘనగిరుల ద్రువశంఖంబు పూరించి
అట్టహాసము చేసి హస్తద్వయమున
గట్టిగా వాలంబు కబళించిపట్టి
ఊదుటున వడి ద్రిప్ప నుంకించుటయును;
గదలకయున్న నాగ్రహమున గెరలి
పదము లూనఁగఁ ద్రొక్కి పవనంబుబట్టి
యదలించి యెత్తుచో నప్పు డింతైన
మెదలకుండుట గాంచి మెయిబెంచి నిగుడి
గుదికొన్న కినుకతోఁ గుదియుంచి యలమి
విలయాంతకునిలీల వెస నార్చి పేర్చి
చలమున నుబికిన చలియింపకున్న
మొనసి నానామార్గములఁ జూచి యలసి

తనమదిలోఁ గొంతతడవు చింతించి
ఘన మిది సాధ్యంబుగా దని యెంచి
యనఘాత్ము డేయుపాయము లేక బెగడి
పలుమరు దశదిశల్ పరికించుచున్న
నలువెల్ల దెలిసి వానరనాథుఁ డనియె
జగదీశ! యిఁకనైన చాలింపరాదె!
దగ దొట్టి దగిలించి తడబడ నేల[1]
వరబాహుబలిమి నావాలదండంబు
దరలింప లేవు పద్మములు దేఁ గలవె!*
నిను నీవు తెలియవు నీచేతఁ గాని
పనులకు వత్తువే ఘనులకు నిటకు[2]
పొలుపొంద పవమానపుత్త్రుండ వనుచుఁ
దలఁతురు నిన్ను భూతలమునవెల్ల
కలమాట నిజమైనఁ గరువలిపట్టి

---

1 (a) దగదొట్టి దగలించి తడబడనేల (ట)
(b) తగదిటు గదలింపఁ వడఁబడ నేల. ప్రాతఅచ్చుప్రతి

* ఒరలింపఁగలవె యోభూనాథచంద్ర (ట)

2 పనుపున వత్తురే పనులకు నిటకు (ట)

చెలిమినైనను నిల్వ చెల్లదే యకట!
అమ్ము లన్నియుఁ బోయె! నాగద బోయె!
కమ్మదమ్ముల కెట్లు గదలెద వింక!
తోఁచక నీచేయుదుడుకు లన్నియును
గాచి రక్షించితి గరుణతో నిపుడు
పగ్గెలబొదలక పదరక లేని[1]
సిగ్గులబడక వచ్చిన త్రోవచనుము
ప్రాణము ల్గలిగిన భార్యలు గలరు
బాణముల్ గాంచిన పద్మముల్ గలవు
భూవర! 'యీవెఱ్ఱిబుద్ధులు మాని
పోవోయి నీవు నీపాందుపంట్లకును;
అన విని కడువిన్ననై తలవాంచి
మనుజ వల్లభుఁడు నెమ్మది చింత నొంది
తలకక ఘోరకాంతారభూములకు
నెలత దోడ్కొని చన నీతిగా దనుచు
చీరి వేమరు బుద్ధిచెప్పిన వినక

1 ప్రగ్గెలబొదలక బెదరకలేని (క)

వారిజాక్షుని దోడ్క వచ్చుట గాదువ;
వేడు మిచ్చెద నని వేడిన పిదప
పోడిమి నీ కున్న బొందు పాపములు;
వనజము ల్గానిపోక వనిత యున్నెడకు
జనిన నపఖ్యాతి; సకియ దుఃఖించుఁ;
బాయని యపకీర్తి భరమున కోర్చి
పోయెద ననినను బోనీయఁ డితఁడు;
సకలాయుధంబులు చనుటయు మోస
మకట! యీతఁడుచేసె నాబాణహాని;
యితని జంపుదు లేక నితనిచేఁ జత్తు
నితరంబు లే దని యెంచి క్రోధించి
తలప లోకములోన ధర్మనందనుఁడు
వల నొప్పగా సత్యవంతుఁ డౌనేని
గోపాలకృష్ణుండు గోరినయపుడె
మాపాలగల్గి యేమరకుండునేని;
యనయంబు వేడ్కతో నంజనకూర్మి
తనయుఁడు నామీఁద దయ గలఁడేని;
పసిడిబంగరుబోలు పాంచాలపుత్త్రి

వసుధలోపల పతివ్రత యగునేని;
నెగడు వేదంబులు నిక్క మౌనేని;
జగతిలో ధర్మమే జయమగునేని;
యీవానరునితోడ నీమాయ లెల్ల
వావిరి దెగటార్చి వరసాధనములు
గైకొని చని హేమకంజము దెచ్చి
రాకేందువదనకు రహి నిత్తు ననుచు
బాసగ గర్జిలి భుజంబులు బెట్టు సరచి
వెస బేర్చి యొకసాలవృక్షంబు బెరికి
తనమీఁద నడతెంచు ధాత్రీతలేంద్రు

ఆంజనేయుఁడు నిజరూపమును దాల్చుట

యనువెల్ల బరికించి యాంజనేయుండు
యనుపమామోఘవాక్యము దప్ప దనుచు
ఘనమైనవృద్ధమర్కటరూప ముడిగి
నెనరున నెంతయు నిజరూపు దాల్చి
యనుజాని మ్రోల ప్రత్యక్షమై నిలిచె[1]

1 ఎన్నడు గలన నన్నెదిరి పోరాడి
యున్నవారల గాన నుర్వీతలమున

నన విని జనమేజయావనీశ్వరుఁడు
మునినాథుఁ గాంచి కేల్మోగిచి యిట్లనియె
నినతేజ మౌనీంద్ర యీచరిత్రంబు
విన విన మదిలోన వేడ్క పుట్టెడిని 2030
తరుచరాధిపుఁడు ప్రత్యక్షమైయున్నఁ
దరువాత కథలెల్లఁ దగఁ జెప్పు మనిన
జనమేజయునకు వైశంపాయనుండు

నగచరుం డన నెంచ నగునె యీఘనుని
నగధేనుండో పన్నగభూషణుఁడో
గజరాజవరదుండో గంధవాహనుఁడో
గజబిజియయ్యె మర్కటశక్తి గాదు
కలకబుట్టగ పానకములోని పుడుక
వలె నడ్డమై నిలిచె వనచరాధిపుఁడు
సొలువక దేవతారాజసూనంబు
లిలలోన మనుజుల కేల సిద్ధించు
నన్న మాటలు మీరి యతివబోధనలు
విన్నఫలం బెల్ల నేగ ఫలించె, ...
హనుమంతు లిడపళి యనవరశంబు
ధనదార నామీద దయగలదేని. (త), ...

వినుపింపఁదొడఁగె తద్వృత్తాంత మెలమి
అని యనంతాకన్యకాధీశుపాద[1]
వనజాత నిరతసేవారతుపేర[2]
భావజహితచంద్ర బలదైత్యఖచర
దేవభూరుహాసుర ధేనుధనాధి
పతి మేఘసాదోధిపద్మాప్తపుత్త్ర
వితరణుపేర కోవిద నుతుపేర
శతమఖపాటీర శారదాహీర
శతధృతినందన శారదాహీర*(?)
గగనకల్లోలినీ కౌముదీశిశిర
నగరాజమృగరాజ నవ్యధావళ్య

---

1 (a) అని యనంతర కాళికాధీశ్వరాంఘ్రి. (చ)
(b) అని యనంతట కన్యకాధీశ్వరాంఘ్రి
(c) అనియె నంతకు కన్యకాధీశు పాద (క)
2 (a) వనజాత నిరతు సేవారతుపేర (ట)
(b) వనజాప్తసిరతసేవాధీశుపేర
*1 శతధృతినందనా శంకరాహేంద్ర (ట)
2 శతధృతినందనా శారదాహేంద్ర (క)
3 శతమఖేధవటీరశర్వాణి పేర

తరకీర్తిపేర మేధానిధిపేర
సరసకళాపూర్ణచంద్రునిపేర
సుకవిపోషణుపేర శుభమూర్తిపేర
సకలపురాణార్థసంగ్రాహుపేర
నాదసీసదుర్గహారణునిపేర
చేదిభూవరదత్తసింహతలాట
కరహాటనృపదత్తకనకపతాక
బిరుదాంకుపేర గంభీరాబ్ధిపేర
కరనొప్ప జగనొప్ప గండనిపేర
శతనృపాలకశైలశతకోటిపేర
కఠినచౌరాసి దుర్గవిభాళుపేర[1]

---

1 విలసిల్లు శ్రీరాయ వేశ్యాభుజంగ
కులసంభవుండు సద్గుణపుణ్యశాలి
వలనొప్పకేళాది వైభవసాంద్ర
సలలితౌదార్యుండు సంగ్రామభీముఁ
డగు సజ్జనాధారుఁ డార్యపోషకుఁడు
అగణిత ధారేయుఁ డర్థిమందారు
శత నృపాలకశైల శతకోటిపేర

మానితభాషణాంబామనఃపద్మ[1]
భానునిపేర వైభవజిష్ణుపేర
రావిళ్లకొండధరామరులింగ
భూవల్లభునిపేర బుధులౌ ననంగ
నంకితంబుగ నుపమాది ప్రోల్లసద
లంకార బహువిధలక్షణఫణితి
తనరు వేడుకలరత్నాకరకృష్ణ
ఘనునిగోపాలసత్కవిశేఖరుండు
సరసోక్తి రచియించె సౌగంధికాప
హరణకావ్యంబునం దాపాండుసుతులు
వలనొప్ప బదరికావనముఁ జేరుటయు
నలరు ద్రౌపది దోడ్త ననిలనందనుఁడు
వనభూమి కరుగుట వనజంబు గనుట[2]

---

ప్రతిభగల్గినయట్టి ప్రావీణ్యుపేర
కఠినచౌరాసిదుర్గవిభాళుపేర
చటులవిక్రమ పుణ్యశాలియు పేర .(ట)

1 మానితభాస్కరాంబామనఃపద్మ

2 వనభూమియందుల వసియించి చనుట

ననబోణి యడుగుట నారదమౌని
వేవేగ వచ్చుట వికచాబ్జముఖికి
కావలి యాఘటోత్కచుని తెల్పుటయు
ననిలతనూభవుం డలరుచుఁ గూర్మి
తనయుఁ దలంచుట తడయక నతఁడు
వచ్చుట పాంచాలివద్ద నాథుని
మచ్చికతో నుంచి మసలక వేగ
నెంతయు నేఁగుట నింతి దాఁ గొంత
జింత సేయుట పట్టి చింత బాపుటయు
నలమార్గముననుండి యాంజనేయుండు
బలుమాయ గల్పించి భ్రమల దూలించి
వలసి యన్యోన్యవివాదము ల్చేసి
చెలువంబుతో భీమసేనునిమ్రోల
నలవడ ప్రత్యక్ష మైనట్టి కథల
నలరుచు నిది ప్రథమాశ్వాస మయ్యె.

ప్రథమాశ్వాసము సరిపూర్ణము.

---

తనయుఁండు వచ్చుట దగుసంభ్రమమున (ట)

# ద్వితీయాశ్వాసము

---

అవధరింపు నృపాల యవ్వాలికథలు
పవమానతనయుండు ప్రత్యక్షమగుచు
నిలిచినఁ గనుఁగొని నృపకుమారుండు
సలలితానందాశ్రుచయములు దొరుగ
కరయుగంబున నున్న ఘనసాలభూజ
మురువడి ధరణిపై నొగి బారవైచి
భయభక్తి వినయసంభ్రమచిత్తుఁ డగుచు
రయమునఁ బ్రణమిల్లి రహిఁ గేలు మొగిచి

### భీముఁడు హనుమంతుని విశ్వరూపమును జూడఁగోరుట.

జయదయాపాథోధి! జయపుణ్యమూర్తి!
జయజయ దశదిశాసాంద్రసత్కీర్తి
జయదీనపోషణ! జయసత్కృపాంగ!
జయజయ శ్రీరామ! చరణాబ్జభృంగ!

జయజితదైతేయ! సన్మునిగేయ!
జయభక్తఫలదాయ! జయయాంజనేయ!
యపరాధి నపరాధి నమితదోషకుఁడ
కపటచిత్తుఁడ నన్నుఁ గాచి రక్షింపు
మని సన్నుతులు సేయ నాపాండుసుతుని
కనికరంబున గ్రుచ్చి కౌఁగిట చేర్చి
మోదంబుతో జెక్కు ముద్దు ఘటించి
యాదరింపుచు నున్ననగ్రజునకును
దోరంపువేడ్కలు దుదిఁ బొందులాడ[1]
నేరుపుతో మ్రొక్కి నిలిచి యిట్లనియె
వనచరకులచంద్ర! వరదయాసాంద్ర!
మునిదేవ నుతకీర్తి! మోహనమూర్తి!
శ్రీరామపాదరాజీవంబు లర్థిఁ
జేరి సేవింపుచుఁ జెలఁగుచు నున్న
యానాటి ఘనతావకాకారమహిమ
లేను చూడఁగఁ గోరి యేప్రొద్దు నుందు

(a) తోరంపువేడ్కలు దుది బొమ్మలాడ (క)
(b) తోరబపువేడ్కచేఁ దుదిఁ బొమలాడ (చ)

నాచంద మాయంద మాదివ్యమూర్తిఁ
జూచెదఁ గరుణింపు సుజనమందార
యని వేడుకొన్నట్టి యాపాండురాజ
తనయుని లాలించి తరుచరేశ్వరుఁడు
ఆకాలమున నున్న యట్టిరూపంబు
నీకాలమునఁ జూప నెట్లగు నన్న?
బెక్కుమార్గంబుల భిన్నంబు లగుచు
నొక్కవిధంబున నుండవు నిలిచి;
తిరమొందఁగా గృతత్రేతాయుగములు
గరిమతో ద్వాపరకలియుగంబులును
వెలయు నసంఖ్యలై వేర్వేర నుండు;
నలచరాచరకోటు లాప్రకారములు
భిన్నమార్గంబులై పృథివి వర్తిలును;
నున్నతోన్నతములై యొనరుచు నుండు
ననిన నాయుగముల నాచారవిధుల
ఘనవర్తనలు దెల్పఁగా దగు ననిన
కురుకుమారునిమీఁద గూర్మి నెకొల్పి
తరుచరాధీశుండు దగ నిట్లు పలికె

### హనుమంతుఁడు చెప్పిన యుగధర్మములు

పొలుపొందు గృతయుగంబున నాల్గుపాద
ముల ధర్మ మలరుచు భూమండలమున
వర్తిల్లు వరరుక్మవర్ణుఁ డచ్యుతుఁడు
కర్తయై బ్రాహ్మణక్షత్రవిట్కులము
లట యేకవేదక్రియాయోగ్యు లగుచు
పటుపుణ్యలోకసంపదలఁ బొందుదురు
మరియుఁ గామక్రోధమదమత్సరముల
మరగరు రోగదుర్మరణముల్ లేవు;
ధర్మజానుజుఁడ త్రేతాయుగమ్మునను
ధర్మంబు మూఁడుపాదముల వర్తిల్లు;
ఇట్టుగా స్ఫుటరక్తవర్ణుఁడై విష్ణు
భట్టారకుం డుండి ప్రజల రక్షించుఁ;
బొదలుచు జనులు తపోదానసత్య
విదితయోగంబుల వెలయుదు రందు
ద్వాపరంబున ద్విపాదముల ధర్మంబు
చూపట్టుచుండు నచ్యుతుఁ డుండు బీత
వర్ణుఁడై జనుల నుర్వరఁ బ్రోచుచుండు

వర్ణాశ్రమంబుల వర్తన ల్గలిగి
స్థిరవేదశాస్త్రచోదితములు నగుచు
ధరసర్వకర్మముల్ ధర్మముల్ బరగు;
వెలయు గామాదు లావేశించి యుండు;
కల సత్యనీతిమార్గంబులు దఱుఁగు
ప్రోదిగా కలియుగంబున ధర్మ మేక
పాదంబున మెలంగు పటుగృష్ణవర్ణుఁ
డగుచు విష్ణుఁడు బ్రోచు నవనీతలంబు
నొగి జను ల్బహుళతమోయుక్తులై యెపుడు
కామాదిదోషసంగతులై యధర్మ
భీరుకర్మముల ఆంపిల్లు చుండుదురు[1]
పొలుపొందునట్టి తపోదానమహిమ
లిల బహుఫలములై యొసగుచు నుండు
నని యుగభేదంబు లన్నియుఁ దెల్పి
యనువొంద దీవించి యరుగు మిం కనిన
యనుమోదమున మ్రొక్కి యభినుతుల్చేసి
వనచరేంద్రునకు భూవరుఁ డిట్లు బలికె

1 భీమకర ముల మొరపెట్టుచుండుదురు (చ)

### హనుమంతుఁడు విశ్వరూపము జూపుట.

ఆనాఁటి మీరూప మారసి కాని
పో నన నంజనీపుత్త్రుఁ డవ్వేళ
నపరిమితం బైన యాకారరేఖ
నిపుణత మెఱయ నానృపతికిఁ జూపె
గగనంబుఁ గబళించు కనకాద్రి వోలె
తగిన గాత్రము దిగంతము లెల్లఁ గప్పి
యలమిన వాలయుతాకార మరసి
కలఁగి విస్మయమంది కనుదోయి మొగిచి[1]
చింతించి యాభీమసేనుఁ డెంతయును
మంతు కెక్కిన హనుమంతుని కనియె
అతిభీషణం బది యత్యద్భుతంబు
వితతంబు నగుచు పృథ్వీగగనంబు
లలమియున్నది నీమహాకారరేఖ
సొలయక కనువిచ్చి చూడఁగా నోప
జాలింపుఁ డనిన నాసహజన్ముపల్కు

1 కలవియస్మయమంది కనుదోయి మూసి (1378)

లాలించి మునుపటి యాకృతి నిలచి
మనుజేంద్ర! రక్కసుల్ మూర్కొన్నవేళ
నినుమడి ముమ్మడి నేఁబెంతు నేను
ఎప్పటి నిజరూప మిపుడు జూపితిని
తప్పక చూడుము ధరణీశ యనిన
విని కాంచి భీముఁడు విస్మయమంది
హనుమంతునకు మ్రొక్కి హస్తము ల్మోగిచి
కనుగొంటి దేవ మీకమనీయమూర్తి
నిటువంటిబలశౌర్యనిధి గల్గియుండ
నల రాఘవుఁడు రావణాది రాక్షసులఁ
గెలుచుట చోద్యమే కేసరితనయ!
అరయక పలుమాట లాడితి మిమ్ము
కరుణించి నను బ్రోవఁగాఁదగు ననిన
మన్ననతో హనుమంతుఁ డిట్లనియె
నన్ను నీ వాడిన నయమింత లేక
నిన్ను నేనాడిన నేరము ల్గలవె!
అన్నదమ్ములపట్ల నరమర లేల?
జననాథ కన్నులు చల్లఁగా నిన్ను

గనుఁగొనఁగలిగె నాకాంక్ష లీడేరె
అహికేతనునిఁగూర్చి హస్తినాపురము
విహితంబుగా నిత్తు వేడ్కతో విను
మక్కువ నీవిందు మలయుచునుండు
గ్రక్కున సౌగంధికములు నేదెత్తు
ననిన సంతోషించి యంజనీకూర్మి
తనయుని పాండునందనుఁడు వీక్షించి
కపినాథ మీకటాక్షంబున మేమె
యపరాధి యగు కౌరవాధీశుఁ దునిమి
ధర్మనందనుచేత ధారుణి యెల్ల
నర్మిలి యేలింతు మనఘచారిత్ర
తరలక నరునికేతనమున నిల్చి
సొరిది మాబలశక్తి చూతురుగాని
గరిమతోఁ గాంచనకమలము లున్న
తెఱఁగు లామార్గము దెలుపవే యనిన[1]

---

1 a. తెఱగును మార్గము దెలుపవే యనిన (క)
b. తెఱగుల మర్మము దెలుపుడీ యనిన (1378)
c తెరగుల మర్మంబు దెలుపుడీ యనిన (చ)

## హనుమంతుఁడు సౌగంధికము లున్న నెలవు చెప్పుట

మనుజేంద్ర కనకపద్మము లున్న నెలవు
లానరఁ దెల్పెద విను ముత్తరంబునను
రజతాచలప్రాంతరమ్య దేశమున
రజతకాంచననవరత్న సంఖచిత
సాలగోపురధామ సౌధజాలములు
లాలితాగణ్యకల్యాణసంపదలు
నవనిధానంబులు నవ్యభాగ్యములు
వివరింపఁగారాని వివిధవస్తువులు
సార్వభౌమునిసాటి సామజేంద్రములు
ఖర్వమహాఖర్వఘుటసమూహములు
పరికింప పుష్పకప్రతిమానమైన
సరస నానామణిస్యందనావళులు
వలనొప్పు నుచ్చైశ్రవముఁ గేల్వాజాలు
కలిత శంఖాసంఖ్య కంఖాణచయము
శతధృతికైన నెంచఁగరానియట్టి
యతిశౌర్యధనులు యతూదినాయకులు

గలిగి సర్వంసహాకామినీనుదుటం
బొలుపొందు పాపటబొట్టొయనంగ
నగభేదిపుటభేదనంబునకన్న
నగణితంబై పొల్చునలకాపురంబు
ఆపట్టణంబున కధిపతిశౌర్య
దీపితాటోపుండు దినరాజతేజుం
డమితధీరోదారుం డరిభయంకరుండు
సమర నిశ్శంకప్రచండప్రతాపుం
డతిబలశాలి ధనాధినాయకుండు
ప్రతిభచే సకలదిక్పతులలోనెల్ల
తతకీర్తి గాంచి యంతకు మంతు కెక్కి
శితికంధరుని చెల్మి చేయుచు నుండు;
నతని యధీనమై యఖిలమహీజ
వితతుల ననయంబు విలసిల్లుచున్న
వనమధ్యమున నొక్కవనజాకరంబు
ఘనకళాతేజోవికాసమై వెలయుం;
గొమరొందునట్టి యాకొలనిలోపలను
కమనీయసౌగంధికమ్ములు గలవు;

పొసఁగ నాకొలనికిఁ బూర్వభాగమున
నసమానబలశౌర్యు లగునట్టి యక్ష
బలము ముక్కోటి నల్వదివేలు గొలువ
చలముతోఁ గావలి జాంబీరుఁ డుండు
కనుగల్గి యారులక్షల పదివేలు
దనుజవీరులతోడ దక్షిణంబునను
గంటికి రెప్పగాఁ గాపాడినటుల
నంటి కావలియుండు హాటకాక్షుండు;
నెలకొని సాహసాన్వితు లైదుకోట్ల
నలుబదివేలుగంధర్వులు గొలువ
బలుహెచ్చరికలతోఁ బశ్చిమంబునను
జెలఁగి కావలియుండు చిత్రరథుండు;
నాలుగుకోట్ల కిన్నరసేనతోడ
కాలకంఠాభీలఘనపరాక్రముఁడు
హత్తి మాణిక్యరథారూఢుఁ డగుచు
నుత్తమోజ్వలు డుండు నుత్తరమునను;
సమరంబులో వారి సాధించి నీవు
కమలము ల్దెచ్చుట గానఁగా రాదు;

వారితోఁ గలకంఠివాంఛలు దెలిపి
చేరిక ల్గావించి చెలిమి వాటించి
వినుతులు ప్రకటించి వినయము ల్సేసి.
వనజము ల్గొనిరమ్ము వలదు వైరంబు;
మసలఁ జెల్లదు! నీవు మానవపతివి
వసుధాతలాధీశ! వారు దేవతలు;
మహి బలి హోమనమస్కారమంత్ర
మహిత భక్తి జ్ఞానమతులచే వారి
సాధింప నగుఁగాని సాహసక్రియల
సాధింపఁగూడ దాచారంబువలన
ధర్మంబు జనియించుఁ దనరారునట్టి
ధర్మంబువలన వేదములు వర్ధిల్లు
చారువేదముల యజ్ఞములు వర్ధిల్లు
వారక యజ్ఞంబువలన దేవతలు
పరితృప్తు లగుదురు పార్థివోత్తంస;
స్థిరబుద్ధిచేఁ గాలదేశంబు లెఱిగి
సాధింప నగునయ్య సామాద్యుపాయ
సాధకంబుల సాహసము సేయవలదు

నుతకీర్తి నిగ్రహానుగ్రహ ప్రతిభ
లతిభక్తియుక్తి నీయందును గలవు
అటు గావునను వశ్యు లందఱు నీకు
దిటమున నేతెంచి తెమ్ము పద్మములు
ధర్మమున్నట్టిచో దైవంబు గలదు
ధర్మవర్తను లన్నదమ్ములు మీరు
తలపోయ మీ కసాధ్యంబులు గలవె!
గెలిచి రమ్మనుచు గౌఁగిటఁ జేర్చి యతని
శరశరాసనగదాసాధన ప్రతతి
మఱి గొన్ని వరదివ్యమార్గణంబులును
ధర నీడు లేనికోదండంబు నొకటి
తిర మొందఁగా నిచ్చి దీవించి పనిచె.
పనిచినఁ దగ మ్రొక్కి పవనవేగమున
చని చని పాండురాజతనూభవుండు
కరిఘటానీకఘీంకార రావములు
నరుదైన తురగహేషారవంబులును
ఘనతర భేరిభాంకార రావములు
ననుపమసైన్యవీరాలాపములును

చటుల శరాసనజ్యానినాదములు
పటుజయశంఖగుంభ ధ్వానములును
వీనుల విందుగా వినుచు నేతేర
పూనిక నరుదెంచు పుత్త్రునిచలము
బలము చలంబు శుంభత్ప్రభావంబు
వెలయు నుద్దండంబు వీక్షించి మెచ్చి
యనిలుండు కనకరత్నాభిషేకములు
తనివిదీరఁగ జేయఁ దలఁచి వేగంబె
యాయతపడి యున్న తాకారములుగఁ
బోయి కాంచనరత్నములరాసు లనఁగ
వినుతికెక్కిన బహువిధమహీజములు
తనరారు నానాలతానికుంజములు
పరిపూర్ణకోరక ప్రసవజాలములు
బరగు నవ్వనభూమి భావించి చూచి
గరుడగంధర్వరాక్షసయక్షబలము
పరికించి జృంభించెఁ బాండునందనుఁడు
కలహంస శుకశారికాకలకంఠ
జలపతంగరథాంగజలయుతం బగుచు

### భీముఁడు సౌగంధిక జలజాకరము సమీపించుట

విలసితామోదముల్ వెదచల్లుదాని
సలలితసౌవర్ణ జలజాకరంబుఁ
గనుఁగొని చాల వక్కాణించి పొగడి
వనజాకరముఁ జేరవచ్చు నవ్వేళ
యక్షరాక్షససేన లనిలనందనుని
వీక్షించి యత్యంతవిస్మయు లగుచు
నౌరౌర! యీతని యాకారశౌర్య
సారబలోద్దండసంరంభగరిమ!
పరువడి మనల నేపట్ల నింతైన
సరకుసేయక నిదె చనుచున్న వాఁడు!
పదపదం డన బాణబాణాసనములు
పదపడి దాల్చి నిబ్బరమున నేఁగి
యవ్వీరశేఖరు ననువెల్లఁ దెలిసి

### భీమ, యక్ష రాక్షస సంవాదము

యెవ్వరివాఁడ వీ వెవ్వఁడ? విచటి
కెవ్వఁడు బనిచెఁ? పే రెయ్యది నీకు?

నివ్వ్యనభూమికి నేలవచ్చితివి?
తక్కులు దక్కక తత్తరపడక
నిక్కంబుఁ బలుకుమా నృపకులోత్తంస!
యనిన నావీరుల నందఱుఁ జూచి
వినయుఁడై పలికె నావిజయాగ్రజుండు
వినరయ్య నే విన్నవించెద మీకు;
జననుతుం డగుపాండుజనపతిసుతుఁడ;
సకలధరాధీశసందోహరత్న
మకుటప్రభాజాలమహితపాదార
విందుఁడై జగతిపై విలసిల్లు ధర్మ
నందనుతమ్ముఁడ నను భీముఁ డండ్రు;
వనములోఁ గాంచనవనజంబుఁ గాంచి
వనబోణి యిటువంటి నలిన మిమ్మనిన
నిచ్చెద నని పల్కి యీజాడ దెలిసి
వచ్చితి; కృపఁ జూచి వనజ మీవలయు;
అన విని పాండురాజాత్మజుఁ జూచి
దనుజాధినాథుఁ లెంతయు నిట్టు లనిరి
మానవు లెక్కడ! మహనీయదేవ

సూనము లెక్కడ! సులభమె నీకు!
నీలకాంతము లిట నిచ్చువా రెవరు?
పౌలస్త్యుఁ డున్నాఁడు ప్రభుఁ డందఱికిని;
నొయ్యన కావలియున్నవారలకు
"నియ్య స్వతంత్రంబు లేలీలఁ గల్గు?
విచ్చేయు ధననాథు వేఁడుము శ్రీదుఁ
డిచ్చిన గైకొను మిట నీవఁ జెల్ల
దనిన పాండుతనూజుఁ డావీరవరులఁ
గనుఁగొని యిట్లను గలకల నగుచు
గురుతైన క్షత్రియకులమునఁ బుట్టి
శరశరాసనములు చాలఁగఁ బూని
ధూర్తారికోటులఁ ద్రుంచి నల్గడల
వార్తకు నెక్కి యావైఖరినుండి
వడిదప్పి నే నర్థి వర్యచందమున
నడుగంగఁ జెల్లునా నాబలంబునకు
నుడుగక కావలి యున్నవా రగుట
నడిగితి మిము రాజు నడుగంగ రాదు;
ఇచ్చిన మే లగు; నియ్యకయున్న

చొచ్చి నేఁగొని పోదు సూనంబు లనినఁ;
గనుగవ విస్ఫులింగము లుప్పతిల్ల
జననాథుఁ గనుఁగొని సైనికు లనిరి
చనువరివలెనె యిచ్చటికి నేతెంచి
మనుజకీటమ! యోరి, మము సడ్డగొనక
శంకలేక మదించి శౌర్యంబు మించి
పంకజాకరతీరభాగంబుఁ జేరి
కొంకక బొంకించి కొని పోఁదలంచి
చంక దుడ్డును వెండి శరణార్థి దగునె![1]
నరుఁడవు నీవు దానవులము మేము
వెరువవు ప్రజ్ఞలు విడువవు నిన్ను
కరవాలముల కడికండలుఁ జేసి
పరమహార్షంబున భక్షింతు మనుచు
నడిదముల్ ఝుళిపించి యత్యుగ్రు లగుచు
వడిఁ జుట్టుముట్టిన వాయునందనుఁడు
కనుబొమ ల్ముడిపెట్టి కను లెఱ్ఱఁజేసి

1. చంక దుడ్డును వెంట శరణార్థి యగునె (క)

ధను వందుకొని గుణధ్వని చేసి యార్చి
ఘనభీకరాకారకఠినమానసుల
వినుతశౌర్యుల దైత్యవీరులఁ గాంచి
చండిపోతులు గుణసాధ్యులుగారు
దండసాధ్యులు మహోద్దండులు మీరు
గాటంపు టమ్ములఁ గదియక మంచి
మాటల మీరు పద్మము లియ్యఁగలరె!
చేటుబుద్ధులు మాని చెడిపోక వేగ
హాటకాబ్జము లిచ్చి యనుపుట లెస్స!

### భీముఁడు యక్షరాక్షసవీరులతోఁ బోరుట

కాదేని నాచండకాండజాలముల
ఛేదింతు నని యొక్కభీషణాస్త్రంబు
నారి సారించి యానరనాథమౌళి
ధీరత చెవియాన దివియు నవ్వేళ
యక్షరాక్షససేన లరువదినాల్గు
లక్ష లొక్కుమ్మడి లావు రెట్టించి
అద్దిరో! యీతని హంకారమహిమ!

కొద్దిగా దని యెంచి క్రోధించి మించి
తడబడకడిదముల్ తళతళ మనఁగఁ
గడువడిఁ దొడరి యొక్కటఁ జుట్టుముట్టి
పొదువుఁడు పొదువుఁడు పోనీక గదిసి
యదువుఁడు నదువుఁ డత్యంతశస్త్రముల
నేయుఁడు డాయుఁడు నింతింత దునెలు
సేయుఁడు గూయుఁడు చీకాకుపడక
పట్టుఁడు గొట్టుఁడు బలిమి పగ్గములఁ
గట్టుఁడు బెట్టుగా ఖండించివైవుఁ
డని యార్చిపేర్చి మహారౌద్రు లగుచు
గొనకొని యత్యంతఘోరశస్త్రముల
ముసలజాలంబుల ముద్గరంబులను
నిశితశూలంబుల నిష్ఠురభిండి
వాలంబులను గదావలులకుంతములఁ
గోలాహలంబుగాఁ గుప్పి యుప్పొంగి
విక్రమింపుచు నున్నవిబుధారి యక్ష
చక్రంబుఁ గని పాండుజనపాలసుతుఁడు

గహ్వరగగనము ల్గగ్గోలుపడఁగ[1]
సింహనాదముచేసి జృంభించి దనుజ
యక్షవీరులఁ గాంచి యరుణాయమాన
వీక్షణుండై ఘోరవివిధబాణములు
నిగుడించి బెగడించి నెగులు బుట్టించి
పగయెల్ల నణఁగించి పడగలు ద్రుంచి
యురములు బెకలించి యుదరము ల్వ్రించి
శిరములు ఖండించి చెక్కులు చెక్కి
కరములు నురుమాడి కండలు చెండి
చరణము ల్నరికి పిచ్చలుచేసి జవన
తురగసంఘముల రౌతుల నుగ్గుచేసి
కరివరాహంబుల గణములు గూర్చి
రథికుల జంపి సారథుల మర్దించి
రథరథ్యచయము చూర్ణంబు గావించి
గదఁ బూని విజయశంఖంబుఁ బూరించి

---

1. గంహారుల్ గగనంబు గగ్గోలుపడగ (క)
2. గగనగహ్వరములు గగ్గోలుపడగ
పగలెల్ల నుడిగించి పడిగెలు ద్రుంచి (చ)

యదరించి బెదరించి యటునిటుఁ బరపి
బిట్టుల్క వెన్నంటి భీకరఘోరద్ధి
నట్టహాసము చేసె నమ్మహాబలుఁడు
అంతట దానవయక్షసైన్యములు
పంతము ల్వాలించి ప్రతిభలు డించి
యదరి పారెడువారు నరచెడివారు

బెదరి చూచెడువారు భీతిల్లి నేలఁ
బడి కావు మనువారు పదరికల్ చెదరి
తడఁబడువారు పొద ల్దూరువారు[1]
తరువు లెక్కెడివారు ధైర్యము ల్దూలి
శరణనువారు విచ్చలవిడి దిశల

పరువు లెత్తెడువారు పడినగాత్రముల
మరువు చేరెడువారు మరిగూయ వెఱచి
కన్నులు ముకుళించి కదలనివారు
అన్నన్న! యిఁకఁ బ్రోవు మనియెడువారు

1. పడి కావు మనువారు బడలికల్ పట్టి
తలపడి పారి పొద ల్దూరువారు (చ)

నదె వచ్చె నిదె వచ్చె ననియెడువారు
గుదిగొన్న దిగులున గుందెడివారు
బొగులుచు మిగుల వాపోయెడివారు
నగుచు సైన్యాధీశునండకుఁ జేరి
హాహారవంబుల నడల నీక్షించి
సాహసబలశాలి జాంబీరుఁ డప్పు
డోహో! భయం బేల? నుడుగుఁడ టంచు
మోహరంబుగ బలంబుల నేర్పరించి
పేరైన రథికులఁ బెంపు చేయించి
భోరునఁ బోరికిఁ బురికొల్పి తాను
పదరుచు సేనాధిపతులఁతోఁగూడి
కదియ సన్నద్ధుఁడై గదియ నేతెంచె;
అంతటఁ జెలరేఁగి యహూదిబలము
కాంతేయుమీఁద నగ్గలికతో నురికి
కనలుచు గర్జించి కరకరి నొరసి
తనరార సింహనాదములును జేసి
కరవాల ముసల ముద్గర భిందివాల
శరపరంపరలచేఁ జలమున నరికి

క్రమ్మి రెమ్మియు జిమ్మి గ్రుచ్చి నాటించి
బిమ్మటి గొనతేనె పెరఫూగినటుల[1]
గదిసిన యక్షరాక్షససేనఁ జూచి
బెదరక నెదు రేఁగి భీమసేనుండు
దురుసుగా నెడలేక తొలుకారువాన
గురియుచందంబున ఘోరబాణములు
సడలక నేయుట సంధించుటయును;
గడు నెఱుంగకయుండఁగా నప్పళించి[1]
పక్కలు బిక్కలు పాదము ల్దొడలు
చెక్కలు ముక్కలు చేతులు చెవులు
నడుములు మెడలును నరములు శిరము
లుడుగని గినుక నొక్కుమ్మడి చిదిమి
భటుల నెల్లను బటాపంచ గావించి
చటుల భయంకరజ్యారవం బెసఁగఁ
గమకించి తురగసంఘములు నూటాడి

1. బెమ్మెర గొని తేనె పెరమూగినటుల (చ)
1. కడు నెఱుంగకయుండ గా గట్టుముంచి (క ; చ)

సమదేభకోటులఁ జలమునఁ జంపి
వంతుకు నెక్కు మావంతుల జెండి
పంతంబుతో సైన్యపతుల నుగ్గాడి
పేరైన రథికులపీచంబు లడచి
ఘోరదానవయూథకోటులనెల్ల
హారిణంపుగుంపుల నదలించి గదుము
హరికిశోరము లీల నార్చి తోలుటయుఁ;
గలఁగె నేనుఁగులు చీకాకయ్యె బలము
బారిసిరి దొరలు చప్పుడు మానె హరులు
నరదము ల్బాడియయ్యె హతులైరి రథికు
లరిమురి గూలె మహాయోధకోటి;
అంతటఁ బోక రౌద్రావేశుఁ డగుచుఁ
గుంతీతనూజుండు కులిశబాణమున
నాహవస్థలి హాటకాక్షునిఁ ద్రుంచి
సాహసు నుత్తమోజ్జ్వలు గంధవాహు
శరమున వధియించి జలధరాస్త్రమున
ధరచిత్రరథుఁ గూల్చి దర్పంబు మెరసి
కనలి జాంబీరుపైఁ గవిసి కేతనము

ఘనశిలీముఖమున ఖండించుటయును
మలసి జాంబీరుఁడు మార్గణత్రయము
విలయాంతకునిలీల వింట సంధించి
యోరి నరాధమ! యోరి దుర్మార్గ
యీరీతి పొంగెద వేల నాచేతఁ
జావక పోవోరి చచ్చెదవేని
బోవక నిల్వు నీ పొంగెల్ల నణతు
ననుజూఁడు నినుజూఁడు నానేనఁ జూఁడు
పనుపడ నాదివ్యబాణము లూఁడు
మనుచు నాకర్ణాంత మగునట్టు దిగిచి
గొనకొని నేయనాఘోరబాణములు
వెలువ నేతెంచి యాభీమువక్షంబు
గలయించి విలునారి ఖండించి గళము
ఛేదించుటయుఁ గాంచి బెట్టుగా నార్చి
పాదము ల్దట్టించి బాహువు ల్పరచి
గదఁ బూని నడచి యుగ్రత మోదుటయును;
జదియ ధారుణి గూలె జాంబీరుఁ డంత
ఘనతరం బైనసంగరభూమి నెల్లఁ

గనుఁగొని భీముఁ డాగ్రహము చాలించి
వనజాకరము సొచ్చి వనజము ద్రెచ్చి
మొనసి వేఱొక్క యమ్ములపొది నించి
తన వచ్చురాక యాధనపతి వినక
చనఁజెల్ల దనుచు నచ్చట నిల్చి యుండె
అంతట హతశేషు లరిగి కుబేరు
నెంతయుఁ గనుఁగొని యిటునటుఁ దొట్రు

### హతశేషులు కుబేరునికి భీమునివృత్తాంతమును దెలుపుట

పడి మ్రొక్కి దత్తరపాటున లేచి
గడగడ వడఁకుచుఁ గలగి యిట్లనిరి
ఓదేవ వినవయ్య యొకవింత నేఁడు
మోదంబుతో నృపమూర్ధన్యుఁ డొకఁడు
చనుదెంచి బలములఁ జంపి జాంబీర్యుఁ
దునిమి యోధులఁగూల్చి తోయజప్రతతిఁ
గొనిపోవుచున్నాఁడు గుహశక్తి మెరసి

యని సారె సారెకు నదలుచుఁ దెలుప
విని ధనాధీశుండు విస్మయమొంది
కనుఁగవ మిణుగుర్లు గ్రమ్మ నిట్లనియె.
వింటిరే! యిటువంటివింత లెందైన!
కంటిరే! యెవ్వరైన గణకతో మున్ను
విన్న కన్నది గాదు వివరించిచూడ!
కిన్నరగంధర్వగీర్వాణసిద్ధ
పన్నగదైతేయపాలకులైన
నన్నుఁ జెనకఁగ లేరు నరుఁ డొక్కఁడంట!
దేవతాభూమి కేతెంచినాఁ డంట!
కావరంబున యోధగణములఁ గూల్చి
గొనకొని కమలము ల్గొని చనె నంట;
కనఁగ నీవార్త నిక్కం బనఁదగునె!
యని బిట్టుగా నట్టహాసంబుచేసి
ఘనయక్షనాథులఁ గనుఁగొన నపుడు
నలు వగ్గలించి యానలకూబరుండు

గలిగె నా కిది కన్నె కయ్యం బటంచు[1]
గొలువుచావడినుండి గుప్పున దుమికి
వలనొప్పఁ దండ్రికి వలగొని మ్రొక్కి
యింతటి పనికి యక్షేశ్వర నీవు
చింతిల్ల నేటికి సెల విమ్ము నాకు
చని దేవర యనుజ్ఞ జనపతిఁ బట్టి
గొనివత్తు నిపుడె నీకొల్వులోపలికి
మలసి నాతోఁ గొంత మార్కొనె నేని
చలమునఁ గలనిలోఁ జక్కఁగావింతు
వన విని ధననాథుఁ డగుఁగాక యనుచు
వినుతధైర్యౌదార్యవిక్రమాన్వితుని
జాంగలు రావించి సకలసైన్యముల

### నలకూబరుఁడు యుద్ధమునకు వెడలుట

బొంగుచుఁ బిలిపించి భూపాదు లొసఁగి

1. a కలిగె నా కిది వేగ కయ్యం బటంచు
కొలువుచావిడినుంచి గుప్పున దుమికి; (చ)
b కలిగె నా కిది... న్నె కయ్యం బటంచు
కొలువుచావడినుంచి గుప్పున దుమికి (క)

నలకూబరునిఁ జూపి నయవాక్యసరణి
చెలఁగి వేమరు జెప్పి సెల విచ్చుటయును;
నెంతయుఁ గెరలి యక్షేశనందనుఁడు
వింతఁగా రణభేరి వేయించి వేడ్క
నరుణవస్త్రంబులు నరుణభూషణము
లరుణమాల్యంబులు నరుణగంధములు
ధరియించి చండమార్తాండసంకాశ
నిరుపమమాణిక్యనికరసంఖచిత
ధగధగద్ధగిత నిస్తంద్రప్రదీప్తి
నగణితంబై మించు నరదంబు నెక్కి
తనచెలికాం డ్రెల్లఁ దగ నలుగడల
ఘనరథారూఢులై ఖర్వము ల్నడుప
నెలమితో గిన్నరు లిరువది గోట్లు
చలమునఁ గెరలి విచ్చలవిడిఁ జనఁగ
యక్షులు పదికోట్లు లరువదిలక్ష
లక్షీణసాహసులై యేగుదేర
గంధర్వవరులైదు ఖర్వము లొప్పదలి
బంధురస్ఫూర్తి వెంబడిఁ జనుదేర

పరువడి గరుడులు పదియారుకోట్లు
ధరణి గంపింప నుద్దండత నడువ
దనుజు లిర్వదికోట్లు దర్పము ల్మెరసి
కినిసి కయ్యమునకు గేరుచు నడువ
వరచతుర్దంతు లిర్వదిరెండు లక్ష
లురుమదారూఢి మహోద్వృత్తి గదలి
కాటుకకొండల కరణి శోభిల్ల
మేటి కరు ల్లెక్కమీరి యేతేర
జవనసైంధవముల సంఖ్యలు మించి
భువి తల్లడిల్ల నద్భుతముగా నేగ
విలసిల్లు కయ్యంపు వేడ్క బెక్కండ్రు
మలయుచు యక్షకుమారకు ల్నడువ
పదరుచు మొనల నేర్పరచుచు లక్ష
పదివేలు సేనాధిపతులు వే జనఁగ
గొడుగులు పడగలు కోటులు మించి
కడువడి వెనువెంట గ్రమ్ముకురాఁగ
గంభీరభేరికా కాహళధ్వనులు
కుంభినీగగనము ఘూర్ణిల్లి నిండ

కరదీపమణిదీపకాంతులు దిశల
పరువడి గడుపట్టపగలుగావింప
చెలఁగి ముత్తైదువ ల్సేసలు జల్లి
యలవడ గెలిచి రమ్మనుచు దీవింప
వలనొప్ప తనదు లావణ్యవైఖరులు
నలువొంద యక్షకన్యాసమూహంబు
గని సౌధవీథులఁగదలనియట్టి
కనకపుఁబొమ్మల గతి నిల్చి చూడ
ఘనబలోద్దండవిక్రమవైభవములఁ
జనుదెంచుచున్న యాపమయంబునందు

## తూర్పు తెల్లవారుట

తనవచ్చురాక మార్తాండుండు వేగఁ
దనబాంధవులకెల్లఁ దగఁదెల్పు మనుచు
ననిచిన రయమున నరుదెంచు దూత
యనఁగ శుక్రుఁడు దోఁచె నతికళాస్ఫూర్తి
పనుపడ పద్మినీపరిణయంబునకు
దినరాజు వేడ్క నేతెంచు నవ్వేళ

నలిమీర నుదయాచలంబనుభవ్య
విలసితకల్యాణవేదికయందు
నిరువురి నడుమ నిం పెసఁగంగ నిల్వ
తిరమొంద వెలివల్వతెరయో యనంగ
నలవడ సకలజనానంద మగుచుఁ
బొలుపు మీరంగ తూర్పున తెల్లవారె

## సూర్యోదయము

అలరుచు నాసమయమున భాస్కరుఁడు
మలయక నేతెంచు మార్గంబునందు
ధీరత నెదిరి మందేహాదిదైత్య
వీరులఁబోరిలో విశిఖజాలముల
నలుకచే ఖండింప నప్పుడు దుముకు
గళగళద్రక్తసంఘాతం బనంగ
సరభసప్రతిభల జనుదెంచి పంచ
శరుఁడు ముల్లోకము ల్సాధించివచ్చి
వేవేగ శుకపికవీరసైన్యముల
రావించి తగుననురాగంబుతోడ

నందంద రావించి యలరు వేడుకల
విందులు గావించి వెస మదిఁ గోరి
బలుబింబముల నవపల్లవప్రతతి
నెలమితో రాశి బోయించెనో యనఁగ
పసుపడ నరుణప్రభావైభవములఁ
గనుపించె నుదయరాగంబు తూర్పునను
ఏపునఁ జెలరేగి యింద్రజాలికుఁడు
రూపించి సమయ గారుడవిద్యవాఁడు
సురలెల్ల భావించి చూచి మెచ్చఁగను
హరిహాయ! బహుపరాకని హెచ్చరించి
రంగు మీరఁగ నెట్టుగఁ గాగినట్టి
బంగరుగుండ్లను బరువడి మ్రింగి
నడుము వే సులిబెట్టి నాలుక సాచి
మెడ గొంత నిక్కించి మిక్కిలి గొంతు
సరసుచు జేతులఁ జప్పట లిడుచు
మరలఁ దెప్పించి విస్మయముగా నగుచు,
చెలఁగుచు మునిపండ్లచేఁ గొంత నిల్పి
యొలమితో నింగికి యెగనూపె ననఁగ

సముదగ్ర కరసహస్రప్రభాజాల
ముదురఁగా నుదయించె నబ్జబాంధవుఁడు

### ఘటోత్కచుఁడు ద్రౌపదిసహితుఁడై ధర్మరాజుకడ కేగుట

అనఘాత్మ వినవయ్య యవలి సత్కథను
ననువొంద తొలినాఁడె యాఘటోత్కచుఁడు
బొదలుచు పాంచాలపుత్త్రిఁ దోడ్కొనుచు
బదరికావనము నిబ్బరమునఁ జేరి
యమసుతాదులకు సాష్టాంగంబు లెరఁగి
క్రమ మొప్పఁ గాంచనకమల మిచ్చుటయుఁ
బరమహర్షంబున బాండవాగ్రజుఁడు
పరికించి సంతోషభరితుఁడై యుండె
ప్రేమ నందరి జూచి భీమసేనుండు
లేమికి బెగడి నల్దిక్కులుఁ జూచి

### ధర్మజుఁడు భీమసేనుఁ డేడయని యడుగుట

కాంచనాబ్జముఁ జూచి కలఁగుచున్న
పాంచాలిమోము తప్పక చూచి పలికె

చెలువరో మే మెంతఁ జెప్పిన వినక
చలపారి కాననసంచారమునకుఁ
దొలఁగక భీముని దోడ నేఁగితివి
తెలిసె మీరంద ఱేతెంచితి రిటకు
కరుణాంబునిధి రానికారణ మేమి?
పరువడి నతని నే పనికిఁ బంచితివి?
అదె నాభుజాదండ మదరుచున్నదియు;
తుదలేక కన్నీరు దుముకుచున్నదియు;
ఇనుఁడు తేజము దక్కి యినుపబిల్లవలె
గనుపించుచున్నాఁడు కడలనుత్పాత
ములు దోఁచుచున్నవి పొలతి నిక్కంబు
బలుకుమటన్న నాపాంచాలతనయ
కలఁగుచుఁ దెలికన్నుఁగవ నశ్రు లొలుకఁ
దల వాంచి ధర్మనందనున కిట్లనియె.

ద్రౌపది భీమునివృత్తాంతము ధర్మజుతోఁ జెప్పుట

జననాథ మీయాజ్ఞ జనుదెంచి ఘోర
వనమధ్యమున వాయువశమున వచ్చి

యాకమలము వ్రాలె నిది చూచి నేను
నీకూర్మి తమ్ముని నీరజమ్ములకుఁ
బనిచితి చనియె నాబలశౌర్యధనుఁడు;
అనఘు నన్నిటకుఁ బొ మ్మనిన వచ్చితిని!
అనిన చింతించి యాయమతనూభవుఁడు

### ధర్మతనయ ఘటోత్కచుల సంభాషణలు

ఘనశౌర్యనిధి ఘటోత్కచుఁ జూచి పలికె.
దనుజాధినాథ మీతండ్రి దానొంటిఁ
జనుచుండ యక్షరాక్షససిద్ధసాధ్య
గరుడగంధర్వశేఖరు లెల్లరొడల
జరియింతు రివ్వని సౌవర్ణజలజ
ములు దెచ్చు టేరీతి! మోస మే మగునొ!
ఎలమి నచ్చటఁ గావ లెవ్వ రున్నారొ!
తలఁకెద మీయయ్య తడ వాలసించె
కలహంబు బహుళంబుగాఁ గల్గె నేమొ!
అచ్చటి కరిగి నీ వామేలువార్తఁ
దెచ్చిన నామది దిగులు దీరెడిని

అని యానతిచ్చిన యమసూతిమోము
గనుఁగొని యాఘటోత్కచుఁ డిట్లు పలికె
పరమపావనమూర్తి బంధురకీర్తి
గురుకటాక్షనిరీక్ష కురుకులాధ్యక్ష
చెలువొంద మీపాదసేవఁ జేయుచును
గొలిచి నే నుండఁగాఁ గొంకు మీ కేల?
కందర్పుఁ గన్నయ్య కమలలోచనుఁడు
ఇందిరారమణుఁ డహీశతల్పకుఁడు
భవరోగవైద్యుఁ డాపద్బాంధవుండు
రవికోటితేజుఁ డార్తశరణ్యమూర్తి
మదనగోపాలుండు మనపాలఁ గలుగఁ
బెదరి పల్కఁగ నేమి పృథ్వీతలేంద్ర!
అరయంగ యుష్మద్దయావీక్షణములు
నెరవజ్రకవచంబు నీతమ్ములకును;
నొనర నీసన్నిధి నున్నవారలను
జెనకఁగా శక్తుఁడె శితికంఠుఁడైన?
అవనీశ నీమది ననుమానమైన
పవనజుచెంతకుఁ బనుపు పోయెదను

ఎదిరి ముల్లోకంబు లేతెంచెనేని
అదలింతు నేనె మాయయ్యకుఁ జూప
నను గారవించుచు నాతల్లి మెచ్చ
కనకాంబుజములందు గలవింత లెల్ల.
సిరులొందఁ గొని భీమసేనునిఁగూడి
పరతెంతు నని వేగఁ బయన మౌ నపుడు

### నారదాగమనము

పొలుపొంద నిద్దంపుభూతి మైఁ బూసి
కలితమౌ జప మాలికయుఁ గేలఁ దాల్చి
తళుకైన బెళుకు బెత్తము చేతఁ బూని
విలసిల్లు పెన్జడ ల్వీపున వ్రాల
సరిగమపదనిస స్వరములఁ బెంచి
వెరవొప్ప ఘనదండవీణె మీటుచును
హరి నమో నారాయణాయ యన్మంత్ర
మురవడి సారెకు నుగ్గడింపుచును
శారద నీహార పాటీరహార
తారకామందార తారాచలేంద్ర

శారదాశారద శర సుధాసార
సారవర్ణుఁడు దేవసంయమీంద్రుండు
చనుదెంచుటయుఁ గాంచి శమననందనుఁడు
వినయంబుతో మ్రొక్కి వేడ్కఁ బూజించి
నలువంద నుచితాసనంబున నునుప
నలరి ధర్మజుఁ జూచి యమ్మౌని పలికె
వసుధాతలాధీశ! వాయునందనుఁడు
మసలక కుసుమకోమలికోర్కెఁదీర్పఁ

శారదుఁడు ధర్మజునకు భీమనలకూబర యుద్ధము
సంగతిని దెల్పి సహాయముసేయఁ బొమ్మనిచెప్పుట

కమలంబులకు నేగి కాననభూమి
నమితమోదంబున నంజనీతనయుఁ
గనుఁగొని యతనిచేఁ గమలంబు లున్న
యునికి నెల్ల నెఱింగి యొగి నేఁగుదెంచి
వనజాకరం బున్న వనవీథియందు
దనుజగంధర్వులఁ దార్కొని పోరి
యుక్కుమీరిన నెరయోధులఁ గూల్చి

తక్కినబలములఁ దర్పంబు లణఁచి
కయ్యంబునకుఁ జాల కాలుద్రువ్వుచును
నయ్యెడ నున్నవాఁ డనిలనందనుఁడు;
ఎలమి చారులవల్ల నిది యెల్లఁ దెలిసి
నలకూబరుండు సైన్యంబులతోడ
నడచె నాతనిమీఁద నలు వగ్గలించి
తడయక నీవు నీ తనుజులతోడ
ననుజులతోడ నీయబ్జాక్షితోడ
మునులతో విప్రసమూహంబుతోడఁ
జనఁదగు; మీర లిచ్చట నిల్వఁ జెల్ల
దని పల్కి త్రిదశమహాముని జనియె
శమననందనుఁ డంత సంతాపమంది
యమరారి కులనాథు నాననాబ్జంబుఁ
గనుఁగొని యిట్లను గటకటఁ బడుచు
దనుజేంద్ర వేగమే తరలఁగావలయు
నలకూబరుఁడు వాయునందనుమీఁద
మలసి పోరక మున్నె మన మేఁగఁ దగును.
అనిపల్క నంత నా యసురనాయకుఁడు

ఘటోత్కచుఁడు తండ్రిసహాయార్థ మరుగుట

జనకుల నల్వుర జలజాతముఖిని
ధారుణీసురల రథంబున నునిచి
వీరాగ్రగణ్యుల వేర్వేఱఁ బిలిచి
బలములతోఁ గూడ బారులు దీర్చి
నలుదిక్కుల నమర్చి నరపతి మెచ్చ
తనసరి చెలికాండ్ర దైతేయపతుల
మొనచేసి బలిమిగా ముందఱ నిల్పి
రణభయంకరు లగురథికులతోడ
ప్రణుతి కెక్కిన మూలబలములతోడ
ననుపమ హేమరథారూఢుఁ డగుచు
వెనుక దా నిలిచి పృథ్వీమండలంబు
గ్రక్కతిలంగ దిగ్గజములు మ్రొగ్గ
గ్రక్కునఁ గదలె రాక్షసకులేశ్వరుఁడు
చనుమార్గమున రథచక్రఘాతముల
ఘనదైత్యబలపాదఘట్టనంబులను
హరిఖురాహతుల వేదండప్రచండ
చరణోద్ధతంబుల శైలముల్ ఘోర

కాంతారములు నేలఁ గలసి మాయంగ
నంత మహోద్వృత్తి నరుగుచుండఁగను;

నారదుఁడు కరిపురమునకుఁ బోవుట

అలరు వేడుకల కయ్యపుడిండితపసి
పొలుపొందు హస్తినాపురి కరుదెంచి
గురుకృప గాంగేయ గురుసుతకర్ణ
గురుబలాఢ్యులుతోడ గొలువున్నయట్టి
కురుపతియెదుట గ్రక్కున నిల్చుటయును
ధరణీశుఁ డప్పుడు తమ్ములు దాను
నెదురేఁగి పూజించి హితభక్తి మ్రొక్కి
ముదమున మణిపీఠమునఁ దగ నుంచి
మునినాథ యేపని పూని వచ్చితిరి
నను దయఁబ్రోఁచి యానతి యియ్యవలయు
నన విని కౌరవాధ్యక్షుని మోము
గనుఁగొని యిట్లను గలహభోజనుఁడు;

నారదుఁడు భీమునివృత్తాంతము, ధర్మరాజాదులు సాయము వెడలుటయు, నాదిగాఁగలసంగతులు చెల్పుట.

అలకాధిపతిసేన కనిలసూనునకు

గలనైన నెఱుఁగని కయ్యంబు గలిగె
నావార్త విని భూసురావళితోడ
పావనశీలయౌ పాంచాలితోడ
తక్కక కవలును ధర్మనందనుఁడు
పొక్కుచు నిదె యిదె పోవుచున్నారు
సమరభీకరుఁడు నిశ్శంకుఁ డర్జునుఁడు
అమరేందుపురి కేఁగె నతఁడు రాఁడాయె;
మంతుకెక్కిన యోధమండలిచేత
నింతకు పవనుజుం డేమోయి నగునో!
యొట్టి వీరునకైన నిద్దరి కొకఁడు
కట్టిన గోరియయుఁ గాదె భూపాల;
యనిలజు నిడిపించి యఖిలదిక్కులను
వినుతకీర్తుల నించు వీరాగ్రగణ్యు
లన్నదమ్ములలో నలుక లెన్నైన
నున్నను బరసేనను దరింపఁదగవు;
ధర నీడులేని భూతలపతి వీవు
నెర యోధు లున్నారు నీసమ్ముఖమునను
దెలిపితి నున్నంతఁ దేటగా నీకు;

దలఁపఁ దల్లికి లేని దయ దాది కేల ?
ననుచు దిగ్గున లేచి యమరేంద్ర పురికిఁ
జనుదెంచె దేవతాసంయమీశ్వరుఁడు
కురురాజు తసమదిఁ గొంత యుప్పొంగి
పరగ యోధులకెల్ల పయనము ల్చెప్పి
కొలువు చాలించి దిగ్గున లేచి నగుచు
జలజాప్తసుతుని హస్తంబుఁ జేపట్టి
రయమున నొకయంతరంగస్థలమునఁ
బ్రియముతోఁ గూర్చుండి భీమఫల్గునుల
సమధిక సాహస సత్వము ల్దలఁచి
కమలాప్తనందనుఁ గనుఁగొని పలికె
నోవీరశేఖర ! యోధరాధేయ!
యీవేళ మనకోర్కె లెల్ల నీడేరె!

### దుర్యోధనాదుల దుర్మంత్రము

నెలకొన్న కంటిలో నెరసులువోలె
విలసిల్లు నిశ్శంక విక్రమాన్వితుల
భీమార్జునులఁ గన్న భీతి వాటిల్లు

మా మదిలో ననుమానంబు దీర
ధరణిపై భీముండు ధననాథు నెదిరి
దుర మొనరించినఁ ద్రుంగుట నిజము;
కౌలదీర్చవలె నని గోరుచుండఁగను
లలిమీఱ కాకతాళీన్యాయమయ్యె;
నర్జునుం డొకఁ డున్న నాహవస్థలిని
నిర్జింపఁగా వచ్చు నిజసేనఁ గూడి
తడయక మన మేఁగి ధర్మజుఁ గవలఁ
బడనేసి పాంచాలిఁ బట్టి తేవలయు
నని పల్క విని క్రోధుఁడై నరనాథుఁ
గనుఁగొని గద్దించి కర్ణుఁ డి ట్లనియె.
మేలయ్య కురురాజ! మెచ్చితి నిన్ను!
స్థూల సూక్ష్మంబుల సుళు వెఱుంగుదువు
బలమరి బ్రాహ్మణపల్లియఁ జేరి
తలచెడి యిండిండ్లు తప్పక తిరిగి
తిరిపమెత్తుక తిని ధీరత్వ ముడిగి,
పరదేశులై గుళ్లపంచల మొఱఁగి[1]

1 పరదేశులై గుళ్లపంచల మడిగి (క. చ)

బాములపడి పేదబాపలై యున్న
భీమార్జునుల నొక పెద్దఁ జేసెదవు
సరకుసేయక నాదుసాహస ప్రతిభ
గుఱిమేరగలవాఁడు గొలువఁడు నిన్ను
గకవికల్గా నిండ్లు గాల్చు నవ్వేళ
నొక పేదవాఁడైన నొదిగి తా నున్నె!
పోనాడి యాయుధముల దోచునపుడు
శూరత్వ మున్నను జ్ఞాపకుండుదురె!
కొలువులో నిల్లాలి కోక లూడ్చినను
దలపడరే బంటుతనము గల్గినను!
నుల్లముల్ ఖేదిల్ల నుదిరించి పురము
వెళ్లగా ద్రొబ్బించు వేళల నయిన
నొక్కింత జెనకక యుందురే యకట!
మక్కువ చెడి దొడ్డమలలోనఁ జేరి
గతిమాలి యున్న యా కష్టమానవుల
ప్రతిభ లెన్నెదవు నాభావాబలంబు
దెలిసియు నొక్కింత దెలియవు నీవు;
కలఁగెడివాఁడ విక్కడ నిల్వు మీవు;

సెల విమ్ము నరనాథశేఖర నాకు
కలికి వీనులవిందుగా విందు వధిప
నరభీము లేల పద్మాల్గు లోకంబు
లరుదెంచెనేని చక్కాడివై చెదను;
దలపడి గవలను ధర్మజుఁ దునిమి
బలువేగ పాంచాలి బట్టి తెచ్చెదను;
నావిని రారాజు నగుచు నేకెంచి
వేవేగ రాధేయు వెస గౌఁగిలించి
నర భీము లన నెంత నాయన్న నీకు',
హరిహర బ్రహ్మాదు లైన సమంబె!,
తిరమొంద నీమది తెలియంగవలసె
వెరువక నే నంటి వీరాగ్రగణ్య!,
మలయ కీనేరము ల్మన్నించు! మనుచు,
వెలయంగ నొకకొన్ని వినయముల్సేసి,
భూషించి, నవరత్నభూషాదు లొసఁగి,
భీషణంబుగ రణభేరి వేయించె.

### దుర్యోధనుఁడు సైన్యములతో బదరికా వనమున కరుగుట

సకలసన్నాహము ల్సవరించి దిశలు
గకవిక ల్గాఁగ శంఖములు పూరించి,
హితులు బంధులు భూతలేంద్రు లేతేర,
నతులిత ద్రోణభీష్మాదులు నడువ,
తతశక్తి నూర్గురు తమ్ములు నడువ,
నతులితాటోపులై యాత్మజు ల్నడువ,
వితతనానావాద్యవిభవవైఖరులఁ
జతురంగవాహినీ సహితుఁడై గదలె.
ఇంద్రునిఁ బోలె నాగేంద్రకేతనుఁడు
సాంద్రవైభవ మహోత్సాహియై వెడలి
వడి నేగి బదరికావనమున కరిగి

### పాండవు లందు లేకుండుట

తడయక పాండునందనుల శోధించి
యెవ్వరు లేమి వా రేఁగినజాడ
దవ్వుగాఁ గదలి మార్తాండనందనుని

తనయుల హితుల బాంధవుల సోదరుల
గనుఁగొని చేఁజూపి కడిమి యిట్లనియె
ఇదె యిదె పోయెద రిపుడు పాండవులు
కౌదకక వెన్నంటి కూడ నేతెంచి
శమనతనూజునిఁ జక్కఁ గావించి
క్రమమున నకులుని ఖండించివైచి
సమరాంగణంబున సహదేవుఁ దునిమి
రమణీయగుణధామ, రామాభిరామ
అలికులవేణి రక్తాంభోజపాణి
సలలితమృదుపాణి సైకతశ్రోణి
కాంచనసుమనాస, కౌముదీహాస
పాంచాలపుత్త్రిని బట్టి తెమ్మనిన
కౌరవాధిపుమోము గనుఁగొని కనలి
భోరున వరదంబు బోనిచ్చి యతనిఁ
గూడ నేతెంచి సక్రోధుఁడై మండి
కేడించి చూచి గాంగేయుఁ డిట్లనియె

## భీష్ముఁడు దుర్యోధనునకు హితము చెప్పుట

గురుతైన యీమహా ఘోరపాపములు[1]
కురురాజ! నిను గట్టి కుడుపకపోవు!
మంచివాఁడవువోలె మలసి యేతెంచి[2]
కొంచక యిటువంటి కుటిలముల్ మేలె?
పమ్మి శత్రుఁడవై పగఁ దీర్పవచ్చు
నమ్మిన జెరచుట న్యాయమ్ముగాదు[3]
ఈరేడుజగములు నీచేటుబుద్ధి
వారక దలచినవారికే హాని
పరికించి చూచిన పాండుతనూజు
లరుదైనసాహసుల్ హరి కృప గలదు
వారితోఁ బోర నెవ్వరికి శక్యంబు!
నేరని యీపను ల్నీతి గాదన్న
యిందరిలోఁ బెద్ద లెవరు లేరైరె

1. గురుతైన యీమహాఘోరపాపాలు. (క)
2. మంచివాడవువోలె మలసి యేతెంచి. (ట)
3. నమ్మించి చెరచుట న్యాయంబుగాదు (1378)

యందురు జనులు మాయపకీర్తిఁ బాపు
కడిమిచే మాబుద్ధి గాదంటివేని
యడరు దుష్టచతుష్టయంబును గూడి[1]
పొలియుసేన లటంచుఁ బుల్లదా విరిచి[2]
యొలమితో జేతికి నిచ్చు నవ్వేళ[3]

### కర్ణగాంగేయ సంవాదము

కెరలి కర్ణుండు గాంగేయుని దిక్కు
మరలి పావకు లీల మండి యి ట్లనియె
గంగాతనూభవ కటకటా యిట్టి
వెంగలిపలుకులు వెస పల్కఁదగునె!
అందఱికిని దాతవై యున్నయట్టి
మందె మేళంబున మము సడ్డఁగొనక
ప్రల్లదంబులు పల్కి ప్రభుసన్నిధిని
తెల్లించుకొంటివి చేగాచినాఁడ

1. యడరి దుష్ట చతుష్టయంబునుగూడి (4491)
2. పొలియుసేన లటంచు పుడక దా విరచి (చ)
3. యొలమి మీరఁగఁ జేతి కిచ్చె నావేళ (4491)

మితిలేనియట్టి స్వామిద్రోహు లగుట
హితశత్రు లగుట మి మ్మెఱుఁగమే యున్న
పాండవు లన నెంత! పద్మాక్షుఁ డెంత!
దండింతు సాహావస్థలి నిల్పి రేని
చేరి మీ కొకబుద్ధి చెప్పెద వినుఁడు
ధారుణీధవుని చెంతల రంతు మాని
పేరతో నుండిన మీసిగ్గు దక్క

క్రూరులై సేరని కూఁతలు గూసి
యడరు గల్పించియు హాస్యముల్ నెరపి
కొదువ లెన్నుచుఁ గేరి గ్రుడ్లెఱ్ఱఁజేసి
వీక్షించి యాపాండవేయులఁ బొగడి
పక్షపాతంబులు పలికితి రేని

గురుఁడును కృపుఁడును గురుపుత్రుఁ డీవు
వరిది దుష్టచతుష్టయంబు నాచేత
కెదుట నిక్కువ మని చేచాచి చాటి
కడిమి మీరఁగ బల్కి గద్దించుటయును
కురురాజు వీక్షించి గురుసూనుఁ డనియె

కురురాజ గురుసూనుల సంభాషణము

ధరణీశ నీయెడ తప్పేమి లేదు
నలువంక కమలాప్తనందనుం డనెడి
పలుకొంటె చేరిన పాప మొక్కటియె?
ఇన్నరాధము పల్కు లిచ్చగించుటకు
నిన్నుంచి యిది యొక్క నేరంబు గలిగె
మెలఁగుచు నీపాలిమృత్యువై చేరి
పొలవక నాసలఁ జూపి నమ్మించి[1]
శంకింప కిట నిన్నుఁ జంపింతు ననుచు
గంకణం బిదె చేతఁ గట్టి యున్నాఁడు
అదిగాక రాధేయు ననువెల్ల వినుము;
కదలని నెరబంటుకై వడి వదలి
కదనంబునకు నిన్నుఁ గదియించి మీఁద
పదపడి కార్యంబు పైకొననేని
మనిలోన నిను డించి యరుగు వేగంబె;
మన మెఱుంగమె! కర్ణు మగతనంబెల్ల

1. తొలఁగక యుండినఁ దోర్బలంబునను (1378)

వరుస నీసామ్రాజ్యవైభవంబునకుఁ
గెరలితోఁచిన ధూమకేతు వర్కజుఁడు
నలువంద దుర్యోచనలు మాని వారి[1]
గలసి సహాయంబు గమ్ము వేవేగ
జననాథ మీబుద్ధి సరిపోవ దేని
యినతనూజునిఁగూడి యీసేన లడఁగు
ననఁ దోఁక ద్రొక్కిన యహిరాజులీల
ఘనరోషచిత్తుఁడై కర్ణుఁ డి ట్లనియె

**కర్ణ గురుసూనుల సంవాదము**

ముది మది దప్పిన ముదుకఁ డటంచు
వదరినఁ గాచితి వాహినీసుతుని
బాపఁడ వీవు నీపని యన నెంత;
భూపతి వినుచుండఁ బొంగెద విప్రుడు[2]
కోపించి నిన్నంటి కూల్పక యున్న
నాపంత మేటికి ననుఁ జూడు మనుచుఁ

---

1. నలువంద యాపుచ్చనలు మాని వారి
గలసి సహాయంబు గమ్ము వేవేగ (క)
2. భూపతి వినుచుండఁ బొక్కెద విప్రుడు (2421)

గరమున బెడిదంపు ఖడ్గ మంకించి
గురుతనూభవునిపై గురుశక్తి నడచె
కనలి యశ్వత్థామ కర్ణునిమీఁద
ఘనకరవాలంబు గైకొని కెరలి
యరదంబు దుమికి చయ్యన నేగుదేర
గురుఁడుఁ గౌరవరాజు గొబ్బున నరిగి
కర మర్థి నెడసొచ్చి ఘనుల నిర్వురను
నరికట్టి వారించి ననునయింపుచును

ద్రోణుఁడు దుర్యోధనుఁడు వారి నిద్దఱిని వారించుట

బయవడి నలుగడల్ భావించి చూచి
గురుఁ డిటులను నృపకుంజరుఁ గాంచి
నరవర కంటివే నాచేతిదిక్కు

ద్రోణుఁడు దుర్యోధనునితోఁ బ్రసంగించుట, అతఁడు చెప్పినహితము

వరధూమకేతువువలె మిన్నుముట్టి
గాఢవిస్ఫూర్తులు గనుపట్టెనదిగో
రూఢిగా గండభేరుండ ధ్వజంబు

వాఁడెపో భీముని వరనందనుండు
వాఁడి మించిన మహా వరబలాధికుఁడు
అరిది ఘటోత్కచుం డరుదెంచె నింక
హరిహర బ్రహ్మల కైన శక్యంబె!
యీకర్ణసాహసం బెంతైనఁ గలదు!
చేకొని యొకబుద్ధి చెప్పెద వినుము
ఎవరైనఁ దనబల్మి యెదుటి బల్మియును
వివరించి చూడక వేగిరపడిన
మనుజేంద్ర మోసమౌ మానుము కినుక
చెనకిరో ని న్నేమి చేసిరో వారు
వారితో నీ కింత వైర మేమిటికి ?
ఘోరరాక్షసులతోఁ గూడి యున్నారు
గరిమెతో బంధువర్గమ్ములు వీరారు
వరుసతోఁ బురిఁ జేరవలసితిరేని
పడుచుబుద్ధులు మాని పాండవేయులకుఁ
గడిమి సహాయంబు గఱపు వేవేగ;
అది సరిపోదేని యవనీతలేంద్ర!
కదలు శీఘ్రంబునఁ గరిపురంబునకు

మనము వచ్చినయట్టి మర్మము ల్వినిన
నిను సాగనీయఁడు నిర్జరాహితుఁడు;
అన విని కోపించి యాచార్యు మోముఁ
గనుఁగొని యి ట్లను గమలాప్తసుతుఁడు.
పరమాన్న మొబ్బట్లు పప్పు బూరెలును

కర్ణుఁడు ద్రోణుని దూషించుట

బరువంపుశిఖరులు పచ్చళ్లు తేనె
లారపైనకూరలు నూరగాయలును
బరకాళిపెరుఁగుతోఁ బరిపూర్ణములుగ
బారణ ల్గావింపఁ బ్రౌఢులు గాని
మీరిన పనులకు మీ కెంత దవ్వు!
అధికు నల్పునిఁజేయ నల్పమానవుని
అధికునిగాఁజేయ నటునిటుఁ బోరల
విరిపోటుఁ గల్పింప వికలము ల్సేయ
బిరుదువాక్యము లాడ బెక్కులు ప్రేల
వేలారువిధముల విమతులఁ బొగడ
నేలిన పతికార్య మెంతయుఁ జెరుప

మీరె సమర్థులు! మిము నెర నమ్మి
ధారుణీపతి వచ్చెఁ దా వెఱ్ఱిగాఁడె!
గొంటుసుద్దులు చేరి కూయనేగాని
బంటుపంతము లేల బాపనయ్యలకు!
అదె ఘటోత్కచుఁ డని యడరు గల్పింప
బెదరునే కర్ణుఁడు! ప్రేల నేమిటికి!
మొనమాట లనిన భీష్ముని గుండె లవియ
విను నీతనూజుండు వికలంబు నొంద
నీవు సిగ్గువహింపఁ గృపుఁడు ఛేదిల్ల
గోవిందుఁ డెందము గొందల మంద
గరుణ పాండవులపైఁ గలవారికెల్లఁ
విరవిర హృదయముల్ ప్రీతి బెగ్గిల్లఁ
దలపడి శమననందనుని ఖండించి
మలసిన మాద్రికుమారులఁ జంపి
తెగువ ఘటోత్కచుఁ డెగటార్చుకున్న
నగరె! మీ రందఱు నను జూచి నపుడె
యవ్వ విని కృపుఁడు మార్తాండనందనుని

గనుఁగొని దగ్గరి గద్దించి పలికె.
మేలు! మేలుర! కర్ణ! మేదినీరమణుఁ
డాలించి వినుచుండ నాడినఁ జెల్లె
వదరెదు ద్రౌపదీపతులకు నీకు
మది నెంచఁగా హస్తిమశకాంతరంబు;
వారి యెవ్వరిలోన వాసవతనయుఁ
డీరేడుజగముల నెనలేని మేటి;
అరయంగ నీకు దైత్యాధీశునకును
మరి తృణ మేరుసమానంబు లగుట;
నిరవొంద భీముని నెంచ నేమిటికి?
నరయ హిడింబ బకాసురు ల్లాతఁ
హరిపుత్త్రుబలిమికి యంత్రమత్స్యంబు
నరుదైన చిత్రసేనాదులు సాతఁ
పాండునందనులతోఁ బగఁ గొనుటెల్ల
గొండతోఁ దగరు డీకొనునట్లు గాదె;
ఎందైన ఘనులచేఁ వ్రేలుఁగంగరాదు
పందలకే పెద్ద బారెడునోరు

మాయురే! నినువంటిమగఁటిమి బంటు
ఈయోధవరులలో నెవ్వరు లేరు!
మీ తెలుంగవు పద్దుమీరినపనులు
గాదన్న వారలఁ గరువఁ బోయెదవు!
కలఁగవు సి గ్గెలుంగవు మొత్తఁ దెచ్చి
వలసి పైఁబెట్టిన వైఖరి నీవు
తలపెట్ట పరువెత్తఁ దలఁచుకొన్నాఁడ
విల నీకు వగచు వా రెవ్వరు లేరు
నీపల్కు నెర నమ్మి నిక్కువ మనెడి
భూపతి కొకయింత బొక్కెద మిపుడు?
నెలవైన మాబుద్ధి నీ వేల వినెదు
చెలఁగి దైత్యుఁడె బుద్ధిఁ జెప్పెడు నీకు
కలఁకపుట్టెడిని నిక్కంబుఁ బల్కినను
నిలుకడగా నీత నేరనివారి
గంగమ్మ కొనిపోవుగాని మాకేల!
అంగరాజ్యాధిప యరుగు పొమ్మనిన

### కర్ణుఁడు కృపునిపై కురుకుట

నాడిరి కోపించి మహోగ్రుఁడై కర్ణుఁ

డుదుటునఁ గృప్రునిపై కురికి ఖడ్గంబు
ఝుళిపించి వేయ నశ్వత్థామ గినిసి
తళతళ మనుగదాదండంబు బూని

### అశ్వత్థామ కర్ణుని శిరము మోదుట

వాలు చూర్ణముచేసి వనజాప్తసుతుని
ఫాలంబు వ్రయ్యలై పగల మోదుటయు
బెడిదంపుమూర్ఛల బెట్టుగా ధాత్రిఁ
బడి లేచి యినజుండు ప్రళయమార్తాండ
సదృశుఁడై పేర్చి యాచార్యనందనుని
గొదుకక నడిరొమ్ము గుప్పునఁ బొడువ
నది దాకి గురుసూనుఁ డర్కనందనుని
గుదికిలఁ బడద్రోచి గుండియ ల్బగులఁ
బిడికిటఁ బొడిచిన భేదిల్ల కతఁడు

### కర్ణ అశ్వత్థామల యుద్ధము

తడయక చంగున దాటి వేరొక్క
కరవాలు కేడెంబు గైకొని నడచె
కురువీరు లద్రువ గగ్గోలుగా నార్చి

యడిదంపు పలక రయంబునఁ బూని
నడతెంచె యాచార్యనందనుం డపుడు;
తడఁబడి కార్యంబు దప్పె నటంచుఁ
దొడిబడి నరదంబు దుమికి యేతెంచి
నరపతి యిరుపురనడుమ దాఁ నిలిచి
గురునందనునకు మ్రొక్కుచు మ స్తరించి[1]
గరిమతోఁ గర్ణుని గౌఁగిటఁ జేర్చి

దుర్యోధనుఁడు వారిని వారించుట

సరసోక్తులను వారి సమ్మతిపఱచి
పలుమరు గర్ణుని భావించి చూచి
పలికె నెయ్యంబుతో ఫణికేతనుండు
ఇదియేమి రాధేయ యేల పోరెదవు
పడుగురు గా దన్నపని సేయఁదగదు
విహితం బెఱుంగవు వినుము నాబుద్ధి
బహుజనద్వేషంబు భావ్యంబు గాదు

1. గురునందనునకు...క్కుచు ను స్తరించి (క)
2. గురుసుతునకు మ్రొక్కి కోపంబు మాన్చి (చ)

తనర నీ వేఁగి శాత్రవులఁ గెల్చినను
మనపెద్ద లెల్లను మనలోని వారె
అటుగాక వే రొక్కలైన నీపుణ్యు
లటువలె గావలె ననియెడివారె
ఈమహాత్ములమాట లెన్నైనఁ గలవు
నామాట మీఱకు నాయన్న నీవు;
అని బుద్ధిచెప్పిన యటువలె కర్ణు
ననుజాలసుతుల సేనాధినాయకులఁ
గనుగీటుటయు మహీకాంతునిబుద్ధి
విననికైవడిఁ గురువిభు ధిక్కరించి
ధనువులు మ్రోయించి తమకము ల్మించి
ఘనవాహినులతోడఁ గదలి రెంతయును;
మచ్చరంబున మదోన్మత్తులై కెరలి

**ఘటోత్కచుఁడు ధర్మజునితోఁ గౌరవులరాక నెఱింగించుట**

విచ్చలవిడి కురువీరపుంగవులు
వచ్చు నగ్గలిక భూవరుల మోహరము

లచ్చెరుగొని చూచి యనురాగమొంది
శౌర్యవిస్ఫూర్తి రాజసచక్రవర్తి
తూర్యము లుప్పరించి దోశ్శక్తి మించి
భేరులు మ్రోయించి పృథివి గంపింప
దారుణసింహనాదములు చేయించి
దండిబారులనెల్లఁ దగ నేర్పరించి
పాండవేయులచెంత భద్రము ల్చేసి
బలువడి దక్కిన బలముల నెల్ల
నెలగోలుగావించి హెచ్చి క్రోధించి
తనరార ధర్మనందనునకు మ్రొక్కి
జననాథ కురువీరసైన్యంబు గెరలి
ప్రాకటంబుగ సప్తపాథోధు లెలమి
యేకార్ణవంబుగ నేతెంచులీల
కొలదీర జగడంబుఁ గోరి వచ్చెదరు
తలకక మీకూర్మితనయుని కిపుడె
సెల విమ్ము కరిపురి చేర్చి వచ్చెదను
తొలఁగక నిల్చినఁ దునిమి వైచెదను
నావిని ధర్మనందనుఁడు చింతించి

భావించి కౌరవబలము వీక్షించి
దిటము దొలంగించి తెగువ చాలించి

### ధర్మజుని భయసంతాపములు

కటకట పడి ఘటోత్కచున కి ట్లనియె
దనుజాధినాథ యెతంటికార్య మొదవె
ధనపతిచే వాయుతనయుండు చిక్కె
మనము దుర్యోధన మండలేంద్రునకు
ననిలోనఁ జిక్కితి మయ్య కుమార
అక్కటా నిల్చి పోరాడఁగా నోప
మెక్కడఁ జనఁగల మెవ్వఁడు దిక్కు
చండబలోద్దండసాహసాంకుండు
గాండీవి వచ్చినఁ గాచుగా మనల
కవ్వడిదక్క యీ కౌరవావళుల
నెవ్వరు గెల్వలే రీధరాస్థలిని
కూరిమి చెక్కిలి గొట్టితే పాలు
గారెడుబాలవు గదవన్న నీవు
గురు భీష్మ కృప కర్ణ గురుతనూభవులు

సురలతోఁ బోరి మెచ్చులు గన్నవారు
ధార్తరాష్ట్రులు సోమదత్త బాహ్లికులు
వార్త కెక్కిన శౌర్యవరబలాధికులు
శకుని భూరిశ్రవ సైంధవాదులును

మకరాంకవైరితో మార్కొనఁ గలరు
పరువడి నిటువంటి బలియురతోడ
నరుదైన సకలయోధావళితోడ
నేరీతిఁ బోరెద వెట్లు గెల్చెదవు
వీరాగ్రగణ్య యేవిధ మింక ననిన ?

**ఘటోత్కచుఁడు ధర్మరాజునకు ధైర్యముఁ జెప్పుట**

మేనెల్ల నిక్కించి మీసము ద్రీటి
పూని పెల్లుగ నార్చి భుజములు సరచి
ధారుణీపతిమోముఁ దప్పక చూచి
ఈరీతి చింతింప నేలయ్య మీకు
అక్షీణబలశాలి యావాసుసుతుఁడు

యతులఖండించి యరుదెంచు నిపుడె

దుర్జను లగువీరిఁ దునుమ పోఁదరుమ
నర్జనుం డేల? యోధరాధీశచంద్ర
కురుబలంబుల నెల్లఁ గూల్చి నే నిపుడె
మెరువడి నీచేత మెచ్చు లందెదను
వలనొప్ప నే చిన్నవాఁడను మీకు
కలనిలో రిపులకు గాలమృత్యువను
ఈకురుబల మెంత! యెల్లలోకంబు
లేకమై వచ్చిన నేగెల్తు నిపుడె!
కలనిలోఁ జంపక గౌరవాధిపుల
బలిమిచే పట్టుగ బట్టుకవచ్చి
కడిమి మీపాదపంకజములచెంత
బడవైవకున్న మీపట్టిని గాను;
ననుఁ జూడుమని సింహనాదముచేసి
జననాథు ననుమతిఁ జయ్యనఁ గదలి
తనసైన్యములకెల్లఁ దగఁజేయి చూపి
కనలుచుఁ గలనికిఁ గదియించుటయును
ఆయెడ దనుజసైన్యము లేపుమీరి
కో యని దిశలు గగ్గోలుగా నార్చి

సముల్లైన హారిణంపుగుంపులమీఁద
ఱుకించి దుముకు సింగములచందమునఁ
పరుబలంబుల నెల్ల గుంపులు చెరచి
రుసతోఁ జిందరవందర ల్చేసి
డియు నిర్వడియు నేఁబది నూరు వేయి
దివేలమందిని బట్టి యొక్కరుని
టగిట కోరలు గీటించి తలలు
టుకు పటుక్కన పగులంగ గొరికి
టుములౌ హాయములఁ ద్రొక్కి వేదండ
టలశిరంబులు కబళించి నమలి
ర సేనలమీఁద వెగదండ నురికి
రెము ల్బారించి ప్రేవులు దూరి
శములు గరచి రక్తము లూర్పువిడక
శగళఁ ద్రావి బెగ్గడిలంగఁ ద్రేల్చి
ట్టున మెదడులు జుఱ్ఱి మదించి
ట్టుగుట్టున రొప్పి గుండెలు నమలి
నబొమ లుడిపెట్టి గద్దించి గదిమి
నువులు విరిచి సాధనములు పెట్టు

చేసి ఛత్రంబులు చించి ధ్వజంబు
లాసించకుండఁ బోకార్చి శంఖములు
పూరించి బెట్టుగా బొబ్బలువెట్టి
భేరులు మ్రోయించి భీతి పుట్టించి
పగటున చతురంగబలములఁ దరమి
పొగరెక్కి యటు బోకు పోకుఁ డటంచు
వెన్నంటి యరికట్టి వికలము ల్సేసి
మిన్ను పిట్టలుపార మెరిసి యార్చినను
కావు కావు మటంచు గర్ణుఁ డున్నెడకు
వేవేగ గౌరవవీరసైన్యములు
పరతెంచుటయుఁ గాంచి, పావనిపట్టి
శరశరాసనములు సంధించి నిగుడి

కురుపాండవుల యుద్ధము

తక్కక కర్ణునిఁ దా విజృంభించి
పెక్కుబాణంబుల భేదించి పలికె
మాయయ్యలకు నీకు మాయనిపగలు
పాయని క్రోధముల్ బలసి యుండఁగను

గనుపడు వేళల గౌరవకోట్ల
దునుమాడి ధర్మపుత్త్రునిచేత ధరణి
నేలింతు నని మది నేఁ గోరుచుండ
నేల వచ్చితి రిఁక నెందుఁ జొచ్చెదరు
రవిసుత నినుఁ జంపి రారాజుఁ ద్రుంచి
కవిసి దుశ్శాసను ఖండించి శకుని
దునుమాడి తక్కిన దొరల మర్దించి
ఘనవైభవంబులఁ గరిపురి కరిగి
గట్టిగా పాండవాగ్రణికి నే నిపుడె
పట్టంబు గట్టుదుఁ బటుశక్తి మెరసి
అనితనయరదంబు నంటగాఁదోలి
ఘనశిలీముఖములు కర్ణునిమీఁదఁ
గురిపించి పడగలు గొడుగులు సించి
వరధనుర్బాణముల్ వ్రయ్యలుచేసి
యరదంబు సారథి హరులఁ జెండాడి
కరవాలమును పల్క కవచంబు దునిమి[1]

1 కరవాలమును పల్క కవ్వంబు దునిమి (ట)

పరువడి శకుని వెంపరలాడి గదిమి
వరయోధవర్యుల వరుస ఖండించి
యొగి దుస్ససేనుని యుదుటెల్ల నడచి
తెగి విజృంభించు దైతేయునిఁ గాంచి
వేఱొక్కరథ మెక్కి వి ల్లొండు దాల్చి
ధీరత నెదిరి రాధేయుఁ డిట్లనియె
ఓరి నిశాచర యుబ్బాంగ నేల
శూరతచే నెందు చొచ్చిన నిన్ను
బుడియించి ధర్మజు మర్దించి కవలఁ
బడనేసి పాంచాలిఁ బట్టుకపోదు
నని నారసంబుల నతనివి ల్దునిమి
ఘనతరధ్వజము చీకాకు గావించి
గొనకొని యరదంబు గూల్చి దైతేయు
తనువెల్ల జర్ఝరితంబు గావించి
బలముల శరపరంపరల జక్కాడి
తలపడి రథికులతలలు ఖండించి
కవల నారింట నాగ్రహమున నొంచి
కవిసి ధర్మజుమీఁద గమకించుటయును;

అలుక రెట్టించి యాయవనీశ్వరుండు
ప్రళయకాలాంతక ప్రతిమానుఁ డగుచు
పృథివి భేదిల నార్చి పేర్చి మాణిక్య
రథ మొప్ప నెక్కి బల్ రథికులఁ జంపి
రవిసుతుఁ దాకి నారాచజాలముల
కవచంబు విలు తురంగముల సారథిని
చెలరేఁగి యింతింత చిద్రుపలుచేసి
మలసి యొక్కమ్మున మకుటంబుఁ గూల్చి
యొక్కెడునరదంబు లెత్తెడువిండ్లు
చెక్కులు గావించి శిరములు నఱికి
సాయకప్రతతిచే జళుకు పుట్టించి
కాయంబు జల్లెడగండ్లు సేయుటయుఁ;
కలగి రాధేయుఁడు కౌరవాధిపుని
బల మున్నయెడకు నిబ్బరమున బెగడి
తలవీడ పార నత్తఱి దైత్యవిభుఁడు
నిలునిలు మని యార్చి నిగుడి వెన్నంటి
యినసుత పాఁడె ని న్నేలినవాఁడు
గొనకొని నినుఁ గాచుకొనుగానిఁ పిలువు

తలఁప నేవేళ మంత్రములు బోధించు
చెలి వీవు గాపాడఁ జెల్లదె నిన్ను
మీరాజు బెగడ మా మేదినీశ్వరుఁడు
గారవింపఁగ నిన్ను ఖండింతు ననుచు
భాసిల్లు నొకదివ్యబాణంబు దొడిగి
యేసిన మూర్ఛిల్లి యిలఁ ద్రెళ్లె నతఁడు
ప్రకటించి కర్ణుని పాటెల్లఁ జూచి
శకుని దుశ్శాసనుల్ సైన్యంబుతోడ
రథిపేరుగల మహారథికులతోడ
వహికెక్కు నెరయోధవర్యులతోడ
దనుజాధినాథు నెంతయుఁ జుట్టుముట్టి
సునిశితాస్త్రంబుల నోన ముంచుటయుఁ
గనుఁగొని యాఘటోత్కచుఁ డుక్కుమీరి
ఘనతరదివ్యమార్గణజాలవృష్టి
గురియించి బలము గగ్గోలుగా సతికి
కరిహరిరథయోధగణములఁ ద్రుంచి
చేరి యొక్కట దుస్ససేను మర్దించి
ధారుణి నతిరథోత్తములఁ జక్కాడి

వీరాధివీరవహాంవీరులఁ జంపి
కౌరవాధిపునిపై గమకించుటయును;
అవనీశుసోదరు లరువదిమువ్వు
రవిరళధృతి నడ్డమై నిల్చుటయును;
వారినందఱఁ గూల్చి వడి నేఁగుదేర
ధారుణీనాథునందనులు పెక్కండ్రు
గ్రక్కున నెడసొచ్చి గడిసి పోరుటయు;
నక్కుమారులనెల్ల నవలీలఁ దునిమి
సమరాంగణమున మూర్ఛలఁ బడియున్న
ద్యుమణితనూభవ దుశ్శాసనులను
కడువడి శిరములు కబళించిపట్టి
బెడిదంపుఖడ్గంబుఁ బెరికి బెట్టార్చి
కడిమితో గంఠముల్ ఖండింపఁబూని
తడయక మదిలోన దండ్రుల బ్రతిన
దలఁచి యంతట వారితలలు మన్నించి
నలువొంద నొకయోజనప్రమాణంబు
భోరున ద్రిప్పి నంభోవీథి వైచి
కౌరవాధిపుమోముఁ గనుఁగొని పలికె

క్రూరాత్మ! దుర్మార్గ! కుటిలమానసుఁడ!
వీరె నీతమ్ములు వీరె నీసుతులు
వాఁడె నీయనుజుఁడు వాఁడె కర్ణుండు
పోఁడిమి జముఁజేరఁ బోవుచున్నారు;
గొనకొని విడిపించుకో పోదు రమ్ము;
జననాథ నీసాహసంబుఁ జూచెదను
అలగి వీరలఁ జంపునప్పుడుగాక
ఎలమితో నీశౌర్య మెపుడు చూపెదవు
చెలరేఁగి నీవు వచ్చిన పని యేమి?
యులుకుపట్టక నూరకుండుట యేమి?
యీకలుషాత్మకు లీల్గినఁ జేరి
నీకు దుర్మంత్రముల్ నేర్పువా రెవరు?
ఇటువంటి చెలికాని నెడఁబాసి రాజ్య
మెటువలె నేలెద వీబ్రదు కేల?
మావారి మును బలుమాయలఁ గెలుచు
క్రేవసంగరమున గెలువుమీ నన్ను
మున్ను నీ దుర్గుణంబులు చాల విందు
నన్నుంచి యెంత శాంతగుణంబు గలిగె!

దురమున నను డాసి తొడరలేవేని
కరిపురిపై యాస గదలించి చనుము;
అనుచు నుల్లాసంబు లారాజు నాడి
వనజాప్తసుతుని భూవరుసహోదరుని
ఇలమీఁదఁబడిరేని యీల్గుదు రనుచు
నులుకుచుఁ బట్టి వేఱొకచోట నునిచి
శకునిపై దూరి నిశాతబాణముల
వికలంబుచేసిన వెన్నిచ్చుటయును
ఘాతచే నదలించి గర్జించి గోర్చి
నీతిగా దిది నీకు నృపతి చూడంగ
పోదువా? వెన్నిచ్చి పోరిలో నిటుల!
నేదిక్కు నేఁగిన నేల పోనిత్తు
ఆనాఁడు బలుసహాయంబు చేసితివి
యీనాఁడు నినుఁ జావ నిచ్చునె రాజు!
అదిగాక నీకు మేనల్లుఁడు విభుఁడు
కదనంబులో నిన్నుఁ గావఁగా లేఁడె!
పిలువుము యోధుల పిలువు రారాజు
దలవుము నీకులదైవంబు నిపుడె

ఖ్యాతికి నెక్కు సంగరభూమిగాని
తాతయ్య మాయజూదంబులు గావు;
వలనొప్ప ఘోరాహవస్థలి గాని
చలపట్టి పోర నీచావడి గాదు;
పొలుపొందు ఘనశరంబులుగాని నీవు
పలికిన ట్లనె బడ బాచిక ల్గావు
నలువంద దానవనాయకు ల్గాని
బలుమాయలను బన్ను పాండవు ల్గారు;
పోరు పోకిట రొందఁ బోయిన నిన్ను
చీకాకుపరచక చేగాచి విడువ;
నని పల్కి ఘోరదివ్యాస్త్రంబుఁ దొడిగి
గొనకొని రథముపై గూల నేయుటయు
గనుఁగొని గురుఁడు గంగానందనుండు
కనలి మిక్కిలి ఘటోత్కచునిపై దాకి
విలు ద్రుంచి యరదంబు వికలము ల్చేసి
చలమున హయముల సారథిఁ దునిమి
ఘనతరదివ్యమార్గణములు చొనిపి
దనుజేంద్రు దేహ మంతటను నించుటయును

పవనతనూజునిపట్టి పదునాల్గు
భువనము ల్గలఁగ నద్భుతముగ నార్చి
కాలాంతకుని లీల గద యొక్క చేత
శూలంబు నొక చేత సూటిగాఁ బట్టి
గురుభీష్మకులమీఁదఁ గ్రోధించి గడిమి
వరమంత్రయుతముగా వైచె; వైచుటయు
నవి రెండు చండమార్తాండ తేజముల
వివిధాగ్నిలీలలు విస్ఫులింగములు
గ్రక్కుచు దశదిశల్ గ్రమ్మి యే తేర
మక్కువఁ గాంచి భీష్మద్రోణు లపుడు
గరుడపావకరౌద్రకమలాప్తకులిశ
వరుణపన్నగమేఘవాయుబాణములు
నిగుడింప నవి యెల్ల నీఱు గావించి
తెగువ నేతెంచిన దివ్యాయుధములు
గనుఁగొని గురుఁడు గంగానందనుండు
జననాథుసోదరు ల్జగతీశ్వరుండు
గురుతనూభవకృపుల్ కుంభినీధవులు
పరువడి భగదత్తబాహ్లీకముఖ్యు

లవిరళ దివ్యశస్త్రాస్త్రము ల్గొనుప
నవిరోళ్లఁ బొడిసేసి యరుదెంచుటయును;
అదిరోళ్లఁ బరికించి యాచార్యుఁ డుదిరి
యిదె మహాప్రళయంబు లేతెంచె నింక
వడి నాయుధంబులు వాహనంబులును
విడిచి కరంబులు వెస ముకుళించి
యెదురుగా నిలిచిన యీసేన లన్ని
బ్రదుకుట నిజము శౌర్యముఁ జూపఁ జెల్ల
దని యొలుగెత్తి సైన్యంబులఁ జాటి
జననాథురథముపైఁ జంగున దాటి
కౌరవాధీశుని కర మప్పళించి
ధారుణి లంఘించి తగ నిల్చుటయును;
చిటిముడివడి యోధశేఖరు లెల్ల
దుటుకున నరదముల్ దుమికి సేన
లటువలె గరితురంగాయుధావళులు
పటుగతి విడిచి చొప్పడ నిల్చుటయును
నతిరయంబున సమ్మహాయుధద్వయము
ప్రతిభ నేతెంచి శుంభద్దీప్తి మించి

బాలాతపములీల బలములమీఁద
కీలలు బర్వించి కేడించి మఱలె
దనుజాధినాథుఁ డంతటఁ బోక గెరలి
ఘనరథ మెక్కి సత్కాండాసనంబు
కరమున సంధించి కాండజాలముల
గురురాజుమకుటంబు గూలంగ నేసి
గంగాతనూజు నొక్కట స్రుక్కఁజేసి
సంగరంబున రెంట సైంధవు నొంచి
గుర్వుని మూడింట గర్గోలు గావించి
గురుసుతు నాల్గింట గుదియఁగా నేసి
దారుణంబుగ భగదత్తు నేనింట
నాఱింట బాహ్లికు నని దూలసేసి
కృపు నెన్మిదింట భూరిశ్రవు పదింట
నృపసహోదరుల పూనికల నేనూట
నలుకమై నేసి సైన్యము నుగ్గుచేసి
మలసి యాశకునిపై మరలి క్రోధించి
చలపట్టి రథముపైఁ జంగున దూకి
తలద్రెంప గమనించు తముకంబు గాంచి

యరదంబు నూకి డాయంగ నేతెంచి
కురురాజుఁ గనుఁగొని గురుఁ డిట్లు పలికె;
మనుజేంద్ర యీ మేనమామ యవస్థ
దనుజాదినాథు నుద్దండంబు జూఁడు
సాగవు మనసాహసంబు లిచ్చోట
ఏగతి నిది మాన్ప నెవ్వరివశము
కోపంబు చాలించి గురుబంధుజనులఁ
గాపాడి నిను నీవ గాచుకొ మ్మింక
చేరి రక్కసునితోఁ జెలిమి వాటించు
పోరాటములు మాని పురి చేరవలయు
పడుచు పాపఁ డటంచుఁ బాటించవలదు
పిడుగు కొంచెంబైన బెడిదంబె గాదె
ఈ వరభోజనాధీశ్వరు నెంచ
నానాటి రావణు వంతటి మేటి
యనిన నంతయు నిశ్చయం బని వెగడి
తనమది చింతించి ధరణీశ్వరుండు
తనయులు హితులు బాంధవులు సోదరులు
ఘన యోధవర్యులు గలనఁ గూలుటయు

దనుజనాథుని గెల్వఁ దరముగా దనుచు
మనుజవల్లభుఁడు వేమరు దలంపుచును
మదమున లంఘించి మగటిమి డించి
యుదుటు దొలంగించి యుబ్బు దగ్గించి
యరదంబు దుమికి చయ్యన తలవాంచి
పరువడి నెడ సొచ్చి భళి యని మెచ్చి
కరము కరంబున గబళించిపట్టి
సురవైరి వదనంబు జూచి యిట్లనియె

**దుర్యోధనుఁడు ఘటోత్కచునితో సంధి యొనర్చి పాండవులకుసహాయుఁడై పోవుట**

అనఘాత్మ మీకు సహాయంబుగాఁగ
జను దెంచువారితో సాహసం బేల
కాదుగా పాండవకౌరవు లనెడు
భేద మే మున్నది! ప్రేమ నూహింప
నొగి వారు మేము నీ కొక్కట గాదె!
పగవానివలె నెంత పనులు జేసెదవు
మలసి యుద్ధముచేయ మా మీఁదఁగాక

బోలుపొంద దూరము పోయివచ్చెదవె
చను నింటగెల్చి రచ్చల గెల్వవలయు
ననెడిసాటువ నిజ మాయె మాయన్న
ధనపతిమీఁద యుద్ధమునకు మనము
చనుటకు నీదివ్యశరకౌశలంబు
నీసాహసప్రౌఢి నేఁజూడవలసి
మాసైన్యముల నెల్ల మరలింపనైతి
నిన్ను నీశౌర్యంబు నీకౌశలంబుఁ
గన్నులపండువగాఁ జూచినాఁడ
మాయయ్య వౌదువు మాఁయురే! మేలు
నీయంత ఘను లవనీస్థలిఁ గలరె!
యని ఘటోత్కచుఁ దన యక్కునఁ జేర్చి
తనవంగశకునిపైఁ దమకంబు మాన్పి
దనుజవీరునితోడఁ దనసేనతోడఁ
జని ధర్మతనయునిచరణాబ్జములకు
గరిమతో మ్రొక్కిన గని ధర్మసుతుఁడు
వరుసతో దీవించి వారి కందఱికి
సరసలీలల నుపచారము ల్చేసి

ధర ప్రీల శంఖనాదంబు పూరించె
తతశక్తి ధర్మనందను నాజ్ఞఁ బూని
యతివేగ నుభయసైన్యంబులు గదలె
శరజాస్త్రతనయదుశ్శాసను ల్మార్చు
లరయంగ దెలిసి విహ్వాలచిత్తు లగుచు

మొలకసిగ్గులు మొగంబుల నావహింపఁ
దలలు వంచుకయున్నఁ దగ నిరీక్షించి
గురుసూనుఁ డగ్గల నర్కుని సుతుఁ గాంచి
విరుగుట దిరుగుట వీరుల కెల్లఁ
గలదు నీతరమునఁ గలుగునే కర్ణ[1]

అల ఘటోత్కచుని సాహసముఁ జూచితివి
నెలవుగా మాబుద్ధి నిజమాయె నింక
ములును దాకఁగఁగాని మొగ్గ రెవ్వారు[2]
వాటకంబుగ మించి నాడరా దనెడి

---

1. విరుగడ తిరుగడ వీరులకెల్ల
   గలదు నీతెరగున గల్గినే కర్ణ (క)
2. ములును దాకినఁగాని మొగ్గ రెవ్వారు (చ)

మాట యొక్కటి గాక మఱియొండు గలదె
పొలుపొందఁగా మించిపోయిన సిగ్గు
తలపోసి కొన్న నెంతయు రాదు వినుము
పెక్కుమాటలు వేర్చి ప్రేలెడువాని
కెక్కుడిసిగ్గు నీ కేల చింతింప
పొగరు నుద్దండంబుఁ బుట్టక యుండ
సుగు లడంగించె పక్షివల్లభుండు
నిలుపుము శాంతంబు నీతిధర్మంబుఁ
దలఁపుమీ యింక నైనఁ దలవాకె నంత
అనుచుఁ జిల్లులు వోవ నాడినమాట
లెనయంగ చిలుకులై హృదయంబు గాఁడి[1]
వెనకముందఱఁ జూచి వికలంబు నొంది
వినియును విననట్లు వెస నేగుటయును

నలకూబరుఁడు యుద్ధమునకు సన్నద్ధుఁడగుట

అక్కడ సకల సైన్యసమేతుఁ డగుచు
జక్కులరాపట్టి చనుదెంచుటయును

1. లెనయంగ ములుకులై హృదయంబుగాఁడి (క. చ)

దుర్వార శౌర్యసందోహ ప్రచండ
గర్వితారి మదేభకంఠీరవుండు
భీమబలాఢ్యుండు భీమసేనుండు
భూమి తల్లడమంద భుజగేంద్రుఁ డదర
తారలు ద్రుళ్ల దిక్తటము లల్లాడ
ఘోరున శంఖంబుఁ బూరించుటయును;
తనమది సుప్పొంగి తమకించి ధర్మ
తనయుండు నాగకేతను నిరీక్షించి
అదె విను భీమశంఖారావమిదియు
కదనంబు చాల నగ్గల మయ్యెనేమొ
పదపదం డని బెట్టు పలికిన వేగ

ధర్మరాజు భీమునొద్దకు వచ్చుట

గదలి యాభీముని గడియఁగా నేఁగి
తనకు మ్రొక్కిన వాయుతనయుని గ్రుచ్చి
యొనరఁ గౌఁగిటఁ జేర్చి యుప్పొంగె రాజు
పావని యప్పు డాపాంచాలిపుత్త్రి
భావించి సంతోషభరితుఁడై చూచి

యరదంబు డించి నెయ్యమున లాలించి
తరుణికి గమలముల్ దండలు గూర్చి
గురుతుగా నొకకొన్ని కొప్పున నునిచి
మరికొన్ని చిత్రదామములు గూర్చి
కరుణతో నిఖిలాంగకముల నమర్చి

అరవిందముఖమతు లంగీకరించి
కవల ఘటోత్కచుఁ గౌఁగిట నలమి
కువలయాధిపుఁ జెంతఁ గొలిచియున్నంత

అమరావతిలో నర్జునునకు నారదుఁడు భీమునకును గుబే
రునకును సంభవించిన యుద్ధము సంగతిని దెల్పుట.

తిలకింప నమరావతీపురంబునను
బలుదెఱఁగుల దిశాపతులు గొల్వఁగను
తొలుగక రంభాది తోయజాననలు
నలువున చెలరేఁగి నాట్యము ల్సలుప
నాక గంధర్వ కిన్నర యక్ష గరుడ
రాకేందుముఖులు పరాకులు దెలుప
వాలి మీఱంగ జయంతుఁ డర్జునుఁడు

మ్రొలఁ గూర్చుండి యామోదింపుచుండ
వలనొప్ప బలువైభవంబులతోడఁ
గొలువున్న సురరాజు కొలువులోపలను
నరుని వీక్షించి యానారదమౌని
వెరవొప్ప నందఱు వినఁగ నిట్లనియె
నరనాథ పవమాననందన యతఁ
గరుడ దానవులకుఁ గదనంబు గలిగె
నది విని మీయన్న యనుజులతోడ
ముదవతితోడ భీమతనూజుతోడఁ
జనుచున్నఁ గురుపతి చయ్యనఁ గదలి
యనిచేసి పిదప సహాయుఁడై యేఁగె
నలకూబరుండు సేనలఁగూడి వచ్చి
కలహంబుఁ గావింపఁ గడిసి యున్నాఁడు
బలుకయ్య మగుఁగాని పరిపాటి గాదు
అలకాపురముచెంత కరుగు పొమ్మనిన

అర్జునుఁడు ధర్మరాజాదులకడ కేఁతెంచుట

నమరేంద్రునకు మ్రొక్కి యాపాండుతనయుఁ

డమితవేగమున రథారూఢుఁ డగుచుఁ
జనుదెంచి సాష్టాంగవిధు లాచరించి
భీమసేనాచార్య భీష్మాదులకును
సామోదమున వందనాదు లమర్చి
తివిరి పెద్దలచేత దీవన లంది
కవలు మ్రొక్కిన వేడుకల గారవించి
యంచితం బగు తన యరదంబుమీఁద
పాంచాలపుత్త్రినిఁ బటుగతి నునిచి
సురపతి యొసఁగిన సుమదామకములు
చిరమణిహారముల్ చిత్రాంబరములు
కరుణతో నొసఁగి వేడ్కల నాదరించి
ధరణీశు చెంతఁ బంతము మీర నిలిచె
ఆసమయంబున యమతనూభవుఁడు
భాసిల్లు కిన్నరపతిసేనఁ జూచి
తమబల మున్న చందము విలోకించి
యమరనదీసూను సానబ్జంబుఁ
గనుఁగొని మ్రొక్కి యోకరుణాపయోధి
ఘనయక్షరాక్షస గరుడగంధర్వ

బలముల రథికుల బరికింపు మయ్యె
కిల కొట్టుచును దమకించు చున్నారు
మోసము రానీక మున్నె కన్గలిగి
యీసైన్యముల నెల్ల నేర్పాటుసేయు
బలువిడి సేనాధిపతివి నీ వగుచు
నిలిచినకార్యంబు నెరవేఱు దేవ;
అన విని గాంగేయుఁ డౌఁగాక యనుచుఁ
దన రారునట్టి పదాతివర్గములఁ
గనుఁగొని మొన నలగోలు గావించి
ఘన యోధవరులఁ జెంగట భద్రపఱచి
హరులను నిరుకోపులందు నమర్చి
కరులను బార్శ్వభాగంబులఁ జేర్చి
కరిసైంధవపదాతిగణముల చెంత
సురవైరి గురుసుతార్జునుల నేమించి
వారిచెంగట ద్రోణ వనజాప్తతనయ
భూరిశ్రవుల నద్భుతముగా నునిచి
వారికిఁ బ్రాపుగా వలనొప్పఁ గవల
మాయతి బాహ్లిక మగధుల నునిచి

ధారుణీధవుల మధ్యమ్మున నునిచి
వారక నెరయోధవర్యుల నెల్ల
మోపైన తావుల మొన లేర్పరించి
యాపాండవాగ్రణి కావిధం బంత
గనిపించి విజయశంఖంబుఁ బూరించి
ధనువు మ్రోయించి సాధనములఁ బూని
పనుపడ సేనాధిపతి తానె యగుచు
మొన నిల్చియుండె తెంపును బెంపు మిగుల
నలకూబరుండు దానవనాథుబలము
చెలరేఁగి యాశ్చర్యచిత్తుఁడై చూచి
చెంగటఁ జేరి మచ్చిక గొల్చియున్న
జాంగలు వదనాంబుజము గాంచి పలికె
అన్న కంటివె దానవాధీశుబలము
లున్న చందంబు నాయోధులతెఱఁగు
గమకించుచున్నారు కదనంబునకును
కమలంబునకును నొక్కండు వచ్చి యెంత
పని చేసె నటువంటిబవాలుయోధవరులు
మొనచేసినారు సముద్రంబువోలె

ఆవీర యోధుల నలఘు తేజంబు
భావింపఁ గన్నులపండు వయ్యెడిని;
మానవులే యని మసలఁగా వలదు
నీ నేర్పుఁ జూచెద నెర యోధవరుల
బలముల సేనాధిపతుల నేర్పఱచి
కలనికి యరిమొనగా నిల్పు మనినఁ
జని సర్వసేనల సమకట్టి నిలిపి
ఘన భేరికాహాళఘంటికారావ
ముల బెట్టుగా మిన్నుముట్ట మ్రోయించి
కలఁగి పద్నాల్గు లోకములు భేదిల్ల
తరుచుగా సింహనాదములు సేయించి
నిరుపమాటోపుఁడై నిఖిలసైన్యముల
పేరైన యోధుల పేరులు వాడి[1]
భోరున కలనికిఁ బురికొల్పుటయును
భీష్మప్రతాపజృంభితశౌర్యధనుఁడు

1 a. పేరైనయోధుల పేరులు చాపి (క)
b. పేరైనయోధుల పేరులఁ జీరి (చ)

భీష్ముఁ డుద్ధతి రణభేరి వేయించి
ఘనసైనికుల నెల్ల కదనంబునకును
గనలుచు వేవేగ గవయించుటయును
నురువడి నీరీతి నుభయబలంబు
లరుదార మార్కొను నాసమయమున
భేరులు దశదిశల్ భేదిల్ల మొరసె
దారుణసింహనాదములు సెలంగె
కరిబృంహితములు వెక్కసముగాఁ గూడె;
హరిహేష లద్భుతంబై నింగి నిండె;
వరరథనేమిరావము లుర్విఁ బర్వె;
గురుతరకోదండగుణగుణధ్వనులు
వెలసి పరాగంబు వినువీథిఁ గప్పె;
నిల తల్లడం బంది నెలగోలు గవిసె
వీరు వా రని యింత వివరింపరాని
పోరు ఘోరం బయ్యె భూతలాధీశ!
భల్లంబులను మించి పట్టిసంబులను
కెల్లుబ్బి నురికి మిక్కిలి దానిపెద్ద
బల్లెములను గ్రుమ్మి బాకులఁ జిమ్మి

పెల్లుగా గదలచే ఛేదించి భిండి
వాలమ్ములను గూల్చి వడినేగి ముసల
జాలమ్ములను మోది చక్రసంఘముల
నడుములు ఖండించి నరములు ద్రెంచి
తొడలు ఛేదించి కుత్తుకలు నుగ్గించి
కరములు ద్రుంచి వక్షములు నూటాడి
సరభసప్రతిభలచలమునఁ గినిసి
పొదలి ఖడ్గాఖడ్గి పోరెడివారు
యెదిరి ముష్టాముష్టి నేసెడివారు;
బాకులచే గ్రుచ్చి బరులు ప్రేవులును
చీకాకుఁ గావించి చెండాడివారు;
చూరీలచేకఠారీలచేతఁ
జెరిచి చిందరలుగా జేసెడివారు;
కడు మెరుంగుల చివ్వగడలచే బొడిచి
తడయక చెంగున దాటెడివారు;
జిగి పెద్దయీటెలచే గూదు ల్గ్రుచ్చి
పగటున దూరము పడఁజిమ్మువారు;
తెగువతో సురియల తగనేసి డాసి

లగువుల దవ్వుగా లంఘించువారు;
చేరి పెద్దకటాన్లచే కొద్ది గ్రుమ్మి
కేరి చివ్వున గుప్పళించెదువారు*
ప్రేలుచు క్రొవ్వాడి పిడెముల నూని
లీలమీరంగ చౌకళించెదువారు;
భోరున పొడిచినపోటు గండ్లబడి
దూరి యావలదాటి దూపెసువారు;
గుంపులు నొంటిగా గోరించువారు;
గుంపుగా నొక్కని గ్రుమ్మెడువారు;
నివల కవ్వాల నుంచి యేతెంచువారు;
నవల కివ్వాల నుంచి యరుదెంచువారు;
నాథ పరాకయ్య ననుఁజూడు మనుచు
యోధావళుల మీఁద నురికెదువారు;
తలలు ఖండించి వింతగ నెగవైచి
కిలగో యనుచు నార్చి చేయెత్తువారు
అరుదొంద కల్లిల్లి కార్భటుల్చేసి

* కేరి. చివ్వన గుప్పగించెదువారు (క)

విరిగి పోదువుం డని వెన్నంటువారు
నలకూబరుం డేడి నరపతి యేడి
పొలియింతు మని చొచ్చి పోరాడువారు
నలకూబరుఁడ నేనె నరపతి నేనె
తలసి నిల్వుఁ డటంచు మార్కొనువారు
తేజీల తేజీల ధే యని నూకి
నేజలచే గ్రుమ్మి నిగుడి వెన్నంటి *
పాటించి రౌతును బల్లంబు హయము
వేటూరుదునెలు గావించి భేదించి
కో యని యార్చి కగ్గోలుగా నరికి
హాయి! బాబు! శబాసు! రని వ్రేలు గరచి
అటె సివేముస్తైదు లరి మురి ద్రుంచి
తుటుములపైఁ జొరఁ దోలు రావుతులు
గజముల గజముల గజిబిజి గొనఁగ
నిజభుజాబలశక్తి నిగుడి కవ్వించి

* a. కేజలచే గ్రుమ్మి నిగుడి వెన్నంటి (క)
b. తేజలచే గ్రుమ్మి నిగుడి వెన్నంటి (ప)

కొమ్ముకత్తుల మొనకొమ్ము లాడించి
యిమ్ముల కురికించి యేపు గల్పించి
హేరాళ జయకాంక్ష లిచ్చలఁ బొదల
వారక పోరు మావంత వర్గములు
పదరుచు హయముల భటులపై నురికి
తుది చాపకట్టుగాఁ ద్రొక్కించువారు;
మొగముల నరుకుల మురియుచుఁ జొచ్చి
మొగి హల్లకల్లోలముగ నార్చువారు;
కెల్లుబ్బి హయముల కేడించి తగ్గి
చిల్లాడముల కొద్ది చిమ్మెడువారు;
నూకించి గజముల నొదికల బడఁగఁ
జేకొద్ది జముదాళ్లఁ జెండెడివారు;
తెగువ సామంతులఁ దెగటార్చువార
లగుచు నెక్కొందె మహారణభూమి
అప్పుడు గాంగేయుఁ డమరేంద్ర సుతుఁడు
తప్పక చూచి యుద్దండకోపముల
భోరున శరదముల్ బోనిచ్చుటయును
మారుతి ద్రోణుండు మార్తాండసుతుఁడు

శకుని బాహ్లికులు సైంధవకృపులు
నకులుఁడు నాచార్యనందన సోమ
దత్తులు రథము లుద్ధతి బోవ నిచ్చి
మత్తిల్లి బహుఘోరమార్గణంబులను
దురుసుగా నెడలేని తోఁపుగా వాన
గిరులపై వర్షించు క్రియను బర్వించి
తఱమిమి తురగవేదండసంఘముల
గరుడుల యక్షుల గంధర్వవిభుల
నరభోజనులను గిన్నరకులాధిపులు
పురుడింపరాని కింపురుషశేఖరుల
రథికుల దొరల సారథుల మావతుల
రథకేతనచ్ఛత్రరథ్యసంతతుల
ఖండించి దండించి గనెలు గావించి
చెండాడి ఛేదించి చిద్రుపలు చేసి
సమయించి తెగటార్చి చంపి మర్దించి
తుమురులు గావించి త్రుంచు నవ్వేళ
ఇవి కరు లివి హరు లివి రథావళులు
ఇవి ఛత్రసంఘము లివి కేతనంబు

లివి ముక్కు లివి చెవు లివి మస్తకంబు
లివి పక్క లివి పిక్క లివి భుజాలతిక
లివి హస్తపద్మంబు లివి కాళ్లటంచు
నవయవభేదంబు లరయంగరాని
సంగరం బొనరించు జనపాలవరుల
బొంగుచు ధననాథపుత్త్రుండు గాంచి
సారె సారెకు మౌర్వి సారించి దివ్య
నారాచ మంకించి నయనాంబుజముల
మినుకైన మినుగుర్లు మెండుగా రాల
తనయోధవరులతోఁ దద్దయుఁ బలికె
మాయన్నలార యామానవాధిపులు
సేయుకయ్యములు వీక్షించితి రిపుడు
ఆరూఢి మీరు యక్షాధీశుతోడ
సారె పల్కినప్రతిజ్ఞలు చెల్లవలయు
మసల సామాన్యపు మానవు ల్గారు
కసిదీర యుద్ధంబు గల దింత దరికిని
ధవళవాహనుఁ డల్లతాళకేతనుఁడు
దివురుచుఁ గెరలి నాదిక్కు చూచెదరు

వారితో నేఁబోరవలయు వేగంబె
ఘోరాజిఁ జీరికి గొనరెంతవారి
రణభూమి తక్కినరథికులతోడ
గణుతింప నని గెల్వఁగాఁ దగు మీరు;
అని తనసారథి నదలించుటయును
గనుఁగొని యాచిత్రగాత్రుఁ డి ట్లనియె
అనఘాత్మ మానవు లన నెంత నీకు
పనుపులు చేత దిక్పతుల గెల్చితివి
తెలిసి పిచ్చుకలపై దివ్యనారాచ
ములఁ బూనఁ దగవౌనె! మోహనాకార
కనలి కోపింప లోకప్రభుల్లారు
నిను మ్రోవ పనిగల్గెనే నేను గలుగ
మనుజుల దనుజుల మర్దించి వత్తు
ననుఁ జూడు మానవనాథులఁ జూడు
మని పల్కి గంధర్వు లర్వదికోట్లు
'కినుకతో నడువ గాంగేయుని దాఁకె
కరకరకదనభీకరులైన గరుడు
లిరువదికోట్లు బెంపెక్కి యేతేర

చెలఁగి కవ్వడిదాఁకె చిత్రసేనుండు
నలువదికోట్లు పద్మాలుగు వేలు
కిన్నరబలముతోఁ గేయూరభుజుఁడు
చెన్నొందఁగా భీమసేనుని దాఁకె
దిశలు భేదిల నార్చి తెగి విజృంభించి
దశకోటియుతు లుద్దండత నడువ
మణికేతనుఁడు దాఁకె మార్తాండసుతుని
రణభయంకరపరాక్రమ బలాన్వితులు
ఘోరసాహసు లారుకోట్లదైతేయ
వీరులతో పృథ్వి జలింపఁ గదలి
ఘోటకాసురుఁడు దార్కొనియె నాచార్య
ఘాటిగా బహుచతుర్దంతులతోడ
ననుపమ జయసాహసాంకుఁడై మీఱు
కొనియె జయంతుండు గురుతనూభవుని;
ముప్పదికోట్ల కింపురుషులతోడ
నిప్పులు గ్రక్కుచు నిరుపమశూల
ధారియై సిగుడి మార్తాండకేతనుఁడు
ఈవసంబునను బాహ్లికునిఁ దాఁకె;

తక్కిన యట్టియోధులు యోధవరులు
తక్కక దాఁకి యుద్ధము సేయుచుండ
నాసమయంబున నంబుధు ల్గలఁగ
భాసురదశదిశాభాగము ల్వ్రీల
మహితశౌర్యుఁడు హిడింబానందనుండు
బహుభేరి తమ్మటపటహానిస్సాణ
దాంధణ దంధణ ధణధణంధాన
బంధురారావముల్ పరఁగ మ్రోయించి
అతిబలోద్దండదైత్యాదినాయకులు
హితులు నెచ్చెలికాండ్రనేకులు గొలువ
కరకరి నొరసి సంఖ్యల కెక్కుడైన
కరిసైంధవపదాతిగణములు నడువ
జని మహోద్ధతి యతుసైన్యంబు దాకి
గనలి దానవకోటి గవియించుటయును;
మేటిరక్కసు లుక్కుమీరి యయ్యతు
కోటుల ఘోరరక్షోబలంబులను
గరుడసైన్యముల జీకాకుగాఁ జంపి
వరుసతో గంధర్వవరులఁ జెండాడి

కిన్నరసేనల గీటణఁగించి
పన్నుగా వారణప్రతతులఁ దునిమి
పాలుపొందునట్టి కింపురుషులఁగూల్చి
నలకూబరునిమీఁద నడ తెంచుటయును

### జాంగళుఁ డొనర్చిన యుద్ధము

ఆవేళ జాంగళుం డధికరోషమున
వేవేగఁ జని దైత్యవీరులఁ జూచి
రణదక్షు లగు నతిరథమహారథుల
గణనకుమీఱిన కరితురంగముల
దానవవర్గానవదళములమీఁద
పూనికఁ గదియించి భోరునఁ గదలి
ఘనతూర్యభేరిశంఖములు మ్రోయించి
వనదముల్ గిరులపై వర్షించులీల
చండకాండములచే సకలసైన్యములఁ
జెండాడి చట్టలు చీల్చి గర్జించి
కాండలు దునిమి పక్కలు చక్కుచేసి
గుండెలు కలిచి ముక్కులు చెక్కువైచి

తొడలు పాదంబులు తునియలుచేసి
నడుములు మెడలు భిన్నములు గావించి
మెండైన రథికుల మేదినిఁ గూల్చి
మండలాధీశుల మదము లణంచి
సురవైరిపై నంపసోనలు నించి
ధరవ్రీల సింహనాదములు సేయుటయు,
వరభయభ్రాంతి నిల్పఁగ లేక బెగడి
పరువెత్తెనరదైత్యబలము నల్గడల
కడువేగ తురగసంఘంబులు జరిగె
నెర యోధవర్యులు నీల్గిరి ధరణి;
అలిగి యంతట బోక సాజాంగలుండు
బలువేగ ధారుణీపతులపై శక్తిచె
కనుఁగొని యాఘటోత్కచుఁ డేపుమీఱి
మొనఁజేసి నిజసైన్యములఁ బురికొల్పి
రాకురాకుఁ డటంచు రహి నార్చి పేర్చి
దీకొని నిల్చి గద్దించి పల్కుటయు;
తమకించి కుదగజేంద్రములపైఁ బొదలి
గమకించి దుముకు సింగముల చందమున

మొనసి రాక్షససైన్యముల జొట్టుముట్టి
ధనువులు దివ్యసాధనములు గూల్చి
పరువడి గొడుగులు పడగలు డుల్చి
యరదము సారథి హయములు నల్చి
రథచక్రవితతి ధరాస్థలిఁ గూల్చి
రథికశేఖరుల బీరము లణఁగించి
యరిమురి సురవైరి కడ్డమై వచ్చు
వరదైత్యపతుల పద్మాల్గుపద్మముల
బెట్టుగా పీనుంగు పెంటలుచేసి
కట్టల్కతో ఘటోత్కజుమకుటంబు
పొట్టు గావించి నేర్పున విల్లు ద్రుంచి
దిట్టఁడై కవచ మిం తంతలు చేసి
హయసారథులతోడ నరదంబుఁ గూల్చి
రయమున జనుదేర రాక్షసేశ్వరుఁడు
వేరొక్కరథ మెక్కి విల్లొండు దాల్చి
నారాచ మొక్కటి నారి సంధించి
సారవైశ్వానరసదృశుఁడై మండి
ధీరుఁడై బాంగలు దిక్కు వీక్షించి

ఓరి యతాధమ యోగి నిన్నుఁ బట్టి
ఘోరబాణంబులఁ గూల్పక విడువ
నని యార్చి యేసిన నమ్మహాశరము
ఘనరత్న మకుటంబు ఖండించుటయును ;
సురవైరి మఱికొన్ని సునిశితాస్త్రముల
హరులను నరదంబు నవనిపైఁ గూల్చి
సారథి మడియించి చక్రము ల్దుంచి
ఘోరాస్త్రముల మేను గుదిగొన నేసి
యూనిన యరదంబు నొగి నుగ్గుచేసి
పూనిన విం డ్లెల్ల పొట్టు గావించి
కడకతో ఖండించి కాండజాలమును
నడిమికి రెండేసి నఱికి చెండాడి
యతనికి నడ్డమై యరుదెంచునట్టి
శతకోటియతుల చక్కు గావించి
మన్నుగా నెదసొచ్చు పదియాఱుకోట్లు
కిన్నరశ్రేష్ఠుల గీటణఁగించి
మొనసొచ్చి పరతెంచు ముప్పదికోట్లు
ఘనసిద్ధసాధ్యుల గనెలు గావించి

గరుడుల పదికోట్లఁ గరకరి జంపె
పరగగంధర్వులఁ బదికోట్ల దునిమి
ఏయుట తొడుగుట లెఱుఁగ రాకుండ
సాయక వృష్టిచే సకలసైన్యముల
గదిమిపారఁగ దోలి గద్దించి యార్చి
యెదు రెవ్వరును లేమి యేచి జాంగలుని
గదిసి మించులు గుల్కు కాండ రాజమున
నెద దూర నాటించి యిలఁ గూలనేసి
కనలుచు మొల నున్నఖడ్గ మంకించి
యొనర కంఠము ద్రెంచ నుంకించుటయును;

— నలకూబరుని యుద్ధము —

నలకూబరుండు దానవనాథుఁ గాంచి
యులుకుచు నొకవీతిహోత్రబాణంబు
నారి సంధించి దానవనాథుమీఁద
ప్రారూఢిమంత్రపూర్వకముగా నేయ
ఘనతరవిస్ఫులింగప్రకాండములు
పనుపడ దశదిశాభాగము ల్నిండ

రవిసహస్రప్రభాభాజితం బగుచు
పవనజాతనయుపైఁ బరతెంచుటయును
నరుఁ డది గాంచి తా నారాచ మొక్క
వరుణాస్త్రమున ద్రుంచి వైచినఁ గెరలి
నలకూబరుం డింద్రనందనుమీఁద
నలుక రెట్టించి బ్రహ్మాస్త్రంబు సొనిపి
నలువంద వాయుబాణంబు సంధించి
బలుక్రోధమున దైత్యపతి నేయుటయును
సురరాజసూనుండు సురనదీసుతుఁడు
సరగున నాదిత్యశరము వీక్షించి
యవలీల బ్రహ్మనాగాస్త్రజాలముల
నవి రెండు వారింప యక్షేశసుతుఁడు
గంగాతనూజుపై గరుడాంబకంబు
బొంగుచు నరునిపై భూధరాస్త్రంబు
పవననందనుపట్టిపై మేఘశరము
తివిరి పెల్లార్చి గద్దించి యేయుటయుఁ
అరసి భీష్ముండు రౌద్రాస్త్రంబుచేత
గరుడసాయకమును ఖండించి వైచె

కులిశమార్గణముచే గురుతనూభవుఁడు
పొలియించె నప్పు డాభూధరాస్త్రంబు
గంధవాహాశరంబు గాండీవి పూని
కంధరాశుగము వ్రక్కలు సేయుటయును
రూఢిగా బ్రహ్మశిరోనామకంబు
గాఢవిస్ఫూర్తుల గాండీవిమీఁద
ప్రాకట దివ్యనారాయణాస్త్రంబు
భీకరప్రతిభచే భీష్మునిమీఁద
కలితోగ్రచండాంధకారబాణంబు
సొలవక నాచార్యసుతునిపైఁ జొనిపి

ఘటోత్కచుఁడు గూలుట

చలమున నలిరేగి శక్తి సంధించి,
యలఘుటోత్కచునిపై నలయించి యేసె
వంచింపక కిరీటి వైష్ణవాస్త్రమునఁ
ద్రుంచె నాబ్రహ్మశిరోనామకంబు
నగణితంబైన నారాయణాస్త్రంబు
నిగిడి తచ్ఛరమున నిలిపె భీష్ముండు

హరిదశ్వశరమున నంధకారాస్త్ర
మరుదుగా దునుమాడె నాచార్యసుతుఁడు
గురుఁడు మహాదివ్య ఘోరబాణములు
బరిపిన నవియెల్ల భగ్నము ల్సేసి
కమలభవాండము ల్గలఁగ మార్తాండ
రమణమై చని శక్తి రాక్షసేశ్వరుని
ఫాలంబు దాఁకిన పక్షముల్ విరిగి
శైలంబు గూలిన చందంబు దోఁప
పొలదిండి మూఁకలు భూతలాధిపులు
గలగి బెగ్గిల ఘుటోత్కచుఁ డిలఁ ద్రెళ్లె
తనతనూభవుపాటు ధననాథుతనయు
ఘనతరోద్దండవిక్రమశక్తి గాంచి

భీముని యుద్ధము

యనిలతనూభవుం డశ్రుసంఘములు
కనదుగ్రవిస్ఫులింగముల కాండములు
పెనఁగొని కన్నుల బెట్టుగా రాల
ధనువస్త్రచయము రథంబుపై వైచి
నిట్టూర్పువేడుముల్ నిగిడి యుప్పొంగ

ధట్టించి యలదండధరుఁడో యనంగ
గిరినుండి యిలకు లంఘించి యేతెంచు
హరికిశోరములీల నరదంబు దుమికి
యదలించి బొదలి కో యని యార్చి పేర్చి
గద కెరద్వయమున కబళించి నడచి
చని మహోద్ధతి యక్షసైన్యంబు దాఁకి
మునుమున నెదిరిన మొనల ముట్టాడి
రథికసారథుల ధరాస్థలిఁగూల్చి
యధికవేగంబున నరుదేరఁగాంచి
నలకూబరుఁడు ఘోరనారాచతతుల
చలమున ములుదూర్ప సందు లేకుండ
కాయ మంతయు నించఁగా నవి సడ్డ
సేయక గని భీముసేనుఁ డాఘనుని
రవికోటి సంకాశరమణీయరథము
నవలీల రేణువులై రాల మోదె
అట మున్న రాజరాజాత్మజుం డుదిరి
దుటుకున నరదంబు దుమికి పోనురికి
వేరొక్కరథ మెక్కి వెస జన నదియు

ఘోరగదాహతి గూల్చి మోదుటయు
ధననాథుసూనుఁ డంతకుమున్నె దుమికి
చని యొక్కరథ మెక్కి చయ్యన నడువ
ధీరుఁడై భీముఁ డాతేరుపై నుఱికి
భోరున్న నొగలంట బొసఁగ సంధించి
గిరగిరఁ ద్రిప్పి మిక్కిలి పైకి నెత్తి
కరకరి భగ్నంబుగా ధాత్రి మోదె
అట మున్నె దాటి యక్షాధీశుపట్టి
పటువేగమున నేఁగ పవమానసుతుఁడు
అర్చుచు నాతని యరదంబుమీఁద
గూర్చుండనీయక గోరించుటయును
యక్షరాక్షసయోధవరు లఱువదికోట్ల
యక్షతనయున కడ్డ మేతేర
తమకించి తనగదా దండఘాతమున
నిమిషమాత్రంబున నీరు గావించి
నలకూబరుని మీఁద న్నడువ నా ఘనుని
జెలికాండ్రు పది కోట్లు శితసాయకముల
బరపి మార్కొనిన నాబలియుర నెల్ల

ధరఁగూల్చి నడుమ గంధర్వులు వాల్గు
కోటులు గ్రమ్మిన గోరించి మోది
ఘోటకంబులఁ గూల్చి కుంజరఘటలఁ
గరకరి వధియించి గద ద్రిప్పుకొనుచు
వరబలోద్దండుడై వచ్చుచుండఁగను
దనుజుల యక్షగంధర్వులఁ గూల్చి
వనజముల్ గైకొన్న వాఁడితఁ డనుచు
దెప్పరంబైన భీతిని దల్లడిల్లి
చప్పుడుల్ చాలించి చలములు డించి
చతురంగబలము లచ్చట నిల్వ వెరచి
పతి నొప్పగించి నిబ్బరమున నరిగె
అంతట నాకుబేరాత్మజుం డలిగి
పంతంబుతో సార్వభౌముపై నెక్కి
పవనతనూభవుపై గవియింప
గవిసిన నామత్తకరిమీఁద దూరి
పటుగదాహతిని కుంభస్థలం బవియ
వ్రేటువేయఁగ చండవేదండంబు బెగడి!*

* వటువ్రేయ చండవేదండంబు బెగడి.

కళవళమంది ఘీంకారము చేసి
తలకి రొక్కించుక దవ్వరుదెంచి
అత్తరి కెలి వొంది యాదిగ్గజంబు
మత్తిల్లి భీముపై మరలి యేతెంచి
కరమున గట్టిగాఁ గబళించిపట్టి
చరణముల్ గదియించి చలము రెట్టించి
కొమ్ముల గేడించి కుమ్మిన నతఁడు
పమ్మి తుండంబులోపల నింత చెలికి
జిలిబిలి రావాలువుచేఁ జిక్కి వెడలి
యలరారు చండమార్తాండుని లీల
దప్పించి మరలించి ధైర్యంబు మించి
గుప్పున గదకొద్ది గుమ్మి పోనీక
వాల మంకించి యావరణముల్ ద్రిప్పి
వేలారువిధముల వేధలు పెట్టి
పాదముల్ తుండంబు బంధించి ధాత్రి
మీఁద నెంతయు పిల్ల మెరముగా నూకి
దీనత్వ మొందించి దిటము దూలించి
పోనీక సర్వాంగములు గుద్ది వైచె

నలకూబరుండు నంతకు మున్నె కలఁగి
తొలఁగి వేదండంబు దుమికిపో నురికి
గురుదివ్య రథ మెక్కి కోదండ మొకటి
ధరియించి ఘనగుణధ్వనిచేసి కదిసి
ఖరశరాసారముల్ వర్షించుటయును
కరిహరిరథయోధగణములు గ్రమ్మి
అంతట జాంగలుం డతిమూర్ఛఁ దెలిసి
యంతకు గతి నట్టహాసంబుచేసి
పరువడి యేతెంచి పవనజు దాఁకి
సురు విరాంబకముల సోనలు ముంచె
అడరి నియంతుఁ డత్యంత వేగమున
కడుసార్వభౌముఁ డగ్గరఁ జేర నేఁగి
మస్తకంబు కరంబు మహితాంగకములు
మస్తరించుచు దువ్వి మదము గల్పించి
ధైర్యంబు తమకంబు దర్పం బవార్య
శౌర్యంబు చలము రోషంబు దెప్పించి
పదరుచు గజరాజుపై నెక్కి నిక్కి
కదిసి భీమునిమీఁద గవియించుటయును

యానుకు వేట్లాడు టది నీతి యగునె![1]
అని వారి వారించి యక్కునఁ జేర్చి
చనువున నొక కొన్ని సఖ్యముల్ నెరపి
వెస భీష్మునకుఁ జాల వినయముల్ చేసి
పొసఁగ యుద్ధమున కుప్పొంగుచున్నంత;
నెందుఁ జూచిన నేల యీనిన లీల
పొందుగా జలధు లుప్పొంగి పెల్లుబ్బి
పొలుప వెల్లిగ వచ్చు పోలిక దనర
బలువిడి గెరలి నిబ్బరమున నడుచు
సకలసైన్యోద్ధూతసాంద్రపరాగ
నికరంబుచేఁ బయోనిధులు గలంగె
గిరిసుతవహియించె ఖేదమోదములు
హరుఁడు మున్నగఁ దాల్చె నాత్మలోఁ జింత
రవిచంద్రతారకారాజికి మిగుల
నవిరళం బైన మార్గాయాస మొదవె
మొనసి యహోరాత్రములుఁ గానఁబడక

1 యానుక వేట్లాడు టది నీతి యగునె (త)

ఘనతరగాఢాంధకారంబు గప్పె
భేరికాహాళశంఖప్రభృతుల డమామి
కారావములకు బ్రహ్మాండము ల్పగుల
కరిఘటఘంటికాకలితఘీంకార
గురుఘోషణములకు కులగిరు లురలె
పరువడి వరవీరభటసింహనాద
హరిహేషలకును దిగంతము ల్వణఁకె
చతురంగవాహినీ సంయుతుఁ డగుచు
నతివేగమున వచ్చె నబ్జలోచనుఁడు
కని ధర్మజుఁడు మహాకౌతుకం బడరఁ
దన సహోదరులును దా నెదురేఁగి

హరి పాండవులకు సహాయము వచ్చుట

మ్రొక్క నుద్యోగించు మురవిభేదనుని
గ్రక్కున నక్కునఁ గౌఁగిటఁ జేర్చి
పొలుపొంద వినుతించి పూజలుం జేసి
బలరాముఁ గని చాల ప్రణుతించి పొగడి
పలుమరు తనగూర్చు బంధవర్గములఁ

కలయఁ గన్గొని క్రమక్రమమున మెలఁగె
భీమార్జునాదులు ప్రేమ నేతెంచి
రామకృష్ణులకు మర్యాదమార్గమున
పేర్మితో వందనప్రియభాషణముల
నర్మిలి విహరించు నాసమయమునను ;
శమనతనూజుండు సంతోష మంది
కమలనాభునిమోముఁ గనుఁగొని పలికె
తలిదండ్రి వీవె మాదైవంబ వీవె
చెలికాఁడ వీవె మాజీవంబు నీవె
మరదివి నీవె మాధర్మము ల్నీవె
వరదుఁడ వీవె మావాఁడవు నీవె
అరయంగ పాండుజనాధినాయకుఁడు
నీరజలోచన నినుఁ జూపి చనియె
ఆపద ల్దొలగింప నఘములు వాప
చేపట్టి రక్షించి చెక్కిలి సరచి
వెలయుబుద్ధులు చెప్ప వేడ్కలు నెరప
సలలితం బగు బహుసంపద లొసఁగ
శుభములు చేఁకూర్ప శూరులుసేయ

ప్రభువులు గావింప భయములు మాన్ప
పావనపుణ్యసంపన్నులఁ జేయ
నీవె కర్తవుగదా! నిఖిలలోకేశ!
జలజాసనునకైన శక్యంబు గాదు
తిలకించి మిమ్ము ప్రార్థింప నాతరమె!
రవిరాజనేత్ర! శ్రీరమణీకళత్ర!
వివరింతు నొకవార్త వినుచిత్తగించి
పరగ సౌగంధికప్రసవంబువలనఁ
గరకరిమధుబిందుకలహంబు పుట్టె
ధననాథుఁ డతిశౌర్యధైర్యప్రతాప
ఘనబలాధికశరక్రమకౌశలుండు;
నతనికి ప్రాపుగా నళికలోచనుఁడు
చతురంగబలశక్తి చనుదెంచినాఁడు!
కమ్మపూవిల్తుని గన్న మాయయ్య!
నెమ్మితో మముఁ బ్రోవ నీవు వచ్చితివి
గాంగేయుఁడును మీరు కవగూడి ఘోర
సంగరంబునకును సకలసైన్యముల
నడిపించి జయము గనందగు ననినఁ

దడయక హరి ధర్మతనయున కనియె
జననాథవర ! మీకు సాధింపరాని
పను లున్నవే ధరాభాగంబునందు ?
నను జన్ములు సహాయు లతిబలోన్నతులు
తనయులు చండప్రతాపవిక్రములు
గురుఁడు మహాయోధ గురుతనూభవుఁడు
గురుశౌర్యుఁ డతిధైర్య గుణనిధి కృపుఁడు
బల్లిదుఁ డగుభీష్ము ప్రతిభ యెంచినను
నెల్లలోకంబుల నెవ్వరు గలరు ?
పరశురామునియంత బలశాలి నెదిరి
దురమున గెల్చి కీర్తులు గొన్నవాఁడు
పొంకింపఁగా భీమపుత్త్రుఁ డానాటి
లంకాధిపతియంత లావరి నిజము
అతనిదీ టనవచ్చు నర్జు నాత్మజుని
శతమఖాత్మజు నెంచ శక్యమేగాదు
ప్రతిభ కెక్కిన బలభద్రుఁడున్నాఁడు
అతిధైర్యధనుఁడు సాత్యకి యున్నవాఁడు
బహువైభవమున ధనపతియంతవాఁడు

అహో రాజకేతనుఁ డరుదెంచినాఁడు
కురుపాండవుల జతకూడి యుండఁగను
దుర మొనరింప యింద్రున కైనఁ దరమె
పెక్కు యోచనలేల పృథ్వీతలేంద్ర
యెక్కువ పనులకు నే నున్నవాఁడ

— కర్ణకృష్ణ సంవాదము —

అనిన భానుతనూజుఁ డంభోజనాభుఁ
గనుఁగొని రౌద్రుఁడై గద్దించి పలికె
భళిభళి! మేల్మేలు! పంకజనయన
కులశీల బలశౌర్యగుణశాలి వగుట
తెలిసె నీ కిన్నియుఁ దెలియ రెవ్వారు!
పొలవక నెంత శ్రేష్ఠుఁడ వైతి వీవు!
నిన్న నే దాసరి నేఁడె రాగంబు
నిన్నెరుంగుదు నేఁగు నీరదవర్ణ!
బండాటములుచేసి ప్రజలు దిట్టంగ
కుండలతోఁ దిని గొల్లలయిండ్ల
దొంగిలి కొంటెబుద్ధులు కొన్ని నేర్చి

యంగనామణుల బాయని రట్టుఁజేసి
మసలుచు నావులమందల నున్న
పసులగాపరి నెరబంటు నే మెఱుగు
నెందెందుఁ జూచిన నిటువంటిచెడుగు
మందబుద్ధులుగావె మందగొల్లలకు
నెంచితి వౌర! నీ వీయోధవరుల
మంచిదె తారతమ్యము లెఱుంగుదువు
ముందర కయ్యంబు మొనసి యున్నయది
యందరి నేఁజూతు నప్పుడు నజ్జూడు
వీరశేఖరుఁ డెంచు వీరశేఖరుని
పారుబోతు నుతించు పారుబోతులను
నీవీరమర్మంబు నీబలప్రతిభ
నీవిక్రమస్ఫూర్తి నే నెన్న నేల?
వడినంటి తరిమి పర్వతము లెక్కించి
జడియఁదోలినజరాసంధుఁ డెఱుంగు
కదిసిపోనీక ఘనగహ్వరముల
కదరఁ దోలినకాలయవనుఁ డెఱుంగు
నింతలో మరచితివే కృష్ణ నీవు!

పంతంబు గల నెరబంటవు గనుక
తలపోయ నీకును దగినట్టివారి
పలుదెఱంగుల మెచ్చి ప్రస్తుతించితివి
అన విని రోషించి యమరేంద్రసుతుఁడు

అర్జునుఁడు కర్ణుని దూషించుట

వనజాప్తనందనువదనంబుఁ జూచి
ప్రేలనిచ్చిన మరి ప్రేలెదు క్రొవ్వి
చీలల్ల నీ కేల సిగ్గు లేదాయె!
నీచాత్మ యెవరు దండించిన వినవు
కోచకూతలు రేఁగి కూసెద వేల?
అతఁడు జగత్కర్త యతఁ డాదివిష్ణుఁ
డతఁడు సన్మునివంద్యుఁ డతఁ డప్రమేయుఁ
డతఁ డఘదూరుఁ డనంతుఁ డచ్యుతుఁడు
అతని దూషింప నీకర్హమె మూర్ఖ!
మగటిమిగల దొడ్డమగవానివలెనె
పొగరెక్కి నీ వేల పొంగెద విపుడు?
చలమున నాఖడ్గశక్తికి నిన్ను
బలిపెటకున్న నీప్రజ్ఞలు మాన

వని కేల కరవాల మంకించు విజయుఁ
గనుఁగొని కనుగిల్చి గద్దించి నిల్చి
ఖరకరనందను గౌఁగిటఁ జేర్చి
కరము సంధించి పంకజనాభుఁ డనియె
అనఘాత్మ రాధేయ యసహాయశూర

కృష్ణుఁడు కర్ణునిఁ బొగడుట

యనుపమాటోప నీకాగ్రహం బేల?
వరుస నే దెల్పినవారల నెల్ల
వరయోధులై యుండ వచియింపఁగల్గె
హరునకు నీకు దీ టనుచు నే నిన్ను
ధర నుతించక యుంటి తప్పేమి నాదు?
శంకరునకు నీకు సమమైన యుద్ధి
పంకజాప్తతనూజ ప్రధనరంగమున
పాయక హరు నెదుర్పడ నీవు దక్క-
నీయోధవరులలో నెవ్వరు గలరు?
ఈవాహినులును యిఁక మాటవలేల
నీవారు మే మెల్ల నిరుపమాటోప

రయమున హరు రాజరాజును గెల్చి
జయలక్ష్మి చేకొని సత్కీర్తివడయు
మన విని కర్ణుఁ డత్యంతమోదమున
కనకాంబరుని మోము గనుఁగొని పలికె
నలినలోచన జగన్నాథ శ్రీకృష్ణ
చెలువంద నీవు మెచ్చినవాఁడె ఘనుఁడు
క్రొవ్వున గొన్నిపల్కులు పల్క నన్ను
కవ్వడి నినుఁ జూచి కాచితి నతని
రాజీవనాభ విక్రమశక్తి నిపుడు[1]
నేఁజెప్పఁగలబుద్ధి నీవె చెప్పితివి

కర్ణుఁడు భీష్మద్రోణాదుల దూషించుట

కలక దోలంగ సత్కరుణ వాటిల్లె
బలుపైన దోకవిన్నపంబుఁ దెల్పెదను
గురుడుఁ దుర్మార్గుండు గురుసుతుఁ డల్పుఁ
డరయ భీష్ముఁడు వారికంటెను పెంకె
కడు కృపాచార్యుఁడు కపటమానసుఁడు

---

1 రాజీవనాభ యాశ్రితభక్తి నిపుడు (ట)

తోడరి యీదుష్టచతుష్టయం బెపుడు
బలువిడి నాబాహుబలశౌర్యగరిమ
వలనొప్పఁ జూచి యోగ్వఁగజాల రనఘ
యెందుకు పనికిరా రీనీచమతులు
నిందింతు రెంతటి నెరయోధనైన
కుటిలోక్తులకు నేను కొరగాను నాదు
పటుశక్తి గని మెచ్చి పనిగొనవలయు
పన్నగభూషణు బలిమి నాబలిమి
కన్నులపండువుగాఁ జూతుగాని
నెదురుమీరఁగ నన్ను నీవెంట దోడ్కొ-
చనుమన్న హర్షించి జలజలోచనుఁడు
గురుకృపాదులను మక్కువ సన్నుతించి
సురనదీనందను జూచి యిట్లనియె
గాంగేయసందడి కయ్యంబు గలదు
గంగాధరునిమీఁదఁ గర్ణునివెంట
నాసైన్యములు నేను నడిచెద మిపుడె
నీసేనలును నీవు నృపులు యోధులును
ధననాథుమీఁద యుద్ధమునకు జనుఁడు

కనలుచు సకలలోకము లేకమైన
హరుని మీమీఁదికి నరుదేర నీఁడు
పొరిది కర్ణుని లావు చూడుము నీవు
సురుచిరంబుగ మిమ్ముఁ జూచు కర్ణుండు
నరసురల్ సేయక నని సల్పవలయు
నందు నిందును గల యఖిలరాజన్యు
లందరు మీవెంట నరిగెడువారె
యన విని వినుతించి యంజలి చేసి
యనుమోద మొదవ గంగాత్మజుం డనియె
కమలామనోహర! కమలాయతాక్ష!
కమలదనిభవర్ణ ! కమలాంకవినుత

### భీష్ముని వచనము

ఖగవాహనారూఢ! గజరాజవరద!
నగధర! వైకుంఠనాయక! కృష్ణ!
కర్ణుఁ డెవ్వాఁడు గంగాపుత్త్రుఁ డెవఁడు
వర్ణించి చూచిన వాహిను లెవరు
చదరంగబలములు సమకట్టినటుల

కదనంబునకు మీరు గదియించినారు
హరుఁడు నేర్పరిమీర లధికు లంతకును
తిర మొంద బారులు దీర్చితి రిపుడు
గెలిచిన నోడిన కీర్తులు మీవె
తిలకింప మీమాయఁ దెలియువా రెవరు?
లోకేశ! మీయాజ్ఞలో నుందు మింతె
గాక స్వతంత్రముల్ గలవార లెవరు?
వలనొప్పఁగా భక్తవత్సలబిరుదు
తలకొని శరణాగతత్రాణబిరుదు
గలదేవుఁడవు నీవు గావె శ్రీకృష్ణ!
కలనైన మీదాసగణముల కెల్ల
జయముగా కిల నపజయ మేల గల్గు?
భయ మేల గలుగు నోపరమాత్మ యనిన
భావించి హరిభీష్ముఁ బరికించి పలికె
నీవు నావాఁడవు నేను నీవాఁడఁ
గాని యన్యులమే జగన్నుతచరిత!
భానుసూనుఁడు నొవ్వఁబలికినపలుకు
లొకయింత మదిలోన నుంచఁగా వలదు

సకలసేనలఁ గూడి సమరంబుచేసి
భువనముల్ వినుతింప భుజశక్తి మెరసి
యవలీల గెల్చి రమ్మని సెల విచ్చి
రాధాతనూజుకరంబు చేపట్టి
యోధావళుల కెల్ల నొగి చెయిచూపి

కృష్ణుఁడు యుద్ధమునకు సన్నద్ధుఁ డగుట

ప్రముఖులపై యదుబలముల నెల్ల
తమకంబుమీఱ నుద్ధతి గదియించి
కాంచనాంబరుఁడు దిక్తటము లల్లాడ
పాంచజన్యంబు దాఁ బరఁగ మ్రోయించె
అమరనదీసూనుఁ డందఱఁ జూచి
తమకంబు గినుక సందడిగొనఁ బలికె
పురుహూతసుత వాయుపుత్త్ర యాచార్య
గురుతనూభవ కృపకురుకులాధీశ
శకుని దుశ్శాసన సైంధవ నకుల
సకలభూపతులార! జలజలోచనుని
ఘనతరసంగ్రామక్రమవాక్యసరణి

వినినారుగద మీరు వీనుల కోలఁది ?
కదనరంగంబునఁ గదిసినవేళ
పదపడి మీబాహుబలశరప్రౌఢి
ఘనపరాక్రమశక్తి గాన నయ్యెడిని
యనుచుఁ జేతులు జాపి యఖిలసైన్యముల
పరువడి యక్షాదిబలములమీఁదఁ
బురికొల్పి శంఖంబుఁ బూరించుటయును ;
అక్కడ ధననాథుఁ డావిధం బంతఁ
గ్రక్కునఁ గాంచి శంకరున కిట్లనియె
గౌరీమనోహర ! కంటివే యిపుడు
నీరజనాభుఁడు నీమీఁదఁ గదలె

శంకరకుబేర సంభాషణము

వలనొప్ప పాండవవాహినీవితతి
నలిరేగి యుప్పొంగి నామీఁద నడిచె ;
గొదకొని హరిణంపుగుంపులఁ గాంచి
పొదలెడు గబ్బిబెబ్బులి విధంబునను
దానవేంద్రుండు మదోద్దండుఁడై కెరలి

వూని కోపున మించి పొంచుకున్నాఁడు
ఎవరిపై దూకునో! యేకార్య మగునో!
యెవరిఁ జెండాడునో! యెఱుఁగరా దింక;
పరమాత్మ! దీని కుపాయ మే మనిన
నరవాహనునిఁ గాంచి నాగకంకణుఁడు
బెదరేల నీకు కుబేర నే నిపుడె
యదుకులాగ్రణి మీఁద నరుగుచున్నాను.
నలినలోచనునకు నాకు పెన్నుద్ది
తిలకింప నతని మీఁదిక్కు రానీను
బలువిడి పాండవబలములమీఁద
తలపడి నీవు యుద్ధముచేసి గెలువు
నరునితో నీవును నలకూబరుండు
సురనదీసూనుతోఁ జోడు గావలయుఁ
గాకున్న నొరులతోఁ గాదు పోరంగ
చేకొని గంధర్వసేనలతోడ
గణుతికి నెక్కురాక్షససేనతోడ
ప్రణుతింప కిన్నరబలములతోడ
వీరయోధులతోడ వెక్కసంబుగను

భైరవుఁ డిదె దైత్యపతిమీఁద నడుచు,
నని పల్కి సెల విచ్చి యఖిలసైన్యముల
గనుఁగొని చేపిచి గదియించుటయును ;
నుభయబలంబు లిట్లొగిమారుకొనిన
రభసంబు లయ్యె తురంగహేషలును
భేరికానిస్సాణభీకరకాహ
ళారావముల్ పద్మజాండంబు నిండె ?
కరిరథఘంటికాఘణఘణంఘాణ
గురుతరధ్వనులు దిక్కులు పిక్కటిల్లె
తలపడి పోరు నత్తరి నెన్నరాని
బలుకయ్య మయ్యె నాబలముల కెల్ల
నీటెల బల్లెల నిలుగుదుల్ గ్రుచ్చి
తాటుచు దూటుచుఁ దలపడువారు
కత్తుల కత్తుల కకవికల్గాఁగ
హత్తి మత్తిల్లి చెండాడెడివారు
గదలచే గదలచేఁ గదలక నిలిచి
యదలించి కదిసి యేట్లాడెడివారు
బెడిదంపు పిడెములఁ బిడెములఁ దొడరి

యడరి కేడించి పోట్లాడెడివారు
పంకించి బాకుల బాకుల చికిలి
వంకిళ్ల వంకిళ్ల వరుస గ్రొవ్వాడి
చూరీల చూరీల జొచ్చి ఛేదించి
చీరి డొక్కలు చించి చెండాడువారు
బలమును జలము నిబ్బరము నగ్గలము
బొలుపంద నందంద బోరాడువారు
నెలకొని చికిలి పన్నిదమాడునటుల
నెలమి కోలాటంబు లేయు కైవడిని
యలరార బిళ్లద్రిప్పాడినకరణి
నలముక చిడుగుడు లాడెడిసరణి
జలధులు జలధులు సరిబోరునటుల
చలమున సమరంబు సల్పు నవ్వేళ
కనకాంబరధరుండు కర్ణునిమోముఁ
గనుఁగొని చాల వక్కాణించి పొగడి
అల్లదె గనుఁగొను మయ్య రాధేయ!
మొల్లముగా మినుముట్టి యున్నదియా
విహితప్రదీప్తుల వృషభధ్వజంబు

అతఁడె లలాటాక్షుఁ డతఁడె శంభుండు
పదరుచు శంకరుపార్శ్వభాగముల
గదలక నిలిచి యుగ్రప్రతాపముల
సొలవక నీదిక్కె చూచుచున్నారు
కలితతేజోనిధి క్రౌంచభేదనుఁడు
వీరభద్రుండును విఘ్నేశ్వరుండు
వీరలతోఁ ఘోర విస్మయం బనిన
కమలాప్తతనయుండు కలకల నగుచు
కమలనాభునిమోము గనుఁగొని పలికె
పన్నగశయన! నాబాహుబలంబు
కన్నులపండువుగాఁ గనుంగొనుము.
మదగజేంద్రంబుల మలసి పోనీక
కొదమసింగంబు దాఁగోరించులీల
ప్రమథసేనల యక్షబలముల నెల్లఁ
దెమలింతు నిపుడె నాతెగువ వీక్షింపు

నరిది పరాకుసేయక నన్నుఁ జూడు[1]
నిఖిలమునిస్తుత్య నిగమాంతవేద్య!
అఖిలాండకోటిబ్రహ్మాండకుటుంబ
వైకుంఠనిలయ! గోవర్ధనోద్ధార!
శ్రీకరగుణమూర్తి! చిన్మయమూర్తి!

దానవకులశిక్ష! ధవళాంబుజాక్ష!
మానితగుణజాల! మదనగోపాల!
అప్పుడు మిమ్ము నే నాడినయట్టి
తప్పులు మన్నించి దయఁబ్రోవు నన్ను
మన్నగా సుతుఁ డెన్ని పలిమినఁగాని

కన్నతండ్రికి ముద్దు గాదె శ్రీకృష్ణ
నావిని నవ్వి దానవకులాంతకుఁడు
వేవేగ గర్ణుని వీక్షించి పలికె
మాయురె! మేల్మేలు! మార్తాండతనయ
నీయెడ నాయెడ నేరము ల్గలవె
నీవేమి నేనేమి నెనరైన మేన

1 పరవసేయక నన్ను పాటించి చూడు (ట)

బావవు తగువైన బంధుండ వీవె
పెద్దవు వరుసను బిన్నను నేను
తద్దయుఁ దండింప ధర్మము గాదె;
పాయక నేకమై బహునాళ్లనుంచి
మీయయ్య నేనును మెలఁగినవాఁడ ;[1]
తగవు లెంచక నిన్ను తప్పు లెన్నుదునె
యింక నే నొక్కటి యెంచెద వినుము
శంకరుతో నీవు సమరంబు సేయ
సన్నుతికెక్కిన సాహసు లచట
నున్నారు తగదయ్య యొంటిగా నేక
బలభద్ర సాత్యకి ప్రముఖులతోడ
బలువిడి నేతెంచి బవరంబు సేయు

---

1 మీయయ్యలోన నే మెలఁగినవాఁడ
పాయని యన్యోన్యబాంధవద్వేష
లై యున్న కుముదకంజాప్తుల మెపుడు
గదురెండు రెండును గన్నులు గాఁగ
నెడపక వీక్షించి నేకంబు సేతు

మన విని నవ్వి కంజాక్షునిమోము
గనుఁగొని పలికె నాకమలాప్తసుతుఁడు
మురదానవాంతక ! మున్నె యీయోధ
వరులెల్ల వినఁగ దుర్వారప్రతిజ్ఞఁ
బలికితి శంకరప్రముఖులౌ యోధు
లెలమి నాజోఁడంటి నీఁక మాట లేల ?
శంకరుతో యోధచయములతోడ
పంకించి గెలిచిన ప్రబలు నాకీర్తి
తెగి నన్ను వారు సాధించిరే నీవు
పగ దీర్పుదువుగాని పంకజనయన
నను సంతరించిన నరవరోత్తముఁడు
గనుఁగొని మెచ్చ విక్రమముఁ జూపెదను
ననుఁజూడు, ప్రమథాదినాథులఁ జూడు
మని పల్కి, సకలసైన్యములు ఖేదిల్ల
విలుగుణధ్వనిచేసి, విఘ్నేశుఁ దాఁకి
యలఘుబాణంబుల నతని నొప్పించి
వీరభద్రుని రెంట వికలంబుసేసి
తారకారిని శరత్రయమున నొంచి

నలువందఁ జండీశు నాల్గింట నేసి
యలరుచు భృంగీశు నైదింట గ్రుచ్చి
తక్కినరథికులదర్పంబు లణచి
యొక్కువ బలములనెల్ల భేదించి
బారులు చీకాకుపడ జెండివైచి
తేరులు కూల్చి గద్దించి డీ యనుచు
కరుల నేలణఁగించి ఘనుల బోఁ దరిమి
హరుల నీరుగఁజేసి యార్భటల్జేసి
అంగజహరుని డాయంగ నేతెంచి
పొంగి వైశ్వానరభూరిసాయకము
నరుదార గంధపుష్పాక్షత ధూప
వరమంత్రయుతముగా వైచె; వైచుటయు
వెరగంది వీక్షించి వీరభద్రుండు
వరుణాంబకంబుచే వహ్నిబాణంబు
తుమురులు గావించి దోశ్శక్తి మించి
యమరులు భేదిల్ల నార్చి కోపించి
యిన నందనుని దాఁకి యిషుపరంపరల
పనుపడ గరిదూరి పారనేయుటయు;

రౌద్రుఁడై కర్ణుండు రహి నార్చి వీర
భద్రునియరదంబు పడగయు విల్లు
తురగసారథులతోఁ దునియలు సేసి
గరకరి మేనెల్లఁ గాడ నేయుటయు ;[1]
పరువడి యవ్వీరభద్రుండు గెరలి
సురలు ఖేదిల్ల శేషుఁడు తల్లడిల్ల
పటపట బ్రహ్మాండభాండము ల్పగుల
ఘుటఘుటధ్వనిచేసి కో యని యార్చి
కరవాలమును బల్కఁ గైకొని రోష
భరితుఁడై భానుసంభవు నిరీక్షించి
తలవాంచి ఖడ్గంబు తళతళ మనఁగ
ఝళిపించి రథముపై చంగున దుమికి
కుప్పరం బెగసి దిక్కులు నిరీక్షించి
యుప్పొంగి యదువీరయోధుల దరిమి
సముదగ్రరథరథ్యచయములతోడ
కమలాప్తనందను ఖండించుటయును ;

1 కరకరి మేనెల్ల గడియ నేయుటయు ; (ట)

భావించి కర్ణునిపాటెల్లఁ జూచి
భావజజనకుండు పాంచజన్యంబు
పూరించి రథికులఁ బురికొల్పుటయును ;
ధారుణి వణఁక నుద్దండవేగమున
జని బలప్రద్యుమ్నసాత్యకి ముఖ్య
ఘనయోధవర్యు లొక్కటఁ జుట్టికొనినఁ
గాంచి భృంగీశ్వరగణనాయకులను
క్రౌంచభేదనముఖ్యరథికశేఖరుల
ప్రధనజయాకాంక్షప్రౌఢి నేతెంచి
పృథ్వి భేదిల నార్చి బెట్టు దాఁకుటయు ;
నడరి కోపించి తాలాంకుఁ డవ్వేళ
తోడఁబడి గణనాథుఁ దొడరి పోరాడె
భద్రవిక్రమకళాప్రౌఢిచే వీర
భద్రునిఁ దాఁకి సౌభద్రుండు పోరె
సాత్యకి చెలరేఁగి షణ్ముఖుతోడ
నత్యంతబలశక్తి నని సల్ప నపుడు ;
నందికేశ్వరుమీఁద నడిచెఁ బుష్కరుఁడు
కందర్పరిపుఁ దాఁకె కమలలోచనుఁడు

తక్కిన యట్టి యోధులు యోధకోటి
యక్కజంబుగఁ బోర నాసమయమునను ;
అక్కడ కౌరవయక్షసేనలకు
మిక్కుటంబై పెచ్చి మించె కార్యంబు
జక్కులతేనికి సవ్యసాచికిని
నుక్కమీఱిన మహాయుద్ధంబు గలిగె
నలువందగా భీష్మనలకూబరులకు
బలిమైన కయ్యంబు ప్రకటించి మించె ;
నెలకొని ద్రోణ మణి గ్రీవులకును
గలితమహోగ్ర సంగ్రామంబు చెల్లె ;
మలయు నశ్వత్థామ మణిమంతులకును
నలరు నుదగ్ర జన్యము సంభవించె ;
రథిక శేఖరులకు రథికోత్తములకు
ప్రధనమగ్గలముగా బలసె నవ్వేళ ;
కనలి కిన్నరదైత్యగరుడగంధర్వ
ఘనచమూవితతి రాక్షససేన దాఁకి
లలిమీఱ తిలతండులన్యాయమునను
గలసి భయంకరగతిఁ బోరుపునపుడు

అలఘుతేజోమూర్తి యైనభైరవుఁడు
జలజభవాండముల్ జడియ ఘోషించి
నిప్పులు దుమికెడు నిఖిలాంబకములఁ
గుప్పించి బలము జక్కులుచేసి డాసి
బలువిడి సేనాధిపతుల ఖండించి
చెలరేఁగి రాక్షసశ్రేష్ఠులఁ ద్రుంచి
మారుతాత్మజునికుమారుసిఁ దాఁకి
క్రూరతగండభేరుండధ్వజంబుఁ
దునుమాడి విలు రెండుతునియలు చేసి
యనుపమాటోపుఁడై యరదంబుఁగూల్చి
తనువెల్ల జర్ఝరితంబు సేయుటయుఁ;
దనుజనాథుఁడు మదోద్దండుఁడై కెరలి
గగనంబు మెరయంగ గాయంబు పెంచి
తెగువచే దిశలెల్ల భేదిల్ల నార్చి
భైరవుపాదము ల్బంధించిపట్టి
ఘోరున మిన్నంత పొడవుగా నెత్తి
గుప్పించి ధరణిపైఁ గూలఁగా మోది
యుప్పరం బెగసి మహోగ్రుఁడై మండి

వినువీథి దానవవీరులతోడ
ఘనఘనాకారముల్ గైకొని నిలిచి
పట్టుగాదశదిశాభాగంబునందు
దట్టంపుచీకటుల్ దార్కొన మించి
మినుకైన యడిదంపు మించుట మించి
యొనరసార్భటులును నురుములు నురిమి
పురుహూతుపాపంబుఁ బోలినయట్టి
వరశరాసనము చెల్వమునఁ జేపట్టి
కరకరినావర్తకాలమేఘములు
వరుస కుంభద్రోణవర్షము ల్గాఁగ
గురియుచందంబున ఘోరతరోగ్ర
శరవర్షములు ముంచి చలము రెట్టించి
పిడుగులవానలు బెడిదంపు నారి
యడిదంపువానలు నద్రులవాన
లురుతరభీతి నాయుధములవాన
లరిమురి గురియించి యధికుఁడై మించి
యొకచోట హసియించు నొకచోటఁ గేరు
నొకచెంత గర్జించు నొకట గద్దించు

నొకక్రేవఁ బలు రొప్పు నొకదిక్కు నార్పు
నొకచెంకి నదలించు నొకపజ్జఁ గదుము
పేరుపేరులబిల్చు పేరెముఁల్వారు
భోరుభోరునదూరు భుజములు సరచు
మసలి వర్తిలు పెక్కుమాయలు పన్నుఁ;
కసివోక మరియు రాక్షసకులేశ్వరుఁడు
బలిమి కిన్నరయక్షప్రముఖసైన్యములఁ
బొలియించి పెస నొక్కప్రోవు గావించి
మేటియోధలనెల్ల మేదినిఁ గూల్చి
దీటైనరథికులఁ దెంపునఁ జంపి
తక్కిన దొరుల యోధలరథోత్తముల
పెక్కుమార్గణముల ఛేదించుటయును;
కరులేఁగె హయములు గదలె కాల్బలము
పరువెత్తె రథికులు పారిరిదిశల
తరుచుగా నున్న వేదండగాత్రముల
మరుగుల నడఁగిరి మావంతకులము
హయకళేబరముల నటునిటుఁ ద్రోచి
రయమున దూరిరి రాహుత్తతతులు

సలలితరథచక్రచయములక్రింద
నళుకుచుఁ జొరబారి రథికయోధలును
బెదరుచుఁ బీనుంగుపెంటలలోన
నొదుగుచు డాగిరి యొగి వీరభటులు

### ఘటోత్కచుడు శివునితో యుద్ధంబు సేయుట

అంతట. బోక నయ్యసురవల్లభుఁడు
కంతువిద్వేషిపై గమకించుటయును ;
కనలి శంభుఁడు పినాకం బెక్కుపెట్టి
వనధు లింకఁగ గుణధ్వనిచేయుటయును ;
ఘనరోషచిత్తుఁడై గణనాయకుండు
వినుతప్రతాపుఁడై వీరభద్రుండు
ప్రళయాంతకునిలీల బాహులేయుండు
ఇలమహోద్దండుఁడై భృంగీశ్వరుండు
జగదేకవీరుఁడై చండీశ్వరుండు
నగణితాటోపుఁడై యుద్ధనాయకుఁడు
నగభిత్ప్రతాపుఁడై నందికేశ్వరుఁడు
నతులరణాద్యుక్తుఁడై మణిగ్రీవుఁ

దతిబలవిక్రముఁడై మఖమంతుఁ
డాదిగాఁ గలుగుమహాయోధవరులు
మేదురంబుగఁ బన్ని మిన్నుగ్రక్కదల[1]
బెట్టార్చుచును నొకపెట్టున నేఁగి
కట్టల్క గగనభాగంబెల్లఁ గప్ప
ననలానిలాదిదివ్యాస్త్రజాలముల
ఘనతపింజాపింజఁ గదియనేయుటయు;
ఆవిధమంతయు నరుదార నపుడు

### అభిమన్యుఁడు యుద్ధమునందు మూర్ఛిలుట

భావించి గాంచి సౌభద్రుండు గెరలి
జగములు పదునాల్గు జలదరింపఁగను
గగనంబు వగుల శంఖంబుఁ బూరించి
దారుణసింహనాదంబుఁ బర్వించి
ధీరత వారేయుదివ్యబాణముల
నన్నింటిఁ బొడిచేసి యరదంబు నూకి
యొన్నఁగా భృంగీశు నేడంబకముల

1 మేదురంబుగ ధాత్రి మిన్నుగ్రక్కదల (ట)

నారూఢి సేనాని నైదుబాణముల
వీరభద్రునిఁ జండవిశిఖత్రయమున
గణనాథు శితసాయకముల నారింట
మణిమంతు నెనిమిదిమార్గణంబులను
గినుకతో నలమణిగ్రీవు నాల్గింట
ధననాథసుతుని బద్నాల్గుశస్త్రముల
నరవాహనుని ఘోరనారాచతతుల
నెరి నొవ్వ నేసి సైనికుల ఖండించి
యతిరథోత్తముల మహాయోధవరుల
జతురంగబలముల సమయించి మించి
శంభునిపై మహాశక్తి సంధించి
గంభీరముగ నార్చి కనలి యేయుటయు;
ఆమహాసాయక మురుదారఁ గాంచి
వామదేవుండు పావకశరంబునను
ఖండించి కులిశమార్గణము సంధించి
చండకోపాటోపసంరంభుఁ డగుచు
నభిమన్యుపై నేయ నరి శతకోటి
రభసంబుతోడఁ బార్థతనూజు నురము

దాఁకిన ఘనధరాధరముకై వడిని
భీకరంబుగ నార్చి పృథివిపై వ్రాలె
అభిమన్యుపాటు దా నంతయుఁ జూచి
రభసంబుతో నేఁగి రాక్షసేశ్వరుఁడు
ఉభయసైన్యములెల్ల నొగి బెగ్గడిల్ల
త్రిభువనంబులు స్రుక్క దిశలు గంపింప
దారుణంబైన కోదండరాజంబు
జ్యారవం బడరించి శక్తి సంధించి
యనలసాయకమును నద్రిబాణంబు
ననిలశిలీముఖం బమరేంద్రశరము
వరుణమార్గణమును వనధరాస్త్రంబు
గురునిశాశుగమును కులిశబాణంబు
పన్నగారిశరంబు భాస్కరాశుగము
పన్నగబాణంబు పటురౌద్రశరము
నలిరేగి యొకపరి నారి సంధించి
యలిగి కోపించి యాహరున కిట్లనియె
భూతేశ! నీకేల భూరియుద్ధంబు?
నాతో నెదుర్పడ నాదీటు గావు;

పునుకపాత్ర యుబెద్దపులితోలుకాశ
మినుకులుగలగాలి మేఁతలసొమ్ము
పూని ధరించిన పురియలపిండు
పసుఁగుచర్మము హేయ్యంపుపటము
జడలు మెండుగఁ దాల్చి జడియక రేలు
బడుగు కల్లరికాటి పాపనిలీల
భూతిమై పూసి యాఁబోతునెక్కి
జాతిమాలినవేషభాషలు నేర్చి
దయ్యాలరాజవై తగకాడు గాచి
యయ్యెడ నుండక నవికి రాఁ దగునె!
పోఢిమి ఘనులతోఁ బోరాడుటెల్ల
వేడుక కుడుముల వేట్లాటగాదు
పొమ్ము శ్రీకైలాసభూధరంబునకు
నిమ్మహాశరముల నీల్గఁగావలదు ;
అని యార్చి యేసిన నతిభీకరముగఁ
జనుశిలీముఖముల శంభుఁడు గాంచి
ప్రతిబాణముల నవి భంజించి వైచి
యతులసాయకముల నతని నొప్పించి

కనలి యంతటఁ బోక కందర్పవైరి
దనుజనాథుని మాయ దలగింతు ననుచు
నలువొంద వాయు బాణంబు సంధించి
వలనొప్ప మంత్రపూర్వకముగా వైచె
అది రెండు నాలు గై దారును నగుచుఁ
బదియు నల్వదియు నర్వది నూరు నగుచుఁ
గడు నేఁగి వేలు లక్షలు గోటు లగుచుఁ
దడయకఁ జని యర్బుదంబులు నగుచు
ఘనఖర్వములు మహాఖర్వము లగుచుఁ
జని శంఖములు మహాశంఖము లగుచు
బహుపద్మములు మహాపద్మము లగుచు
మహి ననంతానంత మహిమల నేఁగి
దనుజాధినాథునిఁ దద్బలంబులను
దనరు తేజంబులఁ దాఁకె; తాఁకుటయుఁ
బరువడి సురరాజుపై దండు గదలు
గురుతైన కాటుకకొండలో యనఁగ
తిరమొంద మదనుండు దివిజులమీఁదఁ
బరపు నీలోత్పల బాణంబు లనఁగ

గగనతరంగిణీ కంజవాసనల
కెగయు నిందిందిరబృందంబు లనఁగ
నమరారిసైన్యంబు లాకాశమునకు
నమరులు భేదిల్ల నవరూఢి నెగసి
పురహరు ఘనరోషమున కోర్వలేక
పరువు లెత్తెడు దేవభామల మెడల
సరములు త్రెవ్వి విచ్చలవిడి దిశల
నెరసి రాలెడు నింద్రనీలంబు లనఁగ
కడిమి జంఝానిలఘాతంబువలన
పడెడు జంబూఫల పంక్తు లనంగఁ
గొందఱు దనుజులు ఘోరదుర్గములఁ
గొందఱు దానవు లుగ్రకూపంబులందుఁ
గొందఱు రాక్షసుల్ గురునదీతతులఁ
గొందఱు రక్కసుల్ కొండలయందు
గొందఱు దీవుల కొందరు దిశలఁ
గొందఱు జలధులఁ గొందఱు చెరుల
వాపోవుచును బెట్టువడఁకుచు జెలఁగి
చాపకట్టుగఁ గూలె సకలసైన్యములు

వహి కెక్కు నెర యోధవర్యులతోడ
రహిమించు బంధువర్గంబులతోడ
మేరుధీరులు నగు మిత్త్రులతోడ
భూరిబలాఢ్యులౌ పుత్త్రులతోడ
బిరుదులు పోనాడి భీమనందనుఁడు
గురుతైన రణభూమిఁ దోలె నంతయును
గనుఁగొని కనలి పంకజలోచనుండు
కను లెఱ్ఱచేసి శంఖంబుఁ బూరించి

ఘటోత్కచుఁడు మూర్ఛిలుట

బిరుదారిసందోహభీముని భీము
సరసతేజోధనంజయు ధనంజయుని
ప్రాకట బలజగత్ప్రాణుని ద్రోణు
భీకరారాతి విభీష్ముని భీష్ము
తరలని యభిమానధను సుయోధనుని
ధరనగణ్యైభ సైంధవు సైంధవుని[1]

---

1 a. ధరనగణ్యాభవ సైంధవు సైంధవుని (ట)
2 b. ధరనగణ్యా భజనధవుని సైంధవుని (ట)

రమణ బాహుబలాభిరాముని రాము
కమనీయనతుల పుష్కరుని పుష్కరుని
పరికించి పురికొల్పి పాంచజన్యంబు
తరుచుగాఁ బూరించి తమకించి మించి
ధనువున నైదుశస్త్రములు సంధించి
ఘనరోషచిత్తుఁడై గదిసె కృష్ణుండు
నరవాహనుని ఘోరనారాచములను
విరథుని గావించి వివ్వచ్చుఁ డపుడు
గుణరవం బడర నుగ్రునిమీఁదఁ గదిసి

### కృష్ణుఁ డొనర్చిన యుద్ధము

మణికేతనునిఁ గూల్చి మణిమంతుఁ జంపి
పవమానతనయుండు పశుపతిమీఁదఁ
గవిసి నిష్ఠురతరకాండము ల్జొనిపి
గురుభీష్మ గురుసుత కురురాజముఖ్యు
లురుశరావళిముంచి రుగ్రునిమీఁద
భీమార్జునులమీఁద భీమప్రతాప
ధాముఁడై సేనాని తలపడి పోరె

పెలుచ నుగ్రతగురుభీష్ములమీఁదఁ
బలుచిత్రగతి వీరభద్రుండుపోరె
సాత్యకి ప్రద్యుమ్నసహదేవవరుల
నత్యంతబలశక్తి నాగె కుబేరుఁ
డాచార్యతనయతాలాంకులతోడ
నేచివిఘ్నేశ్వరుం డెదిరి పోరాడె
చలమున పుష్కరసాంబులతోడ
జలదరింపకఁ బోరెఁ జండీశ్వరుండు
వరుస తక్కిన యోధవరులు యోధులను
బోరిపోరి జయకాంక్ష బోరు నవ్వేళ
అంతట గెరలి రథాంగధరుండు
కంతువిద్వేషిపై గదిసి యుప్పొంగి;
చటుల శిలీముఖసారము ల్నించి
పటుతరాగ్నిలవహ్ని బాణము ల్దొడిగి
భాసురంబుగ వీరభద్రునిమీఁద
వేసిన నవి దాఁకి యిలఁ గూలె నతఁడు
నారాయణాస్త్రంబు నారి సంధించి
ప్రారూఢమంత్రపూర్వకముగా గుహుని

పై నేయ నది మహాప్రళయప్రచండ
భానువైశ్వానరభాను ప్రకాశ
మగుచు నేతెంచి క్రౌంచారివక్షంబు
పగటున దూరి దెప్పరముగాఁ బడిన
నరుదార నైంద్రాస్త్ర మరిబోసి డాసి
పరువడి విఘ్నేశుఁ బడ నేయుటయును
ధరణిపై నొరగిన తనయులవంక
పరికించి క్రోధించి ఫాలలోచనుఁడు
హరిమీఁద ఘోరశరావళి ముంచి
గరుడధ్వజంబుపైఁ గడు కొన్ని బరపి
యనలాంబకమునఁ దాలాంకుని నొంచి
యనిలసాయకమున ననిరుద్ధుఁ గూల్చి
ద్రోణుని శక్తిచేఁ దునుమాడి పంచ
బాణుని శరపరంపరల మర్దించి
కులిశమార్గణమున గురుసుతు నొంచి
జలధరాశుగమున సాత్యకి ద్రుంచి
సాంబుని ఘనరౌద్రశరమున నణఁచి
యంబకత్రయమున ననిలజు గెడపి

భూధరాశుగమునఁ బుష్కరుఁ డనిమి
షౌఘావళులనెల్ల నొడిఁ ద్రెళ్లనేసి
గాండీవి నొక్కట గళవళపరచి
పుండరీకాక్షుపై భోగిశరంబు
బరపిన హరిరోషభరితుఁడై మండి
గరుడాంబకంబున ఖండింప దాని
గౌరీశుఁ డధికవేగమున సంధించి
శ్రీరమాధ్యక్షుపై శిఖిసాయకంబు
పరువడి జొనిపిన పంకజాక్షుండు
వరుణసాయకమున వారించి కినిసి
కనలుచు ఘనఘనాఘనబాణమేయ
ననిలశరంబున నవి ద్రుంచివైచి
భవుఁడు మహారౌద్రబాణంబు పరప
నవలీల నారాయణాస్త్రంబుచేత
నలినేసి సమ్మోహనాస్త్రంబు వేయ
చెలఁగి శంభుఁడు శక్తిచే నది ద్రుంచి
యబ్జాక్షుమీఁద మహాశస్త్రమేయ
నబ్జభవాండము లట్టిట్టు చెదరఁ

ను దేర శౌరి యాశరము నీక్షించి
నజాసనాస్త్రంబు వైచి నిల్పుటయు;
జచర్మధరుఁడు డగ్గర జేర నేఁగి

హరిహరసంవాదము

జవరదుని మోముఁ గనుఁగొని పలికె
రసిజలోచన! జగములఁ బ్రోవ
ధరణిభారము మాన్పఁ దనర నిర్మింప
నీవు నేనునుదక్క నిఖిలలోకముల
భావింపఁగలరె! యీ ప్రతిభలు వారు
ధననాథ పాండురాట్తనయులవలన
మనలోన మనకింత మాత్సర్యమొదవె
జగతి నెవ్వరికైన సరి జంపరాని[1]
పగ గెల్వ రాదను పటువాక్యసరణి
నెరయ చింతించిన నిక్కువం బాయె;
సరిపోర నిది ధర్మసంకట మాయె;

1. a. జగతి నెవ్వరికైన సాధింపరాని (ట)
b. జగతి నెవ్వరికైన సరిచెప్పరాని (త)

జగముల నింకొక సాటువ గలదు;
తెగి పూఁటబడినచో దిద్దగావలయు[1]
తగఁదోడుపోయినఁ దచ్చునల్ దగదు
జగడంబులోన వంచనసేయరాదు
నిన్ను నమ్మినవాఁడు నెమ్మి ధర్మజుఁడు 166

నన్ను నమ్మినవాఁడు వరశాహానుండు
నీవె గెల్తువటంచు నే గెల్తునంచు
భావింపుచున్నారు బవరంబు మాని
వారికి వేడుకల్ పాటుల్ల మనము
పోరి నాయ మెరింగి పోట్లాడవలయు 167

గరిమతో సాధనకయ్యముల్ సేయ
పరికించువారెల్లఁ బకపక నగరె!
సొలవక నీనేర్పుఁ జూచెద నేను
కలగక నానేర్పు గనుఁగొను నీవు;
అని కేల కేలికేరాభీలజాల. 167
జనన తేజఃకాండచండస్ఫులింగ

1. తెగిపూఁటబడినచో దీర్పగావలయు (2421)

మాలికాలంకార మహితత్రిశృంగ
పాలితఖుర్గాలక పాలమై వెలయు[1]
శూలంబుఁ గైకొని సూటిగాఁ బూని
పోలించి శౌరిపైఁ బూని నిల్చుటయుఁ;
కనకాంబరుఁడు మహోగ్రహమున గెరలి

### హరిహరుల సమరము

కనలి శంకరుని యగ్గలిక వీక్షించి
తగవు లెంచకు మింక ధర్మంబుగాదు
తెగి మరికొంచించితే కార్యహాని
యని పేర్చి పాంచజన్యంబుఁ బూరించి
తనర దక్షిణభుజాదండంబునందు
మధుకైటభాసురమస్తకకంఠ
రుధిరానులేప నారుణిమసంక్రాంత
బహుళతరాజ్యాహుతప్రకటప్రయోగ
వహనహుతాశనజ్వాలికాజాల

---

1. a. పాలికరాలవ హాలమై వెలయు (ట)
 b. ఫాలికా కారాలఫాలమై వెలయు (త)

విలయావసరమధ్య వేలాతివేల
చలిత చరాచర జగదంతరాళ
తంతప్యదుష్ణసంధాన సహస్ర[1]
కాంతిచ్ఛటాంశుప్రకాండ ప్రచండ
సముదయద్వాదశసంఖ్యావిధాన

తిమిరహారాదిత్య దేదీప్యమాన
దశశతసారారధారానుసార[2]
నిశితరథాంగంబు నీటుతోఁ బూని
నలువందపాంచజన్యంబుఁ బూరించి
నొలవక హరునిపైఁ జూడ్కి నిల్పుటయు;

ఆచక్రవాళపర్యంతవిశ్వంభ
రాచక్రమంతదుర్వారవేగమున
వరుస కుమ్మరసారెవై ఖరి నొరసి[3]

1. తంతప్తమానసంధాన సహస్ర (త)
2. a. దశశతసారసంధానానుసార (ట)
   b. దశశతసారాంధధారానుసార (త)
3. వరుసకుమ్మరసారెవైఖరి దిరిగె (త)

గిరగిర గిరగిర గిరగిర దిరిగె;
పటుతర బ్రహ్మాండభాండజాలములు
పటపట పటపట పటపటఁ బగిలె;
తనరారుచున్న పదునాల్గులోకములు
ఘనభయంబుల హల్లకల్లోలమయ్యె;
పొలుపొందునట్టి యంభోనిధానములు
పెలుచ నీరము లింకి బీటలు వారె!
కుతలంబుతో సప్తకులపర్వతములు
గతితప్పి బలుక్రుంగి కానరావయ్యె
ప్రకటించి చీకాకుబడె ఫణిరాజు;
కకలిక లగుచు దిగ్గజములు బెగడె;
సురసమూహంబెల్ల చూడ్కులు మాని
వరువడి వడి పటాపంచగా నేఁగె;
ఆవేళ తల్లడమంది పద్మజుఁడు

బ్రహ్మదేవుఁడు హరిహరులకడ కేతెంచుట వారల స్తుతించుట

వావిరి దగదొట్టివడి దొట్రుకొనుచుఁ
గ్రక్కున హంసతురంగరాజంబు

నెక్కి యక్కజముగా నిలువు నేఱెంచి
ముచ్చరంబున నున్న మాధవహారుల
విచ్చలవిడి ముది వెరగంది చూచి
యిరువురనడుమ దా నెంతయు దుమికి
శరణంబు శరణంబు శరణం బటంచు
నటు మళ్లి యిటు మళ్లి యటు నిటు మరలి
పటుభయభక్తితోఁ బ్రణమిల్లి లేచి
నయ మొందఁగా హస్తనలినము ల్మోగిచి
జయజయ కమలాంక శరశిలాటాంక[1]
జయజయ సితగాత్ర సత్యచారిత్ర
జయజయ గోరాజ సన్నుతతేజ
జయ దైత్యశిక్షపుష్కరహితాబ్జాక్ష
జయజయ గోత్రాత్మజామనోరమణ
జయ రాజశేఖర సలలితోదార
జయజయ వరఖగజానేయజనక[2]

---

1. a జయజయకమలాంక శశిలలాటాంక (త)
   b జయజయకమలాంకశరశిలాటంక.
2. జయజయ భర్గ గజాననజనక (త)

అని యిట్లు మురహరహరుల నెంతయును
వినుతించి భారతీవిభుఁ డిట్లు పలికె
విలసిల్లు వేదాంతవేద్యులు మీరు
పుట్టింపఁ గిట్టింపఁ బోషింప మీరు
పొలుపొంద కర్తలు భోక్తలు మీరు
పట్టుఁ గొమ్ములు మీరె ప్రభువులు మీరె
నూతనలీలావినోదులు మీరె
యీతెఱంగునఁ గలహింపధర్మంబె?
సకలజీవులు మీకు సరిగావె తలఁప
ప్రకటింప హితు లేరి? పగవార లేరి?
తెరలలో బ్రతిమలతెరఁగున జనుల
నొరపుగా నాడించుచున్నారు మీరు
యమసుతుఁ డెవడు? యక్షాధీశుఁ డెవఁడు?
సమమె మీరిర్వురు.జగదీశులార
బాలుఁడ నొకవిన్నపము సేతు వినుఁడు;
మీలోన మీకేల మేటికార్యంబు
భువి నావులావులును బోట్లాడి కెరలి
కవిసిన లేగలకాళ్లెల్ల విరుగు

మీ కేమి పని లేదు మిగిలినయట్టి
లోకముల్ హల్లకల్లోలముల్ గావె;
కోపము ల్వారించి కూర్మి పాటించి
చేపట్టి మమ్ము రక్షింపఁగావలయు;
నని దైన్యరసమున నడలుచుఁ బలుకు
వనజాసనుని గాంచి వరదయానిధులు

— యుద్ధము మానుట —

తగవిచారించి మాత్సర్యముల్ డించి
యొగి మహాయుధముల నుపసంహరించి
గజరాజవరదుండు గజచర్మధరుఁడు
గజిబిజి చాలించి ఘనత నేతెంచి
యెలమితోడ విరించి యెడదయ లుంచి
యలుకు వారించి చయ్యన గారవించి
యిరువురు నొకపరి యిరవందఁ జేరి
కరము రంజిల్ల గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి
యొకటియై ముగ్గురు నుండి యాలోన
మకరాంకవైరితో మాధవుం డనియె

అనఘాత్మ నీవు నే ననుభేద మేమి
మనవినోదవిలాసమహిమలు గాక
నెనయ వేరొండులే దెన్నటికైన
చనిన కార్యంబులు చనఁ గని మింక
ధననాథునకుఁ బాండుతనయుల కిపుడు
కనకాబ్జములనుంచి గలిగె కయ్యంబు
గరిమ రెండును రెండుకన్నులు మీకు
మరి వలపక్ష మేమాత్రము లేదు
వారల వీరల వైరముల్ మాన్చి
గారాపు వియ్యంబు గల్పింపవలయు;
నని పాండవాగ్రణి నర్థనాయకుని

హరిహరులు ధర్మయక్షనాథులకు సఖ్యమును జేయించుట

జనువునఁ బిల్చె నాచక్రాయుధుండు
పిలిచినయంతనె ప్రియసంభ్రమములు
దళుకొత్త శ్రీదుండు ధర్మనందనుఁడు-
క్రమమున నేతెంచి ఘనభయభక్తి
రమణ హరిహర హిరణ్యగర్భులకు

వినయమార్గంబుల వేర్వేర మ్రొక్కి
వినుతులు గావించి వెస నిల్చుటయును;
వేడుక మువ్వురు వీరశేఖరుల
పోడిమి దీవించి పొసగ లాలించి
గారవంబున వారికలక వారించి
గారాపు వియ్యంబు గల్పించి చెలఁగి
హరుఁడు ధర్మజువదనాబ్జంబుఁ జూచి
కరుణారసము చిల్కఁగా నిట్టు లనియె
పాండవాగ్రణి నీద భాగ్యంబు ధరణి[1]
మండలాధిపతుల కీమహిమలుగలవె !
తనయులు చండప్రతాపవిక్రములు
ననుజుల జేయు లగణ్యసాహసులు
నలఘు ధీరోదారు లరిభయంకరులు
బలశౌర్యవిభవులు బాంధవాశ్రితులు
వెలయంగ హైయంగవీనాపహారుఁడు
చెలికాఁడు చుట్టంబు చేరిక మరఁది

1. పాండవాగ్రణి నీవు భరితపుణ్యుఁడవు (క)

దైవంబు భృత్యంబు దాతయై మెలఁగ;[1]
నీవు చేసినపుణ్య మెన్న శక్యంబె!
నీశాంతగరిమంబు నీసత్యమహిమ
నీశౌర్యవిస్ఫూర్తి నీధర్మగుణము
నెరయ నీతాలిమి నీనేర్పునోర్పు
వరుసనార్గురుచక్రవర్తులం దైన
నమర చూడము విన్న యది లేదు రాజ!
మెచ్చె కృష్ణుఁడు నిన్ను మెచ్చితి నేను
యిచ్చకువచ్చిన యేవరం బైన
నడుగు మిచ్చెద నన హరునకు మ్రొక్కి
తడయక నాధర్మతనయుఁ డిట్లనియె;

ధర్మజువరము

పార్వతీవల్లభ భవరోగవైద్య
శర్వ మహాదేవ శంకర భర్గ
భూతనాయక ఫణిభూషణ సర్వ
భూతదయాపర భువనప్రతాప
జలజనాభుఁడు మీరు సద్వినోదములఁ

1. దైవంబు భృత్యుండు దాతయై మెలఁగ (ట; త)

బొలుపొంద సూత్రంపుబొమ్మలలీల
నాడింప మాడెద మంతియకాని
పోడిమి మాకింత బుద్ధులు గలవె
పరమమునీంద్రులు భక్తసంఘములు
వర దేవకోటులు వర్ణింపలేరు;
పరఁగ మీమువ్వురిపాదపద్మములు
వరుస గాంచుటకంటె వరములు గలవె;
యాపద దొలఁగె సౌఖ్యము లబ్బె సకల
పాపముల్పాఱె సంపదలు చేకూఱె
నన్నియు ఫలియించె నైనగిరీశ
చెన్నొంద మీర లిచ్చినవరం బేను
వెరువక వేడెద వినుము మాకొరకు
నరవాహుపైని పంతములతో వచ్చి
కవనిలోఁ జీకాకుగాఁ బడియున్న
బలములనెల్ల నెప్పటివిధంబునను
గలఁగక దొలఁగక కసిగందనీక
నలరంగ బ్రతికింపుఁ డదియె నావరము
అన విని మోదించి యతనివేడుకకు

యుద్ధమున జచ్చినవారు మఱల బ్రదుకుట

మనమున హర్షించి మాధవహరులు
అరుదైనకరుణాకటాక్షమాధుర్య
వరసుధాసారము ల్వర్షించుటయును
వరుసతుత్తుమురులై వ్రాలినయట్టి
నరయక్ష దనుజకిన్నరముఖ్యబలము
లనువందఁగాఁ గోమలాకారు లగుచు
మునుపటికంటెను ముదమునఁ బొదలి
ఘనమైన నిద్ర మేల్కనినచందముల
నెలయు వేడుకలవాహిను లెల్ల లేచి
వెలయు వైభవముల వితతవైఖరుల
నలువందు బంధురానందులై రపుడు;
సురలు వర్షించిరి సూనవర్షములు
దురుసుగా దేవదుందుభులు ఘూర్ణిల్లె
ఘనముగా గంధర్వగానము ల్బరఁగె
విననయ్యె తుంబురువీణారవములు
నమితమై తగె నారదాదులనుతులు

నమరె రంభాదినాట్యప్రసంగములు
నళినలోచనుఁడు పన్నగకంకణుండు
జలజాసనుండును సంతుష్టులైరి
అప్పుడు ధననాథు నాననాంబుజము
తప్పక చూచి కందర్పారి పలికె

### శివుఁడు కుబేరునితో సౌగంధికములను బాండవుల కిమ్మనిచెప్పుట

ధననాథ వింటివె ద్రౌపదీరమణి
కనకాబ్జములు గోరి కాంక్షించె నిపుడు
వనజాతములనుంచి వారికి మీకు
ఘనతరం బైనసంగరము వాటిల్లె
పాండునందనులు మాభక్తశేఖరులు
పుండరీకాక్షునిఁ బొందినవారు
మనము సేయనిబహుమానము ల్పొందు
తనయుల కెవ్వరు దగఁ జేయఁగలరు
వనితాలలామకు వలసినయన్ని
గొనివచ్చి దామముల్ గూర్చి యర్పించు

వహికెక్కు భూషణావళులమన్నించు
బహుచిత్ర కాంచనాంబరము లిప్పించు
కినుక చాలించి మిక్కిలి గారవించు
మనవంద సెలవిచ్చి యనుపు మన్నంత
హారునివాక్యములకు నంగీకరించి
నరవాహనుండు నానందంబునొంది

## కుబేరుఁడు సౌగంధికములఁ దెచ్చి యిచ్చుట

ఘనతరసౌగంధిక ప్రసూనములు
వినుతభూషణములు విమలాంబరములు
తరుచైన దివ్యగంధంబులు మరియు
తిరమొంద వేవేగఁ దెప్పించి యపుడె
చనవున బిలిచి యజాతశత్రునకు
ననిలనందనున కర్జునునకు నకుల
సహదేవులకును బాంచాలపుత్త్రికిని
రహిమీరఁ జెల్వగ్గి యలంకరించుటయు
వారివారు లూర్జాంచితానందులైరి

హరిహరుల సంతోషము

అరుదంది యుభయసైన్యంబు లుప్పొంగ
ధనపతి యాపురందరతనూభవుని
గనుఁగొని యనురక్తి గౌఁగిటఁ జేర్చి
క్ష్మాతలాధిప! హరిశ్చంద్రాదిసర్వ
భూతలాధిపులందు బురుహూతముఖ్య
దివిజనాథులయందు దిక్పతులందు
వివరింప నీసాటివీరులు గలరె
మును నిన్నుఁ జెప్ప సొంపున విందు నేఁడు
గనుఁగొనఁగలిగె కన్గవ చల్లనాయె;
పరశురాముఁడు నీకు ప్రతి యనవచ్చు
శరలాఘవప్రౌఢిసంధానగరిమ;
నిటలాగ్నినయనుఁడు నీదీటువచ్చు
చటులబాహాటోపసాహసప్రతిభ;
జలజనాభుఁడు నీకు సరివచ్చు సమర
తలమున చిత్రయుద్ధంబులు నెరప;
విపులపైఁగలధరావిభు లెవ్వరైన

నృపచంద్ర నినుఁ జూచి నేర్చుకోఁగలరె
నిజబల్మి యున్నది నీరజాక్షుండు
విజయనీకాప్తుఁడై వెలయుచు నుండ
నాలంబులోన బాహాశక్తిఁ జూప
నీలోకములను నీకెదు రెవరయ్య
యనుచు మెచ్చుచు బునరాలింగనంబు
లొనరించి తగు వేడ్కఁ నున్నంతలోన;

### బ్రహ్మ సత్యలోకమునకుఁ బోవుట

ఆవేళ పద్మజుం డధికమోదమున
భావజజనకుని భార్గవీధవుని
కడకతో సన్నుతు ల్గావించి మ్రొక్కి
తడయక పాండునందనుల దీవించి
యరుదైన హంసవాహనముపై నెక్కి
కరమర్థి సత్యలోకంబున కరిగె

### కుబేరుఁ డలకాపురమునకుఁ బోవుట

శంకరునకు నమస్కారంబుఁ జేసి
పంకజాక్షున కట ప్రణమిల్లి పొగడి

నలువంక పాండునందనుల దీవించి
పొలుపొంద పాంచాలపుత్త్రి దీవించి
చెలువంబుతో సర్వసేనల గూడి
యలకాపురంబున కరిగె శ్రీదుండు
ప్రేమతో ధర్మజభీమార్జునులను
వేమరు కృప గారవించి దీవించి
యదువంశభూషణుం డనుప నత్యంత

శివుఁడు కైలాసమునకుఁ బోవుట

ముదమున గైలాసమున కేఁగె హరుఁడు

దుర్యోధనుఁడు కరిపురంబునకుఁ బోవుట

తలఁప ధర్మజునకు దండంబు వెట్టి
వలనొప్ప శౌరికి వలనొప్ప మ్రొక్కి,
యరుదార సకలసైన్యసమేతుఁ డగుచుఁ
గరిపురంబునకును గదలె రారాజు;

కృష్ణుఁడు ద్వారక కేఁగుట

ధర్మసూనునకు వందన మాచరించి
[illegible] నెల్ల

బరఁగ దీవించి ద్రౌపది నాదరించి
సరసోక్తులను నుపచారముల్ చేసి
చెలిమి ఘటోత్కచు నెసగ లాలించి
యలరి వారలనుతు లంగీకరించి
యదువాహినులతోడ నబ్జలోచనుఁడు
పొగడుచు ద్వారకాపురమున కరిగె;

**ఘటోత్కచుఁడు వెడలుట**

ఎలమితో జనకుల కెల్లను మ్రొక్కి
పొలుపొంద బాంచాలపుత్రికి మ్రొక్కి
రాజిల్లు మహానివిప్రకులంబునకును
దేజంబుతో మ్రొక్కి దీవనలంది
జనకుల యనుమతి సైన్యంబుతోడఁ
దననివాసముఁ జేరె దానవేశ్వరుఁడు

**తర్వాతిభారతకథ**

ధరమహోన్నతులైన తమ్ములతోడ
పరమసాధ్వీమణి పాంచాలితోడ
వలనొప్పు బాంధవవర్గంబుతోడ

నలరుచు నున్న ధౌమ్యాదులతోడ
పోడిమి నావనభూమి గొన్నాళ్లు
వేడుకల్ మీరంగ విహరింపుచుండి
కడుద్వాదశాబ్దము ల్గడచినపిదప
తడయక ననుజులు ద్రౌపది తాను

వెలయంగ నొకయేడు విరటునియొద్ద
కొలువుండి తర్వాత గురుతులు దెలిపి
యలరుచు నుత్తర కభిమన్యునకును
జెలగి వివాహంబు చేయించి వేగ
విరటుండు ద్రుపదభూవిభుఁ డాదిగ్గైన

నరవరులరుదేర నలినలోచనుఁడు
ఘనతసహాయుఁడై గరిమతో నడువ
జని కురురాజుపై చల మగ్గలించి
మునుకొని సుముహూర్తమున సేనతోడ
మొనసి కురుక్షేత్రమున దండు విడిసి

పెలుచసంగరమున భీష్ముఁ జెండాడి
నలవడ కలనిలో నాచార్యుఁ దునిమి

కరకరి బోరిలోఁ గర్ణునిఁ జంపి
సరభసం బగు నని శల్యునిఁ గూల్చి
కలఁగక నొంటరి కయ్యంబునందు
తలపడి యురగకేతనుని ఖండించి
యురవడి తక్కిన యోధుల నెల్ల
వరుసతో ఘోరావహమున మర్దించి
పరువడి యందుండి పాండునందనులు
సరసిజాక్షుని కటాక్షంబునఁ జెలఁగి
సకలభాగ్యంబులు సకలసంపదలు
సకలసౌఖ్యంబులు సకలవైఖరులు
ప్రకటించి సకలభూభాగమంతయును
బలువిడి సకలభూపాలకు ల్గొలువ
నెలమి మహోన్నతి నేలుచు నుండె
ఈమహాచరితంబు హితసంభ్రమముల
వేమరు చదివిన వినిన వ్రాసినను
ప్రేమ లిఖించిన పృథ్వీతలమున
నామహామహులకు నాయు రారోగ్య
బహుపుత్త్రపౌత్త్రసౌభాగ్యసంపదలు

మహనీయభూషణాంబరవస్తుతతులు
కరితురంగాందోళికానికాయములు
కరిరాజవరదుండు కరుణతో నొసఁగు.
అని జనమేజయక్ష్మానాథమణికి
జననుతుం డైన వైశంపాయనుండు
వినిపించె పాండవవిజయకావ్యంబు
తనరు వేడుకలవిస్తారంబుఁగాఁగ
నెన్నాళ్లు రవిచంద్రు లెన్నాళ్లు తార
లెన్నాళ్లు గగనోర్వు లెన్నాళ్లు జగము
లెన్నాళ్లు కులగిరు లెన్నాళ్లు జలధు
లెన్నాళ్లు వేదంబు లెన్నాళ్లు ధర్మ
మెన్నాళ్లు హరిచర్య లెసఁగుచునుండు
నన్నాళ్లు సకలరాజాస్థానములను
సకలవిద్వజ్జనసమ్మతం బగుచు
నకలంకలీలల నలరుచు నుండు
అని యిట్లు కురుకరూశాంగకాశ్మీర
జననాథకీర్తిత సత్కీర్తి పేర

కరహాటకర్ణాటగౌళనేపాళ[1]
ధరణీశ వినుతప్రతాపుని పేర
వహికెక్క సర్వదేవంతుని పేర
మహనీయచిత్ర హేమధ్వజు పేర
సరసారుణోజ్వలచ్ఛత్రుని పేర[2]
గురుతర వెల్లుట్లగోత్రుని పేర
నరపతి దత్తనానారత్నభూష
కరితురంగశతాంగఘనభాగ్యు పేర[3]
సింధురాజార్పితసింధురఛత్ర
సైంధవ బంధురస్యందను పేర
సౌరాష్ట్రనృపదత్త సలలితరత్న
హారుని పేర దీనావను పేర[4]

---

1. కరహాటవరహాటగౌళనేపాళ (త)
2. a. సరసారుణోజ్వలచంద్రుని పేర (త)
   b. సరసారుణోజ్వలచల్వుని పేర (ట)
3. కరితురగశతాంగగణభాగ్యు పేర (త)
4. a. హారుని నవవేగిసాయను పేర (ట)
   b. హారుని వరవేగివాయుని పేర (చ)

రణవీరఘుంటానిరాతంకమల్ల[1]
ప్రణుతసింహాతరాట పరబలభీమ
నిత్యాభిరామ నిర్నిద్రప్రతాప
సత్యహరిశ్చంద్ర సంగడిరక్ష
పాలకగాయగోవాళహంవీర[2]
కేళాదిరాయ సత్కీర్తికలాప
చలమర్తి వరగండ జగనొబ్బగండ
కలితాదవనిదుర్గగర్వవిభాళ
హాత్తుమువ్వరగండ హర్యక్షశౌర్య
మత్తారి మదభంగ మదనావతార
కనక వసంతాంక గగ్గోలురాయ[3]
ఘనతరప్రజ మెచ్చు గండాదిఘోర
బిరుదాంకుపేర గంభీరాబ్ధిపేర[4]

---

1. రణవీరఘుంటానిరాటంకమల్ల (త)
2. a. పాలక రాజగోపాల హంవీర (ట)
   b. పాయక గాయగోపాల హంవీర (త)
3. కనక వసంతాఖ్య గగ్గోలురాయ (త)
4. బిరుదాంకుపేర గంభీరుని పేర (త)

వరభోగనిర్జితవాసవు పేర[1]
రావిళ్ల కొండభూరమణుని లింగ
భూవరాగ్రణి పేర బుధులౌ ననంగ
నంకితంబుగ వెంకటాద్రీశుపాద
పంకజద్వంద్వసేవావిహారుండు
రత్నాకరాన్వయ రాజితక్షీర
రత్నాకరక్షపారమణీధవుండు
గురుభరద్వాజసద్గోత్రపావనుఁడు
ధరకొండ ఘనుకృష్ణధన్యునిసుతుఁడు[2]
సరసుఁడు గోపాలసత్కవీంద్రుండు
గరిమ నొనర్చు సౌగంధికప్రసవ
హరణకావ్యమునందు యక్షనాయకుఁడు
(గరిమ)సైన్యములతో గదలివచ్చుటయు[3]
వచ్చుట గని పాండువరతనూభవుఁడు

---

1. వరభోగ(ని)ర్జరవాసవు పేర (త)
2. ధరకొండ ఘనకృష్ణధన్యునిసుతుఁడు(ట ; త)
3. కవిబుధుల్ మెచ్చఁగా కారణమగుచు.

చెచ్చెర నొకసంధి సేయఁబూనుటయు
గాండీవి దాని విఘ్నంబు సేయుటయు
మండలాధిపునితో మక్కువ సేయ
ధనపతి తలఁచుట తత్సూనుజుండు
వినకయుండుట బలు విడికయ్య మగుట
తగ క్రీడి చిత్రయుద్ధంబు సేయుటయు
నిగుడి శిఖండు గాండీవిమార్కొనుట
వేరైన యోధులు వెనఁగిపోరుటయు
నారూఢి హనుమంతు డర్ధనాయకుని
కనియుట బరికించి క్రీడి నిల్పుటయు
నని బవాళిం బోట యది విని హరుఁడు
యతూధిపతికి సహాయంబు సనుట
వీక్షించి కురుకులవిభుఁడు చింతిలుట
సురనదీతనయుండు జోళ్ళగ్ప్రరించి
గరిమధర్మతనూజు కలఁకదీర్చుటయు
హరిపాండవులకు సహాయంబు జనుట

ధరణీశ్వరుండు మోదంబు నొందుటయు
హరి శంకరునిమీఁద నని సేయ సనుట
సురసైనికులు యతికోటిపై సనుట
భైరవునకు హిడింబానందనునకు
బో రగ్గలం బౌట పోరి భైరవుని
సురవైరి గూల్చుట చూచి రుద్రుండు
నరసుతభీమనందనుల ద్రుంచుటయు
హరి శంభుపుత్త్రుల నని నొంచుటయును
హరితనూజుల శంభు డట్ల సేయుటయు
హరిహరులకు యుద్ధ మధికంబు నగుట
హరుఁడు మహాశూల మంకించుటయును
గరిమతో హరిరథాంగంబుఁ బూనుటయు
అయ్యెడ కబ్జజుఁ డరుగుదెంచుటయు
చయ్యన నిరువుర సన్నుతించుటయు
కలహంబు మ్మానుట కలనిలోఁ బడిన
బలములనెల్లను బ్రతికించుటయును

హరిహరుల్ ధర్మజయమునాథులకు
గరిమ మీరంగ సఖ్యంబు సేయుటయు
హరిహరులును సహాయమునచ్చువారు
సరగున నిజనివాసముల కేఁగుటయు
తమ మేర చెల్లించి తగ పాండుసుతులు
విమతులఁవధియించి వేడ్క నుండుటయు
క్రమమున నది యాదిగాఁగల్గుకథల
నమరుచు నిది తృతీయాశ్వాసమయ్యె
భూరి సౌగంధికపుష్పాపహరణ
చారిత్ర మిది కథాసంపూర్ణమయ్యె
వెలయ నీపాండవవిజయకావ్యంబు
సలలితహృదయులై సద్భక్తిగరిమ
నలరుచు బూజించి యానందమునను
చెలువంబుగలవారిచేఁ జదివించి
చదివినవారల చనవులఁ బ్రోచి
సదమలమతి కథాసావధానముల

విన్నవారల కెల్ల విభవసంపదలు
సన్నుతవస్తుభూషణములు గలుగు
నెల మూఁడువానలు నెలకొని కురియు
బలుసస్యసంఘము ల్ఫలియించు నెపుడు
సురుచిరకల్యాణశోభనంబులను
ధరణీజనములెల్లఁ దనరుచుండుదురు. 2085



చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1949.

# పద్య కావ్యము.



| | | | |
|---|---|---|---|
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము | ... | 15 | 0 |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు | ... | 1 | 8 |
| ,, టీక | ... | 4 | 0 |
| ఆంధ్రభారతము, పద్యకావ్యము:— | | | |
| ఆది సభాపర్వములు గలసంపుటము | ... | 4 | 0 |
| ఆరణ్యపర్వము | ... | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు | ... | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు | ... | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 4 | 0 |
| శాంతిపర్వము | ... | 4 | 0 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | | 4 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 11 | 4 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | ... | 7 | 8 |
| శాంతిసప్తకము | ... | 7 | 8 |

# శుద్ధపత్రము

| పుట | పంక్తి | అప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 17 | ప్రతాపములును | ప్రతాపములు |
| 3 | 35 | చక్కెఱ | చక్కెర |
| 3 | 44 | డక్కనసేర్చిన | డక్కనఁజేర్చిన |
| 4 | 48 | కొరకు | కొఱకు |
| 4 | 49 | దురసు | దురుసు |
| 4 | 55 | పామున్ను | సామున్ను |
| 6 | 83 | గొరడ | గొండ |
| 6 | 94 | ప్రమాణములు | ప్రణాముల |
| 6 | 95 | యాహారవిధులం | యాహారవిధుల |
| 9 | 135 | పద్మములు | పద్మముల్ |
| 9 | 136 | కవులు | కవుల |
| 9 | 137 | గుణుతించి | గణుతించి |
| 13 | 205 | యనిలుగొని | యనిలునిగొని |
| 16 | 255 | వనితనొక్కెత | వనితయొక్కెత |
| 17 | 272 | ఆఘుటనోఘుటణాఖ్య | ఘుటనోఘుటనవిఖ్య |
| 17 | 275 | నగణికనవరత్న | నగణికరత్న |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 17 | 285 | సైంధవాంగోళి | సైంధవాందోళి |
| 18 | 294 | నిరినిరో | నిరునిరో |
| 19 | 306 | మదంకితముగా | మదంకితము |
| 20 | 322 | రాసిచంద్రు | రాశిచంద్రు |
| 20 | 323 | నిపీతార | నిశీతార |
| 21 | 352 | విమతరాడ్బయ | విమతరాడ్భయ |
| 22 | 356 | బెల్లుగో | జెల్లుగో |
| 23 | 375 | జగపతి | గజపతి |
| 24 | 385 | బరగు | బరగిన |
| 24 | 391 | పావనుండు | పావనుడు |
| 25 | 408 | షొదలుగ | షొదలు, గనీఖుం |
| 25 | 415 | సొచ్చి | జొచ్చి |
| 27 | 442 | సిద్ధాంబి | సిద్ధాంబ |
| 28 | 460 | శంకరసర్వేశ | శంకరాద్రీశ |
| 32 | 509 | వీరసేనలుజల్లు | వీరసేసలుచల్లు |
| 33 | 529 | ధరడొళ్లి | ధరడొల్లి |
| 35 | 555 | దగ్ర | దుగ్ర |
| 38 | 608 | పైసొచ్చి | పైజొచ్చి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 40 | 637 | మనుజాధినాద | మనుజాధినాథుల |
| 41 | 655 | వితరణంజొ | వితరణ జొ. |
| 43 | 673 | ఏపగు | పరగు |
| 43 | 688 | చూడఁగ | చూడఁగ |
| 44 | 701 | జంఘిలో | జంఘికాల్ |
| 45 | 704 | నియాకములు | నికాయములు |
| 45 | 714 | యల | యిల |
| 46 | 723 | గాలంబు | కాలంబు |
| 52 | 57 | బొదలు | పొదలు |
| 55 | 106 | వరిపక్వంబులు | బరిపక్వంబులు |
| 57 | 131 | నఃపరతి | ఉపరతి |
| 58 | 158 | బుట్టెడిని | పుట్టెడిని |
| 58 | 159 | యీాచెంత | ఈచెంత |
| 59 | 162 | యెక్కువ | నెక్కువ |
| 60 | 180 | నిది | విది |
| 61 | 204 | యలసి | నలసి |
| 62 | 214 | వగలును | బగలును |
| 62 | 217 | యేకోర్కి | నేకోర్కి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 64 | 246 | యీసీలవేణి | నీనీలవేణి |
| 67. | 288 | నిఖిల | అఖిల |
| 68 | 3,6 | రభాంగ | రథాంగ |
| 72 | 385 | వినయంబుతో | వినయంబుతో |
| 73 | 402 | నతని | యతని |
| 74 | 427 | యావాసవు | నావాసవు |
| 75 | 432 | యన్నకు | నన్నకు |
| 76 | 458 | యామహా | ఆమహా |
| 77 | 464 | యిందిందిరాలక | ఇందిందిరాలక |
| 77 | 468 | దివ్యాంబరములు | దివ్యాంబరమ్ములు |
| 79 | 506 | వాంఛలు | వాంఛల |
| 79 | 516 | శౌర్య | శౌర్య |
| 80 | 528 | రేఖ | రేఖా |
| 83 | 573 | మిముజూచుకొనుచు | మిమ్ముజూచుకొని |
| 83 | 578 | కేతెంచి | కీడెంచి |
| 87 | 629 | యవనిపై | నవనిపై |
| 89 | 648 | యిరవొంద | ఇరవొంద |
| 90 | 683 | యేఫలంబు | నేఫలంబు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 92 | 717 | దారుణి | ధారుణి |
| 94 | 747 | ననుగొంటి | గనుగొంటి |
| 95 | 760 | వేయూరు | వేమారు |
| 96 | 767 | కనుపులై | కదుపులై |
| 97 | 799 | లెత్త | లెత్తి |
| 98 | 809 | గిరిగింజ | గురిగింజ |
| 98 | 813 | పొలపొంద | పొలుపొందగో |
| 99 | 822 | ఐనాంతమున | వనాంతము |
| 100 | 844 | [illegible]శుండి | గొననుండి |
| 105 | 927 | నకలంకలీల | నకలంకలీలల |
| 108 | 984 | హారిణీయత | హారిణీయుత |
| 118 | 1144 | మునుపు | మునుపె |
| 120 | 1182 | గాక | గాకయీ |
| 124 | 1233 | కమలంబులనెంత | కమలంబులెంత |
| 126 | 1263 | మనోశేగ | మనోవేగ |
| 127 | 1279 | నిఋతి | నిర్ఋతి |
| 128 | 1288 | ఖాలింతునో | గాలింతునో |
| 129 | 1300 | రాజ | రాచ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 131 | 1340 | చేజేత | చేసేత |
| 131 | 1341 | ాంపంబు | పాంపము |
| 134 | 1385 | పల్కి | పల్క |
| 136 | 1419 | యతడు | అతడు |
| 143 | 1484 | పంజ | పంకేజ |
| 144 | 1509 | నెల్లడల | నెల్లెడలను |
| 147 | 1545 | పంచబాంరా | పంచసార |
| 152 | 1603 | నురుల | నురల |
| 155 | 1642 | యిందయున్న | ఈందయున్న |
| 159 | 1703 | నొక్కుచు | మెక్కుచు |
| 160 | 1715 | పిచ్చుగుంట | పిచ్చుగుంటు |
| 160 | 1721 | మానవాధీశ | ఓమానవాధీశ |
| 161 | 1732 | శ్రీకాంతున కెన | శ్రీకాంతునకు సెన |
| 165 | 1800 | కిట్టటు | లిట్టటు |
| 167 | 1823 | వర్ధిక్య | వార్ధక్య |
| 168 | 1838 | చంద్రుడు | భద్రుడు |
| 168 | 1848 | ధీమస | డీమస |
| 171 | 1884 | వావి | దాకి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 174 | 1885 | జెదరక | చెదరక |
| 176 | 1961 | నరుల్ | నదుల్ |
| 177 | 1979 | నిగుడి | నిగిడి |
| 181 | 2042 | యనువెల్ల | ననువెల్ల |
| 181 | 2043 | యనుపమా | ననుపమా |
| 183 | 2059 | మేఘుసాదోధి | మేఘుపాథోధి |
| 184 | 2069 | నాదవీని | ఆదవనీ |
| 186 | 2094 | నతడు | యతడు |
| 188 | 19 | నగ్రజు | యగ్రజు |
| 191 | 66 | బరగు | పరగు |
| 191 | 67 | గామాదు | కామాదు |
| 195 | 141 | నుచ్చైశ్రవము | నుచ్చైః శ్రవము |
| 196 | 145 | కామినీ | కామిని |
| 210 | 386 | నెదురేగి | యెదురేగి |
| 212 | 423 | జాండు | జాడు |
| 214 | 448 | నదలుచు | నడలుచు |
| 217 | 496 | గంపింప | కంపింప |
| 228 | 677 | సురల | సురుల |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 230 | 714 | అమ రేందు | అమరేంద్ర |
| 232 | 746 | కాకతాళీ | కాకతాళ |
| 237 | 827 | శత్రుడవై | శాత్రవుడవై |
| 255 | 1075 | భూధిశ్రవ | భూరిశ్రవః |
| 253 | 1085 | వాసుసుతుడు | వాయుసుతుడు |
| 254 | 1087 | యోధరాధీశ | ధరాధీశ |
| 258 | 1168 | జర్ఝంత | జర్జరిత |
| 264 | 1268 | బడ | పడ |
| 265 | 1281 | పదునాల్గు | పద్నా |
| 267 | 1329 | పదింట | పదిట |
| 271 | 1399 | నాడరో | యాడరో |
| 274 | 1435 | దామఘు | దామమ్ము |
| 274 | 1438 | జెంత | చెంత |
| 276 | 1464 | జను దెంచి | జనుదెంచియన్నడు |
| 277 | 1496 | భూరిశ్రవుల | భూరిశ్రవసుల |
| 278 | 1514 | నొక్కండు | నొక్కడు |
| 285 | 1619 | దత్తెలు | దత్తులు |
| 288 | 1680 | వీరులతో | వీరులతోడ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 289 | 1689 | యోధులు | యోదలు |
| 295 | 1793 | భాజితంబు | భ్రాజితంబు |
| 313 | 2105 | విధములు | విధమ్ములు |
| 315 | 2138 | యుర | యంరః |
| 321 | 2249 | నక్షత్రములు | నక్షత్రముల్ |
| 321 | 2252 | సమహిత | సుమహిత |
| 324 | 2311 | వరుణాంబకము | వరుణాంబకమ్ము |
| 325 | 2320 | గరుడుర్వాది | గరుడులిర్వారి |
| 328 | 2383 | కేలాకె | కేలకై |
| 329 | 2397 | వేగ | వేవేగ |
| 329 | 2402 | ధనవంది | ధనువంది |
| 330 | 2412 | నర్మితో | నర్మలితో |
| 332 | 2455 | శ్రీమహా | శ్రీమహీ |
| 334 | 2475 | రచియించినట్టి | రచించినయట్టి |
| 336 | 2509 | యివ్వలి | యవ్వలి |
| 336 | 2511 | నిల్చుటాది | నిల్చుటలా |
| 340 | 54 | యిాటల | యాబల |
| 341 | 76 | హారావ | ఘోరావ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 342 | 89 | సమయంబునసె | సమయంబున |
| 345 | 146 | ధీరతో | ధీరతతో |
| 346 | 165 | నింతింత | నింతంత |
| 347 | 172 | కని | గాంచి [చు |
| 348 | 192 | మహోత్సాహి | మహోత్సాహివీవను |
| 348 | 196 | శూరుడంచు | శూరుడవంచు |
| 350 | 231 | నలిని | నలిగి |
| 355 | 307 | యయ్యధిప | నయ్యధిప |
| 355 | 308 | ముందర | మందర |
| 360 | 403 | లతికె | లతిక |
| 366 | 499 | బెట్టు | బెట్టుగ |
| 377 | 684 | తరహాసు | దరహాసు |
| 387 | 845 | నాసమయమునను | నాసమయమున |
| 388 | 857 | కలశె | కలవె |
| 392 | 930 | యెంత | నెంత |
| 393 | 942 | యేగు | నేగు |
| 394 | 961 | మున్నగ | మున్నుగ |
| 395 | 968 | మింకార | ఘీంకార |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 395 | 980 | బంధ | బంధు |
| 396 | 985 | సమయమునను | సమయమున |
| 400 | 1066 | పాంసీక | పాంసీకయం |
| 401 | 1085 | బలిపెట | బలిపెట్ట |
| 402 | 1100 | ఈవాహినులను | వాహినులె కావ |
| 405 | 1139 | నని | యని |
| 413 | 1271 | నరిది | యరిది |
| 413 | 1275 | చిన్నయ | చిన్మయ |
| 418 | 1361 | పృధ్వి | పృథివి |
| 420 | 1401 | తెగువ | బిగువ |
| 422 | 1434 | దొరుల | దొరల |
| 427 | 1515 | యూబోతు | యూబోతును |
| 430 | 1568 | గురుతైన | దురుసైన |
| 436 | 1669 | పాటుల్ల | పాటిల్ల |
| 437 | 1679 | పాలిత | పాలి |
| 437 | 1687 | కైటా | కైట |
| 439 | 1713 | బడి | వడి |
| 442 | 1766 | గంజిల్ల | రంజిల |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 444 | 1794 | పతుల | పుల |
| 446 | 1818 | మాడెద | వాడెద |
| 460 | 2036 | తత్రాను | తత్తనూ |